









# మీపాపాయి సంక్షేమమే మాముఖ్యఆశయం

ప్రపంచవ్యాప్తంగా డాక్టర్లంతా తల్లి పాలను పసిపాపలకు కావలసిన పోషక పదార్థాలతో పాటు,రోగ నిరోధక శక్తిని పరిపూర్ణంగా యిచ్చే పౌష్టిక ఆహారంగా అంగీకరించారు.

తల్లి పాలు సమృద్ధిగా లేనప్పుడు పాపాయికి 'విజయ స్ప్రే' వంటి 'శిశు ఆహారం' ఇవ్వడం మంచిది. సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియావారి ఫార్ములాను అనుసరించి విజయస్ప్రేను స్వచ్ఛమైన పాలు, విటమిన్లువంటి పోషక పదార్థాలతో కలిపి రూపొందించారు. లోపల చక్కగా సీలు వేసి, ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్ మరియు కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రీసెర్చి ఆఫ్ ఇండియావారి అనుమతి పొంది మీ వద్దకు వస్తోంది. మీ పాపాయికి కావలసిన అన్ని పోషక పదార్థాలతో శాస్త్రీయంగా అత్యంత శ్రద్ధతో ఉత్పత్తి చేయబడుచున్న అమూల్య ఆహారం.

## విజయస్ప్రే

తల్లిపాలు పసిపిల్లలకు అత్యుత్తమ మైనవి.

శిశు సంక్షేమం కోరి విడుదల చేసినవారు ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్

విజయ స్ప్రే తయారు చేయువారు

FDS APDDCFL 38 83 Tel

# మహాకవి శ్రీ శ్రీ అస్తమయం



'మహాప్రస్థానం' గేయ సంపుటి రచయిత, ఆధునిక తెలుగు సాహితీ లోకంలో అభ్యుదయ కవితోద్యమానికి ఊపిరిపోసి, తిరుగులేని నాయకుడిగా, ఎందరో ఆధునిక రచయితలకి మార్గదర్శిగా, ఆశాజ్యోతిగా వెలుగొందిన మహాకవి శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు జూన్ 15వ తేదీ సాయంత్రం మదరాసులోని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలో తమ అంతిమ శ్వాస విడిచారు. ఆయన వయస్సు 73 సంవత్సరాలు భార్య, ముగ్గురు కుమార్తెలు, కుమారుడు ఉన్నారు.

శ్రీశ్రీ కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు, సోవియట్ లాండ్ అవార్డులని అందుకున్నారు. రష్యా, చైనా, ఇంగ్లాండ్ దేశాలలో పర్యటించారు.

'మహాప్రస్థానం'లో ఆయన తమ సాంఘిక, ఆర్థిక సిద్ధాంతాలని ప్రతిపాదించారు.

శ్రీ శ్రీ రచనలు రష్యన్‌లోకి, మరెన్నో ఇతర భాషలలోకి అనువదింప బడ్డాయి. తమ రచనలని ఆయన ఆంగ్లంలోకి అనువదించారు తెలుగునించి తమిళం, తమిళంనించి తెలుగులోకి కూడా ఆయన ఎన్నో అనువాదాలని చేశారు అనేక చిత్రాలకి మాటలు, పాటలు రాశారు, ఒక చిత్రాన్నికూడా నిర్మించారు.

తమ మార్గం అనన్యసాధ్యం అని శ్రీ శ్రీ పేర్కొన్నప్పటికీ, ఎందరో ఆధునిక రచయితలు ఆయన శైలికి ఆకర్షితులై అదే ఒరవడిలో రచనలు చేశారు. కానీ శ్రీ శ్రీది విశిష్టమైనట్టి ఒక ప్రత్యేకశైలిగా ప్రముఖులు, విజ్ఞుల ప్రశంసలని అందుకున్నది కీ. శే. విశ్వనాథ సత్యనారాయణగారు కూడా శ్రీ శ్రీ రచనా విధానాన్ని ప్రస్తుతించారు శ్రీ శ్రీ 'ప్రాసక్రీడలు' పాఠకుల మనసులలో చెరగనిముద్ర వేస్తుంది

శ్రీ శ్రీ రచనలలో, సంఘ సంస్కరణాభిలాష కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

మొదట్లో శ్రీ శ్రీ చక్కని ఛందోబద్ధమైన ఎన్నో రచనలు చేశారు. మహాభారతంలో తిక్కన పద్యాలకి ఆయన చేసిన వ్యాఖ్యానం మళ్లీ మళ్లీ చదివించేటంత మధురంగా ఉంటుంది.

మహాకవి శ్రీ శ్రీ అస్తమయంతో ఆధునిక కవితా ప్రపంచంలో ఒక విప్లవ జ్యోతి ఆరిపోయింది



## ముఖచిత్రం

[3–6–83] ఈ వారం ముఖచిత్రం చూశాక ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేక పోతున్నాం. కళ్ళతో సరిగమలు పలికించే "సిల్క్ స్మిత" ముఖచిత్రం సర్వాంగ సుందరంగా ఉంది.

యం. డి. అస్లాం (ఇల్లెందుకాలరిస్)

## సీరియల్స్

27–5–83 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక "నటి దీప" ముఖచిత్రం ఆకర్షణీయంగా వుంది. సీరియల్స్‌కూడా చాలా బాగున్నవి. కొత్త సీరియల్ "ఇది మేఘ సందేశమూ" మొదట్లోనే మమ్ము ఆకట్టుకొంది.

ఆర్. సుజాత, సునీత (చెరోదాదుర్గ్)

* * *




27–5–83 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం చాలా బాగుంది.

'ఇది మేఘ సందేశమూ'సీరియల్ బాగుంది. ఇంకా ముందు ముందు ఇంకెలా ఉంటుందో ! 'తిరుచరణాలు' చాలా ఆకర్షణీయంగా ఉంది.

ఎం. వేణు (విశాఖపట్నం)

## తిరుచరణాలు

17.6.83 సంచికలో లల్లాదేవిగారి సీరియల్ 'తిరుచరణాలు'లో 14వ పేజీ మూడవ కాలము నాల్గవ పేరా ఆఖరులో 'త్రిపురాంతకుడు' అని ఉండవలసినచోట 'గోపాలదేవుడు' అని ఉంది. అట్టమీది బొమ్మ జయసుధ చాల బాగుంది.

కె. భూపతి (కంచిలి)

## నీహారిక

కుమారి ఎ.వి. శేషారత్నంగారు రచించిన 'నీహారిక' కథలో ఎంతో సహజత్వం ఉంది. సమాజంలో నేడు ఎన్నో కుటుంబాలలో జరిగే సంఘటనలనే ఆమె ఎంతో చక్కగా వివరించారు. 'నీహారిక' కథ మా మనస్సులను కూడ మంచులా కరిగించింది.

కె. వి. సుభద్రాదేవి (భీమవరం)

## "తనదాకా వస్తేనే....!"

కట్టా రామ్‌బాబుగారి కథ "తనదాకా వస్తేనే" భలే బావుంది.

పి. వి. సూర్యనారాయణ (వెదురుపాక)

## న్యూఢిల్లీ లేఖ

ఈ వారం (10–6–83)మా అభిమాన పత్రిక సంచికలో, డా॥ జయ్‌దు బాషీ గారి న్యూఢిల్లీ లేఖ "అభివృద్ధి పేరుతో పేదలకి అన్యాయం" శీర్షికతో పూర్తిగా ఏకీభవించవచ్చు. మనదేశంనుండి ఎగుమతుల, దిగుమతుల బేరీజు సమంగా వేశారు. నిత్యావసర వస్తువులు ఎగుమతులు,యంత్రాలు దిగుమతి, సామ్యవాదాన్ని బాగా విశ్లేషించారు. ప్రపంచ దేశాలన్ని చమురు రేట్లనీ తగ్గించిన, భారతదేశం స్వయంసమృద్ధి అయినా చమురు రేట్లని తగ్గించకపోవడము, భోగాలు (విలాసాలు)కాబట్టి సామాన్య మానవుడి ప్రయోజనాలు దెబ్బతీయవు. కాని జయ్‌దుబాషీ గారి ఎగుమతి, దిగుమతి విధానాన్ని పాలకవర్గాన్ని ఆలోచింప దగ్గవిగా ఉన్నాయి.

వాడాడ సింహాచలం (శ్రీకాకుళం)

* * *

27–5–83 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం (దీప) చాలా బావుంది. 'న్యూఢిల్లీ లేఖ' వారం వారం డా. జయ్‌దుబాషీగారు చాలా బాగా వ్రాస్తున్నారు. వారికి నా కృతజ్ఞతలు.

యం.డి. రాజీ మహమ్మద్ (ముదిమాణిక్యం)

## ధర్మపథం

ది. 3–6–83 సంచిక ముఖచిత్రం స్మిత సిల్కులా జారిపోతోంది. ఎప్పటినుంచో నాకు ప్రసిద్ధిచెందిన దేవాలయాలు అన్నీ పర్వతాలపై ఎందుకుంటాయి ? అనే సందేహం ఉండేది. ఈ సంచికలో 'ధర్మపథం' నా సందేహాన్ని తీర్చింది.

ఆచంట సుబ్బారావు (పండితవిల్లూరు) ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

వాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 8–7–'83

రుధిరోద్గారి నామ సం. జ్యేష్ఠ బ. త్రయోదశి

**సంపుటము 75 సంచిక 45**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85 80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

తిరుపతి బ్రహ్మోత్సవాలలో
వజ్రకిరీటాలంకృతుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి
(ఫొటో : కె. శ్రీనివాసులు)



## లోకంపోకడ :: ఊమెన్

త్వరగా నీళ్లు తీసుకురా కాంతీ!.. ఆ అమెరికన్ రచయిత నామొహానికి నల్లరంగు పులిమాడు.

ఆంబోతు ముందు అరుణ వస్త్రం.

కాంగ్రెసు (ఐ)

విజయవాడ సమ్మేళనం

మన ప్రధాని తమ పర్యటనలో విదేశాల్లో ఎంత మంచి పేరు తెచ్చుకున్నారు!

అలాగా సార్! కాని దానివల్ల ఇక్కడ ప్రజల పరిస్థితులు ఏమీ మెరుగు పడవు కదా!....

కాంగ్రెసు (ఐ) నశించాలి!..

కాంగ్రెసు (ఐ). నశించాలి!..

కాంగ్రెసు (ఐ) నశించాలి!..

కాంగ్రెసు (ఐ) నశించాలి!..

కాంగ్రెసు (ఐ) నశించాలి!..

కాంగ్రెసు (ఐ) నశించాలి!..

కాంగ్రెస్ వ్యతిరేక వాదం ప్రతిపక్షాల్లో ఐక్యత సాధించలేదు. వారికి ఉండవలసింది ఆచరణ సాధ్యమైన సిద్ధాంత పరమైన భావ సారూప్యత!

OOMMEN

# అమెరికా భస్మాసుర హస్తం




వాళ్లకేమి పని చెయ్యటం అలవాటో ఆ పనే చేశారు అమెరికా వాళ్లు. నోరు జారారు.

ఎవరా సేమూర్ హెర్ష్ ? నాకు తెలీదు. అతను మొరార్జీదేశాయి ఒక అమెరికా గూఢచారి సంస్థ (సి. ఐ. ఎ.) ఏజెంటు అని రాశాడని మాత్రం నాకు తెలుసు. అంతే కాకుండా హెర్ష్ పులిట్జర్ బహుమతి పొందిన వాడని కూడా నాకు తెలుసు. ఇది చాలు హెర్ష్ ఎటువంటి వాడో ఊహించేందుకు. ఎందుకంటే, ఢిల్లీలోని 'కన్నాట్‌ప్లేస్'లో ఉండే హిప్పీలకన్నా న్యూయార్క్, వాషింగ్టన్‌లలో ఉండే పులిట్జర్ బహుమతి గ్రహీతలే ఎక్కువ (సంఖ్యలో). ఒకళ్లకొకళ్లు బహుమతులు ఇచ్చుకోవటం అమెరికావాళ్లకి ఒక సరదా. రెండేళ్లకింద జేనెట్‌కుక్ అనే ఆడ—జర్నలిస్టుకి ఒక పులిట్జర్ బహుమతి ఇచ్చారు. ఆవిడ ఏమి చేసిందీ ? ఒక చిన్న అమ్మాయి 'హెరాయిన్' అనే మత్తు మందుకి అలవాటుపడిందంటూ ఆ అమ్మాయి జీవితగాథ రాసేసింది. దానిని వాషింగ్టన్ పోస్ట్ పత్రిక ప్రచురించింది. ఇలాంటి కథలు కొందరికి ఇష్టం. తక్కిన వాళ్లు ఏమిటిదంతా అని అసహ్యించుకుంటూనే చదువుతారు. అందుకనే వాటిని రాసేవాళ్లు కొందరు ఉంటారు. హెర్ష్ ఒక కట్టుకథ రాశాడు. మొరార్జీ దేశాయ్ సి. ఐ. ఎ ఏజెంటు అని రాశాడు. అమెరికాలో సి. ఐ. ఎ. కథలు బాగా అమ్ముడుపోతాయిలెండి. హెర్ష్‌కి త్వరలో ఒక బహుమతి వచ్చినా ఆశ్చర్యంలేదు అంత తొందరగా అతని కట్టుకథని కాదని నిరూపించేవాళ్లెవరూ లేరుకదా ?

హెర్ష్ ఇంతదాకా భారతదేశానికి రాలేదు. తన కథని గురించి మొరార్జీదేశాయిని అడగలేదు. ఇవేమీ చెయ్యకుండానే ఎవరో అమెరికా స్టేట్ డిపార్ట్‌మెంట్ అధికారులు చెప్పిన కబుర్లని పత్రికలోకి ఎక్కించాడు. అతనిదేమి పోయింది ? దేశాయి ఒక బీదదేశానికి ప్రధానమంత్రిగా ఉండే వాడు. బీద దేశమేమిటి, అతి బీదదేశం కూడా. పులిట్జర్ బహుమతి గ్రహీతకి ఒక నల్లజాతి మనిషి కీర్తి ముఖ్యమా ? హెర్ష్ కథలో లోపాలు ఉన్నాయని టయిమ్స్ ఆఫ్ ఇండియా పత్రికఅంది. ఇది నిజం. కాని, అమెరికావాళ్లకి ఇంత చిన్న విషయాలు పట్టవు. పాశ్చాత్య దేశాలలో 'ప్రచురణ' ఒక పెద్ద వ్యాపారం, 'మసాలా' ఎక్కువగా ఉండే కథలు బాగా అమ్ముడుపోతాయి. ఇక ఆ దేశాలలో ప్రచురణ కర్తలు తమ అమ్మకాల కోసం ఏది చెయ్యటానికయినా సిద్ధం.

''హిట్లర్ డయరీల'' సంగతే తీసుకోండి. ఇవి దొంగ డయిరీలని తర్వాత తెలిసింది. ఎవరికి ? బయటివాళ్లకి. వాటిని ప్రచురించదలచిన ''స్టెర్న్'' పత్రికవాళ్లకి ముందే తెలియదా ? తెలిసినా అమ్మకాల కోసమని తమ నిజాయతీని పోగొట్టుకోవటానికి వెనుదియ్యలేరు ఆ పత్రికవాళ్లు. హిట్లర్ డయరీలని సృష్టిస్తే ఏమిటి ? మొరార్జీని గురించి కథలు సృష్టిస్తే ఏమిటి ? అమెరికా వాళ్ల నమ్మకం ఒకటే — డబ్బుతో దేన్నయినా కొనుక్కోవచ్చు ! మంత్రులు, అధ్యక్షులు, రాజులు, (అవసరమయితే) దేశాలు వియత్నామ్‌నే తమ డాలరులతో కొనేద్దామని చూశారు. చివరికి వాళ్లు తెలుసుకున్నదేమిటంటే, ఒక సాధారణపు వియత్నామ్ రైతు మెక్‌నమారా అన్న పేరు కల గడుసుపిండానికి లొంగడని. ఈ మెక్‌నమారాయే వియత్నామ్‌ని రసాయనాలతో, విషక్రిములతో నాశనం చెయ్యటానికి ప్రయత్నించాడు. అతనే మళ్లీ వియత్నామ్ వాళ్లకి పరిహారంగా డబ్బు ఇస్తానన్నాడు. ఎవరి ద్వారా ? ప్రపంచ బాంకు ద్వారా. ఈ ప్రపంచ బాంకు ఏ రకం సంస్థ ? ఆసియాలో, ఇతరఖండాలలో బీదదేశాలని దెబ్బతియ్యటానికి వాడబడే ఒక డబ్బుసంచీల సంస్థ చివరికి డబ్బుసంచీలుకూడా పనిచెయ్యకపోతే అమెరికావాళ్లు సి ఐ ఎ. లేదా అలాంటి ఇతర సంస్థలద్వారా కీర్తిహాని కలిగించటానికి ప్రయత్నిస్తారు. ప్రపంచబాంకు అయినా సరే, సి. ఐ ఎ అయినాసరే— లక్ష్యం ఒకటే బీదదేశాల నిజాయతీని నాశనంచెయ్యటం ఎలాగ ? ఆ దేశాలలో రాజకీయవాదులూ, వ్యాపారులూ, ఆడవారూ, పిల్లలూ, ఒకరేమిటి అందరూ అమ్మకానికి ఉన్నారని ప్రచారంచేసి, ఒక ప్రధాన మంత్రికికూడ వెలకడతారు. ఆ వెలకూడా ఎంతో కాదు. అధ్యక్షుడుఉండే ''వైట్ హవుస్'' లో పనిచేసే ఒక వంటమనిషి లేదా దర్వాను జీతం అంత వెల కడతారు


మొరార్జీ దేశాయ్

అమెరికా వాళ్లది భస్మాసుర హస్తం తాయిలాండ్, దక్షిణ కొరియా, ఫిలిప్పయిన్స్ దేశాలని పెద్ద వ్యభిచార గృహాలుగా మార్చేశారు వీటిలో అమ్మాయిలని చికాగోలో గొడ్లని కొని అమ్మినట్టు కొని అమ్ముతారు కొరియా యుద్ధం ముందూ, తర్వాతా కూడా అమెరికా వాళ్ళు తొంబలు తొంబలుగా వచ్చి పడక ముందు తాయిలాండ్ ఒక చక్కటి దేశం. ఇప్పుడు బాంగ్‌కాక్, మనిలా నగరాలకి వెళ్లి చూడండి విలాస యాత్రికులు ఒక దేశాన్ని ఎలాగ నాశనం చెయ్యగలరో మీకు అర్థం అవుతుంది. ఈ విలాస యాత్రికులు కామదాహం తీరని అడవి జంతువుల్లాంటివాళ్లు. ఆసియాలోని యువత మాంసాన్ని భక్షిస్తానంటారు. మెక్‌నమారా సమోనాసాలకు బాంబులనివేసి చిన్న పిల్లలని పొట్టన పెట్టుకున్నాడు. అమెరికాలో ఆడవాళ్లకి అమ్ముడుపోవటం అపురూపంకాదు. అక్కడ కామం, అసభ్యసాహిత్యం పెద్ద పరిశ్రమలు. ఒక శాసన సభ్యుడి భార్యే మొండిమొలగా ''ప్లేబాయి'' పత్రిక వాళ్లకోసం పోస్ చేసింది. అందుకని అమెరికా పురుషులు అనుకుంటారు — ''అందరు

ఆడవాళ్ళా ఇంతే'' నని. ''ఆడవాళ్ళనికొంటే మగవాళ్ళని కొనలేమా ?'' అనికూడా అనుకుంటారు. గంటకి ఇంత బదులు సాలుకి ఇంత అని ఇవ్వవచ్చునని అనుకుంటారు.

జవహర్‌లాల్ నెహ్రూ విధానాలని కొన్నిటిని గురించి మనకి సందేహాలు కలుగవచ్చు. కాని ఆయన ఒక విషయంలో ఏమాత్రం పొరబడలేదు. ''అమెరికా వాళ్ళకి దూరంగా ఉండాలి!'' అనేవాడు ఆయన. ఒకప్పుడు ఎక్కడ చూసినా అమెరికావాళ్ళే కనపడేవాళ్ళు! ఆనకట్టలు కట్టటం, విద్యుచ్ఛక్తి కేంద్రాలు నెలకొల్పటం, గ్రామోద్ధరణ చెయ్యటం, అణుశక్తి తయారు చెయ్యటం వగయిరా. కాలం మారినట్లుంది. కొంత కాలంగా అందరు అమెరికా దేశస్తులు కన్పించటంలేదు. మనకి అభివృద్ధి, పెంపుదలలని గురించి అమెరికావాళ్ళు చెప్పాలా? అసలు అభివృద్ధి కావాలంటే ముందు కావలిసింది ఆత్మవిశ్వాసం. ఆత్మవిశ్వాసాన్ని నాశనం చెయ్యటమే ఇక్కడ అమెరికా సంయుక్త రాష్ట్రాలవారి ఆశ అనిపిస్తుంది. మన జాతీయ భావాలనే నాశనం చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు.

ఇరాన్ పాలకుడు షా, ఈజిప్టు నాయకుడు సాదత్, పాకిస్తాన్ రాజకీయవాది భుట్టో — వీళ్ళంతా అమెరికాది భస్మాసుర హస్తం అని ఎరిగినవాళ్ళే. వారిని నాశనం చేసింది చాలక అమెరికావాళ్ళు ఇప్పుడు ఎల్‌సాల్వదోర్, నికరానువాలని నాశనం చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. ఒకప్పుడు సాదత్‌కి పట్టినగతే త్వరలో జియా (పాకిస్తాన్), మార్కోస్ (ఫిలిప్పయిన్స్)లకి కూడా పట్టక తప్పదు అమెరికా సంయుక్త రాష్ట్రాల తొత్తులకి పట్టేగతి ఇంతే. సాదత్ దేశభక్తుడేకాని వాషింగ్‌టన్‌కి మరీ చేరువ అయ్యాడు. ఈ పని చేసినందుకు తన ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

అమెరికా వాళ్ళ డబ్బు అవసరమయితే తీసుకోవాలిసిందే. కాని, వాళ్ళని దూరంగా ఉంచాలి. మన ఇళ్ళలోకి అసలే రానివ్వకూడదు.

అమెరికా వాళ్ళ నడవడికి కారణం ఏమిటి? వాళ్ళది స్వస్థత కోల్పోయిన సమాజం అనుకుంటూ ఉంటాను. నా ఊహలో ఔదార్యం లోపించినా లోపించి ఉండవచ్చు. ''నడమంత్రపు సిరి'' వస్తే నిలకడ తప్పుతుందంటారు. అమెరికా వాళ్ళకి హటాత్తుగా అధికారం చేజిక్కింది. దానిని సద్వినియోగం చెయ్యటం తెలియక వాళ్ళు తమతో ఏకీభవించని వాళ్ళని నాశనం చెయ్యటానికి ప్రయత్నిస్తారు. అధికార గర్వంతో వచ్చే అస్వస్థత అమెరికా వాళ్ళది ఇది చాలా భయంకరమయిన జబ్బు. రోమ్ వాళ్ళని అడగండి, బ్రిటన్ వాళ్ళని అడిగి చూడండి — మీకే తెలుస్తుంది. (చచ్చిన వాళ్ళని మళ్ళీ బతికించగలగాలి ముందు.) ★











# సీరియల్ ప్రారంభం!

## సమయం రాత్రి పన్నెండు దాటుతోంది.

### మేఘాలు గుండెలు బ్రద్దలయ్యేలా ఉరిమాయి.

**ఆకాశంలో ఒక విద్యుల్లత క్షణకాలం కళ్లు మిరుమిట్లు గొలిపి అంతు తెలియని అంధకారములో అదృశ్యమయింది. ప్రచండమైన హోరుగాలి చెలరేగింది.**

**ఆకాశం హృదయ భారాన్ని మోయలేనట్లుగా బయటకు కక్కేసింది. సమరంలో ఓడిపోయిన సైనికుల కన్నీటి చుక్కల్లా వర్ష బిందువులు టపటప రాలాయి.**

**ఉరుములు మెరుపులతో ప్రకృతికి పూనకం వచ్చినట్లుంది.**

**వర్షం బాగా ఉప్పృతమయింది.**

వారణాసి వైపు ప్రయాణిస్తున్న ఓ ఎక్స్‌ప్రెస్ ట్రయిన్ ఆర్తనాదం లాంటి కేకవేసి ముందుకు పరుగులు పెడుతోంది, తన గమ్యం చేరుకోవాలని. టూ టైర్ కంపార్ట్‌మెంట్‌లోని దీపాలు గుడ్డి వెలుగును విరజిమ్ముతున్నాయి. పై బెర్త్ మీద పడుకున్నాడు విజయ్. కిటికీ లోంచి రివ్వున దూసుకు వచ్చిన ఈదురుగాలి అతనికి మెలుకువ తెప్పించింది,

'ఈ అకాల వర్షమేమిటి? ఎక్కడో తుఫాన్ మొదలయి వుంటుంది –' అని బద్ధకంగా ఆవలిస్తూ తలత్రిప్పి క్రిందికి చూసాడు విజయ్.

అంతే! అతని చూపులు క్రింద బెర్త్ మీద నిలిచిపోయాయి. ఆ బెర్త్ మీద ఒక ఇరవై ఏళ్ల యువతి పడుకుని వున్నది. ఆమె గుండెల మీద 'రామకృష్ణ బోధామృతం—' పుస్తకం వున్నది.

కళ్లు చికిలించి మరీ చూసాడు విజయ్. ఆమె తెల్లని నూలు చీరె ధరించింది. తెల్లని జాకెట్టు వేసుకుంది. కుంకుమలేని ఆమె విశాలమైన నుదురు ఏదో వెలితిగా వుంది. ఏదో అంతు తెలియని వేదనను మోస్తున్నట్లు ఆమె గుండెలు బరువుగా క్రిందికి పైకి కదులుతున్నాయి. నిద్రించుచున్న ఆమె మోములో ఏదో విషాదం తాండవిస్తున్నట్లుంది, మూసుకున్న ఆ కనురెప్పల మాటున కన్నీళ్లను దాచుకున్నట్లుంది.

**ఆమెను గుర్తించి విజయ్ ముఖం తెల్లగా పాలిపోయింది.**

'ఈమె మురళీప్రియ కదూ! అవును. ఎందరి మధ్యన వున్నా తను గుర్తించ గలిగిన ఒకే ఒక్క రూపం... మురళి! ఎన్నాళ్లయింది తను ఈ పేరును ఉచ్చరించి?–' అతని వదనంలో ఆశ్చర్యము, విషాదము రెండూ ఒక్కసారి వచ్చి నిలచాయి.

కొంతసేపు ఆమె వంకే రెప్పవేయడం మరిచినట్లు చూసాడు విజయ్. ఇంతలో కిటికీ లోంచి తన్నుకొచ్చిన ఒక గాలికెరటం ఆమెను







స్పృశించింది. ఆమె కళ్ళు విప్పింది. అలసటగా లేచి కిటికీ గ్లాసు దించి, మళ్ళీ బెర్త్ మీద పడుకోబోయింది.

అప్పుడే చూసింది పై బెర్త్ మీద కూర్చుని తనవంకే పరిశీలనగా చూస్తున్న యువకుడ్ని. ఆమె నేత్రాలు ఒక్క క్షణం ఆశ్చర్యాన్ని పులుముకున్నాయి. 'ఎవరు? విజయ్ కదూ!' అని గుర్తు చేసుకుని పలకరింపుగా నవ్విందామె.

"ఏమిటలా చూస్తున్నావు విజయ్ ?—" చిన్నగా నవ్వుతూ అడిగింది మురళీప్రియ.

అతను ఒక్కక్షణం తటపటాయించి "నువ్వు మురళివి కదూ ! ఈ పెట్టెలోకి ఎప్పుడొచ్చావు ?—" అని అడిగాడు విభ్రాంతిగా.

"అది సరే... నీ ప్రయాణం ఎందాక ?"

చెప్పాడతను.

"అయితే కాశీ వరకు నాకు కంపెనీ ఇస్తావన్నమాట —" పలచగా నవ్వింది. ఒకప్పుడా నవ్వుల్లో తేనేలు కురిసేవి. ఆ నవ్వులు అతని గుండెల్లో గిలిగింతలు పెట్టేవి. కానీ... ఇప్పుడా నవ్వుల్లోని వ్యత్యాసం స్పష్టంగా కనిపించిందతనికి.

క్రిందికి దిగివచ్చి సీట్లో కూర్చున్నాడు విజయ్. ఆమె కూడా అతనికి కెదురు సీట్లో కూర్చుంది. రైలు పెట్టెలోని జనం చాలా మటుకు నిద్రలో వున్నారు.

'నన్ను వెళ్లిపొమ్మని నీవు అనుభవిస్తున్న సుఖం ఇదా మురళీ ! నీ నుదుట బొట్టేదీ ? మెడలో తాళి ఏది ? ఏమిటీ వైపరీత్యం ? ఎందుకిలా జరిగింది ?' అని నిలదీస్తున్నట్లున్నాయి అతని చూపులు. అతని చూపుల్ని ఎదుర్కొనే శక్తి లేనట్లు తలదించేసుకుంది మురళి.

ఇద్దరికీ నిద్ర దూరమయింది.

ఒకర్ని గురించి ఒకరు అడిగి తెలుసుకున్నారు. ఇద్దరిలో మూగ బాధ చిందులేసింది. ఒకరి వంక ఒకరు జాలిగా, సానుభూతిగా చూసుకున్నారు.

"నాకు నవ్వొస్తోంది..." అన్నాడు విజయ్ కొద్దిసేపు తరువాత.

## మానస మురళి

"ఎందుకు నన్ను చూసా ? నా పరిస్థితి చూసా ?"

"కాదు. మనమిలా కలుసుకున్నందుకు."

"యాదృచ్ఛికంగా కలిశాము. ఇందులో ఆశ్చర్యమేముంది..."

"మనిద్దరం ఒకేబాటలో ప్రయాణించవలసి వస్తుందని నేనెప్పుడూ ఊహించలేదు. ముందుగా తెలిసినా నిన్ను నా బాటలోకి రానీకుండా ఆపేవాడిని..." అతని స్వరంలో వేదన సుళ్ళు తిరిగింది. చటుక్కున అతని కళ్లలోకి చూసింది మురళి. అతని తడి కళ్లలో ఎన్నో మాటలకందని భావాలు కదిలాయి. ఆమె హృదయం ఒక్కక్షణం రెపరెపలాడింది. మరుక్షణం చలిస్తున్న మనసును అదుపులో పెట్టుకుంది.

"ఎందుకిలా జరిగింది ?" అతని కంఠం సన్నగా వణికింది.

"ఏమో ! నాకేం తెలుసు ? సూత్రధారి ఆడించినట్లు పాత్రధారినై ఆడాను. నేను నిమిత్తమాత్రురాల్ని --" అని విరక్తిగా నవ్వింది మురళి.

ఆ నవ్వు అతని గుండెను కోసింది—

రెండు క్షణాల నిశ్శబ్దం తరువాత "చాలా రోజుల తరువాత కలుసుకున్నాంగదూ ! అదీ కాశీ ప్రయాణంలో.. నీ భర్త అస్తికల్ని తీసుకుని నీవు . నా భార్య అస్తికల్ని తీసుకొని నేను.. చాలా చిత్రమైన స్థితిలో కలిశాము .." ఏడ్వలేక పేలవంగా నవ్వాడు విజయ్.

కళ్ళలోకి దిగుతున్న నీటిని బలవంతాన ఆపుకున్నది మురళి

బయట వర్షం కుండపోతగా కురుస్తోంది.. ఉరుములు, మెరుపులు ఏ మాత్రం తగ్గలేదు. రైలు అతిప్రయాసగా పరుగిడుతున్నట్లుగా వుంది

"నీవు పెళ్లి చేసుకోవేమో ననుకున్నాను. చేసుకుని నాలాగా వంచింపబడతావనుకోలేదు" సానుభూతిగా అన్నది మురళి

"నీనుంచి దూరంగా వెళ్లాక అలాగే అనుకున్నాను. విధి వింతనాటకంవలన ఒకటికాదు. రెండు పెళ్లిళ్లు చేసుకున్నాను. కాలం వేసిన కాటుకు ఇద్దరూ బలైపోయారు. నా జాతకమేమిటోగానీ, నేను దేన్నయితే ప్రియంగా ప్రేమిస్తానో అది అందకుండానే జారిపోతుంది. ఈ ఇరవై ఆరేళ్ల జీవితంలో నాకు తెలిసొచ్చిన సత్యమేమిటంటే — దేనినీ విపరీతంగా ప్రేమించకూడదని — అభిమానాలు పెంచుకోరాదని. ఆ నిర్ణయానికి వచ్చాక నాకిప్పుడెంతో ప్రశాంతంగా వుంది—" అతని మాటలు ఆమె గుండెను తాకి అవ్యక్తమైన బాధను రగిలించాయి.

"విజయ్ ! నీలో ఇంతటి విరక్తి కలగడానికి మొదటి సమిధను నేనేకదూ ! దోపిళ్లతో ప్రేమను అందివ్వబోయావు. నిర్దాక్షిణ్యంగా తిరస్కరించి నీ హృదయాన్ని గాయపరిచాను. ఆనాటి నీ శాపమే నా జీవితాన్నిలా చీకటి ఎడారి చేసింది. నిష్కళంకమైన నీ మనసును ముక్కలు చేసినందుకు నాకు తగిన శాస్తి జరిగింది. చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా దౌర్భాగ్యమైన జీవితాన్ని గడుపుతున్నాను—" మురళి హృదయం మూగగా రోదించింది.

మౌనంగా ఎవరి ఆలోచనల్లో వారుండిపోయారు.

విజయ్ అలసటగా తల వెనక్కి వాల్చి కళ్ళు మూసుకున్నాడు. ఆ మూసుకున్న అతని కనుల ముందు ఏవో అస్తవ్యస్తమైన దృశ్యాలు... గతించిన గతం తాలుకు నీలినీడలు...

ప్రతి మనిషి జీవితంలోనూ ఇలాంటి రోజు ఒకటి వస్తుంది... గడిచిపోయిన జీవితాన్ని సమీక్షించుకోవడం, లోతుపాతుల్ని తరిచి చూసుకోవడం, కష్టసుఖాల్ని మననం చేసుకోవడం, మంచి చెడ్డల బేరీజు వేసుకుంటూ విశ్లేషించుకోవడం. అలా తనను తాను తరిచి చూసుకున్న వ్యక్తికి ఎంతో అనుభవం మిగులుతుంది అది ముందు జీవితానికి కరదీపికకావచ్చు. విజయ్ కూడా గడిచిపోయిన తన జీవితాన్ని ఒక్కసారి సింహావలోకనం చేసుకోసాగాడు.

# కేవలం ఒక్క డెట్ బిళ్లలోనే వుంది సాల్వెంట్ పవర్

## బట్టలను అన్నిటికంటే ఎక్కువ తెల్లగా ఉతుకుట కొరకు

క్రొత్త సాల్వెంట్ పవర్

det

NEW SOLVENT POWER

det

detergent washing cake

జిడ్డును తీసివేసే శక్తి



మురికిని తొలగించే శక్తి



మిరుమిట్లు తెలుపును ఇచ్చే శక్తి



**మరే ఇతర డిటర్జెంట్ బార్ లేక బిళ్ల దీనికి సాటి రాదు**

Shilpi DM/31 A/81 Tel

## మానస మురళి

## 2

సంధ్యాసమయం. ప్రకృతి చల్లబడుతోంది. పగలంతా డ్యూటీచేసి అలసిన భానురాజు పడమటి కొండల మాటుకి జారుకుంటున్నాడు. కడపటి సంధ్యారుణకాంతులతో సముద్రుడు మిలమిల మెరిసిపోతూ వింత కాంతులీనుతూ విచిత్రంగా ఎగిసిపడుతున్నాడు. కెరటాల హోరు చాలాతీవ్రంగా వుంది.

పదవసారి విసుగ్గా, అసహనంగా నిట్టూర్చాడు విజయ్. అతని అసహనానికి కారణం వస్తానన్న మురళి రాకపోవడమే! 'ఐదు గంటల కల్లా బీచ్‌లో వుండు. తప్పక వస్తాను' అని ప్రామిస్ చేసింది మురళి. ఐదుదాటి ఆరవుతున్నా ఆమె జాడలేదు.

క్షణ క్షణానికి అతని ఆరాటం పెరుగుతూ ఉత్సాహం తరుగుతోంది.

మనసంతా చేదు తిన్నట్లు చికాగ్గా అయిపోయింది.

పిడికెళ్లతో ఇసుక తీసి కెరటాలవైపు చల్లసాగేడు. ఎదురుగాలికి ఓ ఇసుక రేణువు ఎగిరొచ్చి అతని కంట్లో పడింది. భగ్గుమన్నాయి కళ్ళు. కర్చీఫ్‌తో వత్తుకున్నాడు. నీళ్లు కారాయే తప్ప ఇసుకరేణువు బయటకు రాలేదు. ఎలాగో తంటాలుపడి ఓ పదినిమిషాలకు కంట్లో నలక పోగొట్టుకోగలిగాడు. అయినా కళ్లు మండుతూనే వున్నాయి.

విజయ్ దృష్టి వచ్చేపోయే జనం మీద బడింది. ఎన్నోరకాల మనుష్యులు ... పిల్లలు, పెద్దలు, వృద్ధులు — అందమైన జంటలు — ప్రేమికులు – అందరూ హుషారుగా వస్తూ పోతున్నారు. ఆ జనంలో తన ప్రియ వల్లరి మురళి కోసం వెదికాయి అతని కళ్ళు.

"ఇక నిరీక్షించటం కూడా వృధా యే! మళ్లీ వారం వరకూ మురళిని చూసే భాగ్యం లేదు. తప్పకుండా వస్తానని ఎందుకని రాలేదు?" నిరుత్సాహంగా లేచి నించున్నాడు విజయ్.

బరువుగా ఇసుకలో అడుగులు వేయసాగాడు. ఇంతలో " విజయ్ ! " అన్న పిలుపుతో అతని కాళ్లకు షడన్ బ్రేకు పడింది. తల్తిప్పి చూసాడు. అల్లంతదూరాన మరళి వస్తూ కనిపించింది. అతని కళ్ళు వెలుగును సంతరించుకున్నాయి. ఉత్సాహంతో ముఖం వికసించింది. మనసున మల్లెలమాల లూగినట్లు చిత్రమైన అనుభూతి కలిగింది. 'ఎవరా వచ్చేది ! తన ప్రియవల్లరి మురళి ! తన ఒంటరి బ్రతుకున వెన్నెల బొమ్మలా భాసించిన రాగదేవత...ఆ కల హంస నడక తనకు సుపరిచితమే ! ఆ రూపం ఎన్నివేల రూపాల మధ్యనున్నా తను ఇట్టే గుర్తు పట్టగలడు.' అతని హృదయం ఉత్తుంగ తరంగమై నాట్యమాడింది, అమితోత్సాహంతో ఎదురెళ్లాడు.

మురళి ముఖం ముడుచుకుపోయినట్లుంది. గంభీరతను పులుముకుని వున్నది.

"మురళీ ! ఏమిటలా వున్నావు ?" కలవర పడుతూ అడిగాడు.

"సారీ విజయ్ ! నా మనసేం బాగాలేదు. నీతో మాట్లాడాలి పద—" అని ముందుకు దారి తీసింది మురళి అతనికేమీ అర్ధంగాలేదు. మంత్రించిన బొమ్మలా ఆమె వెంట నడిచాడు.

జనం లేని ఏకాంత ప్రదేశంలో కూర్చున్నారిద్దరూ. కొన్ని క్షణాలు ఎవరి పెదవులు కదల్లేదు. అతని మనసు పరి పరి విధాల పోతోంది. ఆమె గంభీర వదనాన్ని చూస్తుంటే అతనిలో ఎన్నో ప్రశ్నలు తలెత్తాయి. మనసు కీడును శంకిస్తోంది.

"విజయ్ ! ప్రేమంటే ఏమిటి ? — " మౌనాన్ని చీల్చుకుని వచ్చాయామాటలు. అతను వులిక్కిపడి 'ఏమిటి ఈ పిచ్చి ప్రశ్న ?' అన్నట్లు చూసాడు.

ఆమె మళ్లీ అదే ప్రశ్న వేసింది. ఆమె ఎందుకలా ప్రశ్నిస్తోందో — ఆమె ఆంతర్యమేమిటో బోధపడక అయోమయంగా చూసాడు విజయ్.

"మురళీ ! అసలేం జరిగింది? వచ్చినప్పటి నుండి బిర్రబిగుసుకుపోయావు. ఏమేమో పిచ్చి ప్రశ్నలు వేస్తున్నావు. అసలు ఇదంతా ఏమిటి?" —రవ్వంత చికాకుగా అడిగేడు.

## పిల్లలపై ప్రభావాన్ని చూపే కుటుంబ కలహాలు!

కుటుంబ జీవితం అందరికీ అన్ని వేళలా ఆహ్లాదకరం కాదు కొంతమందికి కుటుంబం తీరని వ్యధను నిరాశను కలిగిస్తుంటుంది. కుటుంబంలోని కలహాల వలన పిల్లలే ఆరోగ్యం కోల్పోతుంటారు. పశ్చిమ జర్మనీ మానసిక శాస్త్రవేత్తలు 55 కుటుంబాలను పరిశీలించారు. సామాజిక, మానసిక కారణాల వల్లనే వ్యాధులు ఏర్పడతాయనే ప్రతిపాదనతో ఈ పరిశీలన ప్రారంభించారు. పెద్దల మధ్య తగాదాలకు చిన్న పిల్లలే తీర్పు చెప్పే పరిస్థితి ఏర్పడితే, అది పిల్లలకు వయసుకు మించిన భారం అవుతుంది. దానితో ఆరోగ్యం కోల్పోతారు. వీరిలో విపరీతమైన ప్రవర్తన ఏర్పడి బాల్య నేరాలను ప్రారంభిస్తారు. చివరకు, శారీరకంగా, మానసికంగా ఆరోగ్యం కోల్పోయి పిల్లలే బలిపశువులవుతున్నారని వీరు తెలియచేశారు.

''నావి నిజంగా పిచ్చి ప్రశ్నలేనంటావా?'

''కాకపోతే ఏమిటి ? మన పరిచయం – ప్రణయం దైవ నిర్ణయంగా భావిస్తున్నాను. ఆ దైవం అనుకూలిస్తే ఒకరి జీవితంతో మరొకరు ముడిపెట్టుకోవాలనుకున్నాం. ఇప్పుడెందుకు కలిగిందా అనుమానం ? ప్రేమంటే నీకు తెలీదా ?''

ఆమె వెంటనే మాట్లాడలేకపోయింది. ఆమె ఎదలో బడబాగ్నులు రగులుకున్నాయి. ఆ జ్వాలను అతి కష్టం మీద అణుచుకో గలుగుతోంది

''నీ బాధేమిటో చెప్పనిదేనాకెలాతెలుస్తుంది మురళీ ! నీవిలా మూగనోము పడితే భరించే శక్తి నాలో లేదు. దయచేసి నీవు చెప్పదలుచుకున్నదేమిటో సూటిగా చెప్పు.'' అతని కంఠం సన్నగా వణకడం ఆమె గమినించక పోలేదు.

'ఇంత ప్రాణాధికంగా ప్రేమించే ఈ వ్యక్తిని ఎలా దూరం చేసుకోవడం ? ఇన్నాళ్ళూ ఒక్కటిగా తిరిగి అపూర్వమైన రాగబంధాన్ని అల్లుకున్నాము. మరి...నిర్దాక్షిణ్యంగా ఆ బంధాన్ని త్రెంపుకుని వెళ్ళమనడం ధర్మమా ? తన నిర్ణయం తెలిస్తే ఇతను భరించగలడా ? ఏంచేయాలి ? మనసు నొప్పించకుండా తన నిర్ణయాన్ని ఎలా చెప్పడం ?–'

ఆమె అంతరంగంలో యుద్ధం జరుగుతోంది.

కొన్ని క్షణాలు ఆలోచించి మనసు గట్టిపరుచుకుంది.

''విజయ్ ! నేనంటే నీకిష్టమేకదూ ?''

''ఆ సంగతి నీకు తెలీదా ?''

''నన్ను నిజంగా ప్రేమిస్తున్నావుకదూ?''

''అనుమానముంటే నా గుండె చీల్చి చూడు.'' బాధగా చూసాడతను.

అలాంటి ప్రశ్నలు వేయవలసి వచ్చినందుకు ఆమెకూ బాధగానే వున్నది.

''ఆవేశపడకు విజయ్. నేను చెప్పేది కాస్త శాంతంగా విను–''

''చెప్పదలుచుకున్నదేమిటో కాస్తస్పష్టంగా బోధపడేట్లుచెప్పు – అయినా ఇన్నాళ్లూ లేని అనుమానాలు – సందేహాలు ఇప్పుడెందుకు కలుగుతున్నాయి – ?'' ఆమె మొఖంతో ఏదో వెదకబోయాడు. చప్పున తల వంచేసుకుంది మురళి.

''తెలిసో తెలియకో ఇన్నాళ్ళూ మనం కలిసి తిరిగాము. ఇక ముందు అలా జరగదు. నీవు నా నుంచి దూరంగా వెళ్లిపో ... ''ఆమె గొంతు పట్టుకుపోయినట్లుంది.

''ఎందుకు?'' అతని భ్రుకుటి ముడివడింది.

''నన్ను ప్రేమించిన నేరానికి !''

''నీ మాటలు అర్థం గావడంలేదు. సరిగ్గా చెప్పు'' చికాకు పడ్డాడు విజయ్.

''నిన్ను పెళ్లి చేసుకోలేను – ''

''కారణం ?''

''నీ వంటే నా కిష్టంలేదు కనుక .. ''

''మురళీ ! నువ్వేనా ఇలా మాట్లాడుతున్నది ? నేనంటే ఇష్టంలేదా ? నీ మాటలు హాస్యాస్పదంగా వున్నాయి. ఏదీ ఇలా నా కళ్లలోకి చూసి చెప్పు – '' కఠినంగా మారిపోయిందతని గొంతుక.

ఆమె బదులు చెప్పలేకపోయింది వెంటనే. ఇద్దరి మధ్య కొన్ని క్షణాలు నిశ్శబ్దం చిందులేయబోయింది. ఇంతలో కెరటాల హోరు ... సంధ్య చీకట్లు పృధ్విని ఆక్రమించుకుంటున్నాయి నెమ్మదిగా. నిశా కన్య తన తల్లిని ముసుగును లోకంపైన కప్పాలని ఆత్రుత పడుతోంది.

మురళి హృదయం తీవ్రంగా రోదిస్తోంది!

అతనిలో కోపం – అసహనం ఎక్కువవుతున్నాయి.

''నేనంటే ఇష్టం లేనపుడు ఇన్నాళ్లూ నాతో ఎందుకు తిరిగావు ? నాలో లేని ఆశల్ని ఎందుకు కలిగించావు ?'' ఉక్రోషంతో అతని మోమె కఠిన పడింది.

బదులు చెప్పడానికి ఆమె మాటలు వెదుక్కోసాగింది.

''మాట్లాడు. నాకు సమాధానం కావాలి'' ఖంగుమన్నది అతని స్వరం.

''విజయ్ ! ప్లీజ్ ... నన్నేమీ అడగకు. నేను దురదృష్టవంతురాల్ని ... ఇన్నాళ్లూ నీమీదున్న ఆకర్షణను ప్రేమని భ్రమపడ్డాను నేను నిన్ను ప్రేమించడంలేదు. నన్ను మరిచిపో'' అని లేచి వెళ్లబోయింది మురళి చటుక్కున ఆమె చేయి పట్టుకుని ఆపాడు విజయ్.

''భయం లేదు కూర్చో – నిన్నేమీచేయను వెళ్లే ముందు నా సందేహ నివృత్తి చేసి వెళ్లు నన్నెందుకు ప్రేమించలేకపోతున్నావో జవాబు చెప్పివెళ్లు'' కోపంగా ఆమె చేయిపట్టి ఇసుకలో కూలేసాడు.

మురళికి దుఃఖం ఆగలేదు. దోసిట్లో ముఖం కప్పుకుంది.

అతని హృదయం బరువుగా మూలిగింది.

''నా మురళి ఏడుస్తోంది ! ఈ కన్నీళ్ల వెనక ఏ భావమున్నది ? నిజంగా ఈమె నన్ను ప్రేమించడంలేదా ? నో...నో...అది అబద్ధం! మురళి మనసులో తనకు తప్ప మరొకరికి తావులేదు. ఏదో బలీయమైన కారణం ఆమె చేత అబద్ధం చెప్పిస్తోంది ! ఏమిటది ?'

''మురళీ !'' మృదువుగా, లాలనగా పిలిచాడు విజయ్.

మురళి పవిటచెరుగుతో కళ్లు వత్తుకుని తేరుకుంది.

''విజయ్ ! జీవితం అందరికీ వడ్డించిన విస్తరికాదు. మనం ఎన్నో ఆశల్ని పెంచుకుంటాం. ఎన్నో మధురస్వప్నాల్ని కంటాము. కానీ అవన్నీ ఫలిస్తాయా ? ఏ కొద్దిమంది అదృష్టవంతులకో అలా జరిగేది. నీవు మనసారా నన్ను ప్రేమించేదే నిజమైతే నా కోరిక తీర్చడం నీ విధి – తీరుస్తావా ?'' అర్థింపుగా చూసింది మురళి.

''నీవు పదేపదే అలా అనడం భావ్యంకాదు. చెప్పు ఏం చేయమంటావో – ''

''నేను స్వార్థపరురాల్ని. నీకు కష్టమనిపించినా సరే ... నన్ను ప్రేమించిన నేరానికి నానుంచి దూరంగా వెళ్లిపో. నన్ను మరిచిపోయి మంచి అమ్మాయిని చూసి పెళ్లిచేసుకోకాబోయే పోలీసాఫీసరువు, నీవు కోరుకుంటే నాకన్నా మంచి అమ్మాయే దొరుకుతుంది''



## మానస మురళి

ఆమె కనురెప్పల్ని మూసుకుని రెండు కన్నీటి చుక్కలు బయటకురికి అతని చేతిమీద పడ్డాయి.

విజయ్ చలించిపోయాడు.

''మురళీ! నన్నెందుకిలా క్షోభపెడుతున్నావు ? నేనేం పాపం చేసానని, నీ నుంచి దూరంగా వెళ్లిపొమ్మంటున్నావు ? సారీ ... నీ కోరిక మన్నించలేను నీవులేని శూన్య జీవితాన్ని ఊహించడం నా వల్లకాదు —'' ఆవేశంతో ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని నలిపాడు

మురళి తీవ్రంగా చూసింది.

''పిచ్చి మాటలతో ప్రయోజనంలేదు విజయ్. నీవు మంచి ప్రేమికుడువైతే ఇచ్చిన మాట నిలబెట్టుకో... నేను మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ నిన్ను పెళ్లి చేసుకోను —''

''ఎలా జరగదో నేనూ చూస్తాను'' ఉక్రోషంగా అన్నాడు విజయ్

''ప్రేమ త్యాగాన్ని కోరుతుందిగానీ, ద్వేషాన్ని వెళ్ళగక్కదు''

''నా కవన్నీ అనవసరం, నీవు నాకు కావాలి. ఎన్ని అడ్డంకులు వచ్చినా ఆగను. నీ మెడలో తాళికట్టి నిన్ను నా దాన్ని చేసుకుంటాను'' దృఢంగా అన్నాడు విజయ్.

''అయితే నా మాట వినవంటావు.''

''ఎందుకు వినాలి ? నీనుంచి దూరంగా వెళ్లి నేను సుఖంగా బ్రతకలేను. ఎవరికోసం ఈ త్యాగం చేయాలి ? మనసు చంపుకుని శిలలా బ్రతికేకన్నా మరణమే మేలు. చెప్పు మురళీ! ఇద్దరం కలిసి జీవించలేనపుడు కలిసి మరణిద్దాం —''

ఆమె గుండె ఊగిపోయిందా మాటలకు కళ్లు అవిరళధారగా వర్షిస్తున్నాయి.

'ఇతన్ని ఎలా దూరం చేసుకోవడం ? ఇంతగా ఆరాధించే ఈ ప్రేమమూర్తిని బాధపెట్టి తను బావుకునేదేమిటి ? తనలో ఇంత స్వార్థమున్నదా ? కాదు... తనకోసం కాదు... తనవాళ్లకోసం తన కుటుంబ శ్రేయస్సు కోరి తను ఈ పని చేయకతప్పదు — చేయకపోతే కృతఘ్నురాలినని నిందించరూ! తప్పదు. రాజీ పడాలి పిన్ని మాట నిలబెట్టాలి —'

''విజయ్! నేను వెళ్లిపోతున్నాను. ఇంకెప్పుడూ నన్ను కలవాలని ప్రయత్నించకు. అలా చేస్తే నేను ఈ లోకంనుంచే నిష్క్రమిస్తాను. బాగా ఆలోచించుకో... నువ్వీ పరిసరాల్ని వదిలి వెళ్లిపోతేనే నాకు మనశ్శాంతి. ఆ తరువాత నీ ఇష్టం —'' అని లేచి చరచరా నడుచుకుంటూ వెళ్లిపోయింది మురళి.

విజయ్ కొయ్యబారిపోయినట్లు అలాగే కూర్చుండిపోయాడు.

అతనికి అర్థంగానిదల్లా ఒక్కటే 'మురళి ఇలా అర్ధాంతరంగా ఎందుకు మారిపోయింది ? ఏమాశించి ఇంతటి త్యాగం చేస్తోంది ?'

చాలాసేపు అలాగే కూర్చుండిపోయాడు విజయ్.

అతనికి ఆమెతో పరిచయమైన రోజులు గుర్తుకు వచ్చాయి.

### 3

విజయ్ డిగ్రీ పూర్తిచేశాక పోలీసు ఇనస్పెక్టరుగా సెలక్టయ్యాడు. ఒక సంవత్సరం ట్రయినింగ్ వుంటుంది. హాస్టల్లో వుంటూ ట్రయినింగ్ అవుతున్నాడు. శని, ఆదివారాలు మాత్రం వాళ్లను బయటకు వదిలేవారు ఆ రెండు రోజులు సాయంత్రం వేళల్లో జట్లు జట్లుగా షికార్లుకు వెళ్లేవారు. విజయ్‌కు పెద్దగా స్నేహితులెవరూ లేరు. ఎవరితోనూ కలివిడిగా కలిసేవాడు కాదు. ఒంటరిగా గడపడమంటే అతనికిష్టం. అదో తరహా మనస్తత్వం షికారు కెళ్లినా ఒంటరిగానే వెళ్లేవాడు.

ఆ సమయంలో మురళితో పరిచయమయిందతనికి.

మురళి ఒక ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా పనిచేస్తోంది. అప్పుడపుడూ బస్‌స్టాపులో కనిపించేది. ఎందుకో ఆమెను చూసినప్పుడల్లా విజయ్ గుండె తీవ్రంగా స్పందించేది ఒకరకంగా, చెప్పాలంటే తొలి చూపులోనే ఆమె రూపం అతని ఎదలో ముద్ర పడిపోయింది. ఆమెను చూడాలని వువ్విళ్లూరేవాడు. కానీ, రోజూ బయటకువెళ్లే అవకాశం వుండదు. శని, ఆదివారాలు ఎప్పుడొస్తాయాని ఎదురుచూసేవాడు ఆ రెండు రోజుల్లో శనివారం మాత్రమే ఆమె దర్శనమిచ్చేది అందంగా ఆకర్షణీయంగా వుంటుంది మురళి. వస్త్రధారణ చాలా సింపుల్‌గా వుంటుంది. ఆమెను చూస్తే ఎవరికైనా గౌరవం కలగక మానదు.

అలాంటి మంచి అమ్మాయిని విజయ్ ప్రేమించాడు. ఇందులో వింతేమీలేదు. కాకపోతే తను ప్రేమిస్తున్నట్లు ధైర్యంగా ఆమెతో చెప్పలేకపోయాడు. ఆమె తనను చూసి పలకరింపుగా నవ్వినపుడు అతని గుండె వడివడిగా కొట్టుకునేది

ఎన్ని రోజులు గడిచినా అతను ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేకపోయాడు. అవకాశం వస్తే 'నిన్ను ప్రేమిస్తున్నాను —' అని చెప్పాలనుకున్నాడు. కానీ, అలాంటి అవకాశమే ఎదురవడంలేదు. కనీసం ఆమెతో మాట కలుపుదామన్నా ధైర్యం చాలడంలేదు.

కానీ, ఆమెను గురించిన వివరాలు, ఎక్కడ పనిచేస్తోంది తెలుసుకున్నాడు. మురళివాళ్లది మధ్యతరగతి కుటుంబం. తండ్రి పక్షవాతంతో మంచమెక్కాడు. పిన్ని, ఇద్దరు చెల్లెళ్లు, ఒక తమ్ముడు వున్నారు. ఆ సంసార రథాన్ని ఈడ్చే భారం మురళిదే! వాళ్ల పిన్ని మహాగయ్యాళి.






బులుసు వేంకటరమణయ్య

# ఊర్మిళాదేవి నిద్ర

శ్రీరాముడు తండ్రి యాజ్ఞవల్ల వనానికి వెళ్లదలచగా, సీతాదేవియు, సోదరుడు లక్ష్మణుడును అతని వెంట వెళ్లారని రామాయణం తెలిసిన అందరూ ఎరుగుదురు. లక్ష్మణుడితోపాటు అతని భార్య ఊర్మిళ ఎందుకు వెళ్లలేదనీ, ఆమె, ఆతడు తిరిగి వచ్చేవరకూ నిద్రలోనే ఎందుకు ఉందనీ సందేహం కలగవచ్చు. దానిని గురించి ఒక గాధ ఉన్నది.

ఊర్మిళ జనకుని తమ్ముడగు కుశధ్వజుని కుమార్తె. ఆమె తన చిన్నతనంలో ఒకప్పుడు చెలికత్తెలతో కూడా వనవిహారానికి బయలుదేరి వెళ్లినది. ఆ వనంలో ఒక ప్రశాంత స్థలమున మాండవ్యుడనే మహాముని తపస్సు చేసుకోంటూ ఉండెను. ఊర్మిళ చెలికత్తెలతో కూడా అక్కడికి వెళ్లి బాల్య చాపల్యం వల్ల కొంటె చేష్టలు చెయ్యగా, అతని తపస్సుకు విఘ్నం కలిగింది. ఆ ముని కోపించి "ఓసీ దుష్టురాలా! అల్లరి చేష్టలు చేసి, నా తపస్సునకు భంగం కలిగించావు. అందువల్ల వివాహం అయిన కొద్దికాలంలోనే నీకు భర్తతో ఎడబాటు కలుగుతుంది" అని శపించాడు. ఊర్మిళ దుఃఖంతో తండ్రి దగ్గరకుపోయి యిదంతా చెప్పింది. అతడు ఆ మహాముని వద్దకు వచ్చి ప్రార్థించగా "రాజా! విచారించకు. ఆ వియోగం కొంత కాలం మాత్రమే. అది లోక కల్యాణానికి కారణమవుతుంది. తర్వాత అమ్మాయి సుఖ పడుతుంది" అని ఓదార్చి పంపివేశాడు. ఇందువల్లనే ఊర్మిళ భర్తతో అడవికి వెళ్లడం కుదరలేదు.

అడవికి వెళ్లుతున్నప్పుడు ఆమె భర్తతో "మీరు మీ అన్నగారికీ, వదినెగారికీ సేవచేస్తూ రాత్రింబగళ్లు నిద్ర విడిచి, వారిని కాపాడుతూ ఉండాలిగదా! మీ నిద్రను నాకు సంక్రమింపజేయండి. నేను మీరు తిరిగి వచ్చేటంతవరకూ నిద్రలోనే ఉంటాను. మీరు వచ్చాక మేలుకుంటాను" అని చెప్పి లక్ష్మణున్ని దానికి సమ్మతింపజేసింది.

అందువల్లనే రాముని వనవాస కాలమైన పధ్నాలుగు సంవత్సరాలూ లక్ష్మణుడు నిద్ర పోకుండానే ఉండడం, అతని భార్య ఊర్మిళ అంతకాలమూ నిద్రలోనే ఉండడమూ సంభవించింది.

చాలాకాలం నిద్రపోతూ ఉన్నవారి నిద్ర ఊర్మిళాదేవి నిద్ర అని ప్రసిద్ధికెక్కింది

అంతకాలమ్మూ ఆమె ఆహార విహారాదులు లేక ఉండినదని దీనివల్ల తెలుసుకో వచ్చును.

---

మురళి సంపాదనంతా తీసికెళ్లి ఆమె చేతిలో పోసినా, ఇంకా అదిలేదు, ఇదిలేదు అని సాధిస్తూ ఆరళ్లు పెడుతుందట.

మొత్తంమీద మురళి దయనీయమైన పరిస్థితుల్లో, ఆర్థిక సమస్యలతో బాధపడు తుందని – పెద్ద సుఖమయమైన జీవితం కాదని తెలుసుకున్నాడు విజయ్. ఆమెతో పరిచయం లేకపోయినా ఆమెను గురించి తెలుసుకుని మనసు లోనే ఆమెమీద పుట్టెడు జాలి కురిపించేవాడు. 'ఈ అమ్మాయి ఏ లక్షాధికారి ఇళ్లలోనో పుట్టాల్సింది. మధ్యతరగతి కుటుంబమనే ఊబిలో చిక్కుకుని వాడిపోతున్న గులాబి —' అని ఆమె కనిపించినపుడల్లా సానుభూతిగా పెదవులు చప్పరించేవాడు విజయ్.

ఒకరోజు బస్‌స్టాపులో వెయిట్ చేస్తోంది మురళి. ఇంతలో అక్కడకు విజయ్ వచ్చాడు. అతన్ని చూసి 'ఎవరితను? వారానికోసారి దర్శనమిస్తాడు? తనను చూసి నవ్వుతాడు? ఏం పని చేస్తుంటాడో –' అని మనసులో కుతూహలం బయలుదేరిందామెకు.

"హమ్మయ్య! మీరు వెళ్లిపోయారేమో ననుకున్నాను –" దగ్గరగా వచ్చి నిలబడ్డాడు విజయ్. మురళి విచిత్రంగాచూస్తూ "నాతో ఏదయినా పనుందా?" అని అడిగింది.

"అబ్బే! అదేంలేదు..."

"మరి నేను వెళ్లిపోతే మీకెందుకు? వుంటే మీకెందుకు? –" కాస్త కటువుగా అన్నది మురళి. విజయ్ ముఖం మ్లానమయింది.

"సారీ! మీరు నన్ను అపార్థం చేసుకుంటు న్నారు..." కించిత్ బాధగా అన్నాడతను.

"చూడండి! మీరెవరో నాకు తెలీదు నా గురించి మాట్లాడేంత చనువులేదు. ముక్కూ మొహం తెలియనివాళ్లు ఇలాంటి అతిచనువులు తీసుకుని ఏదో పనివున్నట్లు పూసుకు తిరగడం నాకు నచ్చదు –" ఖచ్చితంగా చెప్పింది మురళి.

విజయ్‌కు నిజంగా బాధకలిగింది. ఆమె అంత ఖచ్చితంగా మాట్లాడుతుందనుకోలేదు.

మరేం మాట్లాడలేదు. చటుక్కున జేబు లోంచి కర్చీఫ్‌తీసి "ఇది మీదేననుకుంటాను. వారం రోజుల క్రితం నాకిక్కడ దొరికింది. దీని మీద మీ పేరు కుట్టారు. ఇచ్చివెళ్దామనివచ్చాను. తీసుకోండి – అంతేగానీ నాకు మరే దురుద్దేశ్యం లేదు" అని కర్చీఫ్ ఆమె చేతిలోపెట్టి చక చక నడుచుకుంటూ వెళ్లిపోయాడు విజయ్.

"ఈ కర్చీఫ్ తనదే! ఎక్కడో పడిపోయిం దని సరిపెట్టుకున్నది. ఇతను దొరికిందని పని గట్టుకు తెచ్చాడు. పాపం, తన మాటలకు బాధ పడినట్లున్నాడు. ఏమైనా అలా కఠినంగా మాట్లాడకుండా వుంటే బావుండేది.." అని చింతించింది మురళి. తలెత్తి చూసేసరికి అతను చాలా దూరంగా వెళ్లిపోయాడు అతను వెళ్లిన దికేకు చూస్తూ దీర్ఘంగా నిట్టూర్చింది.

మరి రెండు వారాలదాకా విజయ్ ఆమెకు కనిపించలేదు. మూడో వారం కనిపించాడు. ఈసారి ఆమే పలకరించింది విజయ్‌ను.

"చాలా థాంక్స్... తొందరపాటులో ఆవేశ నోరు జారాను –" అని క్షమార్పణ చెప్పకుంది మురళి. విజయ్ తేలిగ్గా నవ్వేస్తూ "ఇట్సాల్ రైట్! దయచేసి ఇకముందైనా నాపట్ల కాస్త మృదువుగా వ్యవహరించవలసిందిగా కోరుచున్నాను. నేను దుర్మార్గుణ్ణి, రోడ్డుసైడు రోమియోను కాను. మీ స్నేహాన్ని కాంక్షిస్తున్నాను. మీరు మంచి మనసుతో గుర్తించగలిగితే ధన్యుణ్ణి –" అని అక్కడనుంచి వెళ్లిపోయాడు విజయ్.

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



శ్రీ మొరార్జీ దేశాయి అమెరికా గూఢచారి సంస్థ వద్ద సాలుకి 20000డాలరులు పుచ్చుకుని ఆ సంస్థకి సమాచారం అందిచ్చాడని ఆరోపించిన అమెరికా పత్రికా రచయిత శ్రీ సేమూర్ హెర్ష్. ఈయన శ్రీ హెన్రీ కిసింజర్‌నికూడా బాగా చెడుగా చిత్రించారు తమ పుస్తకంలో. ఈ పుస్తకాన్ని గురించి రాస్తూ సుప్రసిద్ధ అమెరికా వార్తా వార పత్రిక "టయిమ్" ఇలాగే అంది. "హెర్ష్ పుస్తకం ఒక చరిత్రకారుడి రచనకాదు. తటస్థంగా ఉండే జర్నలిస్టుదీ కాదు. అది ఒక ప్రాసిక్యూటర్ చేసిన రచన."

[ఈ వారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక లోనే డాక్టర్ జయ్‌దుబాషీ ఈ వ్యవహారం మీద రాశారు. — సం॥]



పాలస్తీనా విముక్తి సంస్థ నాయకుడు శ్రీ యాస్సర్ అరాఫత్ ఇటీవల తమ తోటి పాలస్తీనాగెరిల్లాల ఆగ్రహానికే గురి అయి అంగరక్షకులనికూడా పెట్టుకోవలసి వచ్చింది.



శాలీ క్రిస్టిన్‌రైడ్ అమెరికా అంతరిక్ష ప్రయాణీకురాలు స్కూలు రోజులలో టెన్నిస్‌ఛాంపియన్. భౌతికశాస్త్రంలో పి. హెచ్. డి. పట్టభద్రురాలు. ఈవిడ "ఛాలెంజర్" అనే అంతరిక్ష నౌకలో నలుగురు మగవారితో కలిసి అంతరిక్షంలోకి వెడుతుంది 5 అడుగుల 5 అంగుళాల ఎత్తుకల శాలీ వయసు 32. (అమెరికా ఆడవారికి ఇదొక పెద్ద ఎత్తుకాదు.) శాలీ చెల్లెలు కారెన్ త్వరలో క్రైస్తవ మత ప్రచారకురాలు కాబోతోందిట ..

# వారఫలం

8–7–1983 శుక్రవారం మొదలు 14–7–1983 గురువారం వరకు

♈ **మేషం:** వ్యాపారంలో తీవ్రమైన మార్పులు రానున్నవి. పత్రికా వ్యాసంగమయితే మరీ లాభదాయకమైనవారం, ఆరోగ్య లోపం లేదు. అవసరాలకు డబ్బు అందుతుంది. స్త్రీలకు: ఉన్నత విద్యావకాశాలు, ఆదాయం.

♉ **వృషభం:** వారమంతా బాగున్నది. వృత్తిరీత్యా మీరు చేయు ప్రయత్నాలు ఫలవంతం కాగలవు. గ్రామాంతరం నుండి శుభవార్తలు వినగలుగుచుండుడు. ఆప్తుల మూలాన, మిత్రుల వలన సహాయ సంపత్తులు అమరుతాయి. స్త్రీలకు: విందు వినోదాలు, ఉద్యోగానుకూలత.

♊ **మిథునం:** బాగా ప్రకాశవంతమైన, అనుకూలదాయకమైన లాభదాయకమైన వారమిది. వ్యాపార వృత్తులందు వికాసం కనిపిస్తుంది మీ ఆలోచనలు ఫలించి వారం ఆనంద దాయకం. స్త్రీలకు: చేసే ఉద్యోగప్రయత్నాలు ఫలిస్తాయి. బంధు సహాయం చేకూరుతుంది.

♋ **కర్కాటకం:** కృషి లోపం లేకుంటే వ్యాపార వృత్తులందు అభివృద్ధిఆదాయం గల వారం. వృత్తిలో పోటీపడే వారుంటారు, జాగ్రత్తగా సంచరించాలి. దూర ప్రాంతాలకు కొందరు ప్రయాణించనున్నారు. స్త్రీలకు: వస్తువులు, కొందరు వాహనం కొనుగోలు చేయగలరు.

♌ **సింహం:** అధికారుల ఆదరణకు అవకాశమున్నది. ఇతరుల ప్రీతిని సంపాదించుకొన యత్నించండి. ఉత్తర ప్రత్యుత్తరాల మూలంగా శుభకార్య విషయాలు తెలిసికొంటారు. గృహాభివృద్ధి చేసికోగలుగుతారు. స్త్రీలకు: ఉద్యోగంలో అభివృద్ధి కనిపించటం గమనిస్తారు.

♍ **కన్య:** దాయాదుల వలన గాని శత్రువర్గీయుల వలన గాని వ్యాపారంలో పోటీ వృద్ధి కావటం గమనిస్తారు. కొందరు నూతన వ్యాపారం ప్రారంభించాలని యత్నిస్తారు. అవకాశం వచ్చినపుడు యితరులకు మేలు చేయటానికి వెనుకాడకండి. పై చదువు ప్రయత్నాలు విద్యార్థులకు అనుకూలదాయకాలే. స్త్రీలకు: నగలు కొనుగోలు చేసే అవకాశం, ఆశించిన విధంగా 'ప్రమోషన్' లభించటం గమనిస్తారు

♎ **తుల:** చాలమందికి ధనలోపం, అనవసరపు చిక్కులు చేసిన పనే మరలా చేయవలసి రావచ్చు. ఎవరి మూలానైనా ఒకానొక విషయం నెరవేరుతుందని ఆసిస్తారో, వారు కలిసిరారు. స్త్రీలకు: నూతన వస్తు సేకరణకు, ఆదాయానికి, ఉద్యోగ వృత్తులందు లోపంలేదు.

♏ **వృశ్చికం:** ఏదో విధంగా బాధపడనున్నారు. 'అది యిలాంటిది' అని కూడా తెలియని అయోమయ స్థితి. చేసిన ప్రయత్నాలు ఉద్యోగమందు, మీకు గాకున్నా, సంతానానికి ఫలింపనున్నవి. స్త్రీలకు: సుఖ శాంతులు, విందు వినోదాలకు, చిన్న ప్రయాణాలకు లోపం రాదు.

♐ **ధనుస్సు:** ప్రతి రంగంలో కృషి చేసే వారికి ప్రగతి చెప్పవీలున్నది. ఆరోగ్య లోపం ఏర్పడదు గాని ఏదో బాధతో సతమతం కావటం జరుగుతుంది. గ్రామంలో గాని, నగరంలో గాని పెద్దరికం తెచ్చికొంటారు. స్త్రీలకు: సాంఘికంగా ఉపయుక్తమయిన కాలం. 'ప్రమోషన్' సంభవం.

♑ **మకరం:** ఉద్యోగ వృత్తులందు ప్రగతి సూచకదివాలే. నూతనోద్యోగం కొరకు చేసే మీ ప్రయత్నాలు ఫలిస్తాయి వృత్తిలో పెంపు కనిపిస్తుంది నాలుగు రీతులా ధనం కలిసి రానున్నదని మంచిరోజులని గ్రహించాలి. స్త్రీలకు: చుట్టుప్రక్కల వారి మూలాన యిబ్బందులు రాకుండా చూచుకోవాలి.

♒ **కుంభం:** అధికారులను ఒకకంటగమనించి మెలగండి. ఆదాయం కొరకు ఊరక తాపత్రయపడి లాభం లేదు. మొగమాటాలకుపోయి యిబ్బందులు కొని తెచ్చిపెట్టుకోకండి. అభివృద్ధి కార్యక్రమాలలో జోక్యం కలుగజేసికొని మేలు పొందుతారు. స్త్రీలకు: పదిమందిలో ప్రత్యేకత ఏర్పడే అవకాశమున్నది.

♓ **మీనం:** మీ శాంత స్వభావం, నేర్పు, చాకచక్యం ఈవారం లాభదాయకంకావటం గమనిస్తారు. చాలమందికి ప్రయాణ మూలకంగా లాభించటం చెప్పదగిన అంశం. ఉద్యోగం కొరకు తిరిగి తిరిగి విసిగి వేసారిన యువతీయువకులు ఉత్సాహజనకమైన వారం. స్త్రీలకు: ప్రత్యేకంగా ఉన్నత విద్యాభిలాష నెరవేరుతుంది. ఉత్సాహం అతిశయింపగల వారం.

— *విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి* ★

# మధుర స్మృతులు

శ్రీమతి పాలకూర సీతాలత



"అమ్మా! ఈ పుస్తకం నా టేబుల్ మీద పెట్టమ్మా ..." అంటూ హడావుడిగా లోపలకు వచ్చిన కొడుకు వంక సోఫాలో కూర్చుని ఏదో కుట్టుకుంటున్న మధుర చూపులతోనే అడిగింది — 'ఏమిటా తొందర ?' అంటూ.

"మా ఫ్రెండ్ బర్త్ డే పార్టీ కదమ్మా! ఇప్పటికే ఆలస్యం అయింది. ఈ పుస్తకం సెకండ్ హాండ్ షాపుల్లో కూడా ఒక పట్టాన దొరకలేదు. చివరికి అతికష్టం మీద దొరికింది. వస్తాను ..." అంటూ అంత వేగంగామా బైటకు వెళ్లిపోయాడు జ్ఞానప్రకాశం.

వెళ్లిపోతున్న కొడుకు వంక ఆప్యాయంగా చూస్తూ వుండిపోయింది మధుర. తనకు జీవితంలో మిగిలినదేమిటె ? ఈ ఒక్క బిడ్డేకదా. తన భర్త ద్వారకానాథ్ ... ఆకస్మికంగా మరణించిన తరువాత తనుకూడా చచ్చిపోవాలనుకున్న నిర్ణయం సడలిపోవడానికి కారణం ఈ జ్ఞానప్రకాశం కదూ ? ఆశలన్నీ వాడిమీదే పెట్టుకుని భర్త కోరిక ప్రకారం వాడిని ఇంజనీరింగులో చేర్చి, వాడు భవిష్యత్తులో గొప్పవాడు కావాలని, తన భర్తలాగే 'గొప్ప ఇంజనీరు' అని పేరు తెచ్చుకోవాలనీ ఆశిస్తూ, అందుకు సరియైన వాతావరణం కల్పిస్తూ ప్రాణాలన్నీ వాడిమీదే పెట్టుకుని బ్రతుకుతోంది.

చేతిలో ఉన్న పుస్తకం వంక చూసింది. బరువుగా వుంది. అక్షరాలు చదివింది. 'ఎలక్ట్రికల్ టెక్నాలజీ — బై ... ధరాజా ...' పేరు ఎక్కడో పరిచయం అయినట్లుగా వుంది. ఆలోచించింది. అవును తను కాపురానికి వచ్చిన కొత్తలో భర్త దగ్గర అన్ని పుస్తకాలూవుండేవి. అన్నీ ఒక లైబ్రరీలో వుంచినంత జాగ్రత్తగా వుంచేవాడు.

"చదువు పూర్తయ్యి మీరు ఇంజనీరు అయిపోయారు కదా! ఇంకెందుకండీ ఆ పుస్తకాలు ? అమ్మిపారెయ్యకూడదూ ..." అంది తను.

"లేదు ... అప్పుడప్పుడు నాకు రిఫరెన్సుకి కావాలి ... ఈ పుస్తకాలు చదివే నేను స్టేట్ ఫస్ట్ వచ్చానన్న గర్వం వీటిని చూస్తుంటే కల్గుతుంది. ఏదో చెప్పలేని ఆత్మీయత, వీళ్లు నా స్నేహితులన్న భావమూ కల్గుతుంటాయి. ఇంత విలువైన పుస్తకాలని అమ్మేసి డబ్బు తెచ్చుకున్నా, ఆ డబ్బువల్ల నాకు సుఖం వుండదు."

"మీదొక సెంటిమెంట్ .." అంది సన్నగా నవ్వుతూ.

"సెంటిమెంటో, డబ్బులు గుద్దే మింటో— నాకు తెలియదుగానీ ... నేను లేనప్పుడు ఈ పుస్తకాలు అమ్మిపారెయ్యకు ఇవి నా జీవితాంతం వుండాలి. మన కుర్రవాడు ఈ పుస్తకాలతోనే చదువుకోవాలి .." అన్నాడు తనని దగ్గరకు తీసుకుని, తన బుగ్గమీద మృదువుగా రాస్తూ.

తను సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది.

అతని చేతిని అక్కణ్నుంచి తీసి సౌమ్యంగా విసిరికొట్టింది.

"ఏం ? ఎందుకా సిగ్గు?" అంటూ కొంటెగా నవ్వేడు ద్వారకానాథ్. తన బుగ్గల్ని సుతారంగా నిమిరేడు.

అవును. అప్పుడు తను నాలుగో నెల కడుపుతో వుంది.

మరో నాల్గు రోజుల తర్వాత భర్త ఏదో పుస్తకం రిఫర్‌చేస్తూ కూర్చుంటే

"ఏమిటండీ అది? అంత లావుగా వుంది!..." అంది ఆశ్చర్యంగా.

పుస్తకం ముడిచి అట్టమీద అక్షరాలు చూపించేడు ఆమెకు. చదివింది—

"ఎలక్ట్రికల్ టెక్నాలజీ—బైధ రాజా..."

"ఈ పుస్తకాన్ని కోపంగా ఎవరిమీదకైనా విసిరితే గిద్దెడురక్తం కారుతుంది..."అందితను.

"ఊఁ..." అన్నాడు అతను చిన్నగా నవ్వుతూ, పుస్తకంలో మునిగిపోయి.

పతి అనురాగంలోని మాధుర్యం చవి చూస్తూ, ఆనందంగా కాలం గడిపింది. అలాంటి భర్త దొరకడం తన అదృష్టం అని మురిసి పోయింది. అతను కూడా భార్యనే లోకంగా భావించి, ఆమెకు ఏ రకమైన లోటు కలగకుండా చూసుకునేవాడు. అతనిలాంటి భర్తలు ఈ లోకంలో చాలా అరుదు అన్నమాట పూర్తిగా సత్యం.

జ్ఞానప్రకాశం పుట్టిన నాలుగు సంవత్సరాలకు తనకు తెలియకుండానే ఈ 'ఎలక్ట్రికల్ టెక్నాలజీ' పుస్తకం మాయం అయ్యింది.

ఆ రోజు చిత్తుకాగితాలవాడు వస్తే పాత పేపర్లు, పుస్తకాలు ముందుపడేసి, వంటింట్లో కూర మాడిపోతోందని లోపలకు వెళ్ళింది వాడు చూస్తుంటే— అయిదు నిముషాల తర్వాత తను వచ్చేసరికి వాడు ఆ కాగితాలు అన్నీ సర్దేసుకుని గోనెసంచీలో కుక్కుకున్నాడు. డబ్బులు లెక్క కట్టి ఆమె చేతిలో పెట్టాడు. వాడు వెళ్లి పోయాడు.

ఆ సాయంత్రం ద్వారకానాథ్ మళ్లీ పని పడి ఆ లావు పుస్తకంకోసం చూస్తే అదిలేదు. ఏమైపోయిందా అనుకుంటూ వెతకసాగాడు.

నాలుగేళ్ల జ్ఞానప్రకాశం "ఇంత లావుగా వుండే పుస్తకమా?" అన్నాడు. "అది ఇందాకా వచ్చిన కాగితాల అబ్బాయికి ఇచ్చేశానుగా..." అన్నాడు.

"నువ్వు.. ఇచ్చేవా?" ఆశ్చర్యంగా అన్నాడు ద్వారకానాథ్.

"నేలమీద పడివుంది. అక్కర్లేదనుకుని.."

నిజమే! పొద్దున హడావుడిగా చదువుతూ ఆఫీసుకు వెళ్లే తొందరలో సోఫాపక్కనే నేలమీద వుంచేశాడు. అందుకే...

"అరెరే..." అన్నాడు ద్వారకానాథ్.

"పాపం! పసివాడు... వాడికేం తెల్సు?" అనుకున్నాడు.

అదుగో... ఆ రకంగా ఆ పుస్తకం ఇంట్లోంచి బైటకు వెళ్లిపోయింది.

ఆలోచనలు ఆపి పుస్తకం తిప్పింది. చాలా పాతగా వుంది.

రెండు పేజీలు తిప్పేకా ఆశ్చర్యంతో, ఆనందంతో అలా చూస్తూ వుండిపోయింది.

అందుకు కారణం— ఆ పేజీమీద రంగు

## మధుర స్మృతులు

మాసిపోయి వెలవెలబోతున్న అక్షరాలు. ఆ అక్షరాలు కలిపితే— "సి. ద్వారకానాథ్..." అవుతుంది...

అంటే... ఇది ఆ పుస్తకమే... భర్త పుస్తకమే.

ఆ రోజు... తన చిట్టి చేతులతో పుస్తకం బైటకు పంపేసిన జ్ఞానప్రకాశం, ఈ రోజు దుకాణాలన్నీ తిరిగి తిరిగి ఈ పుస్తకం అదే చేతులతో తెచ్చుకున్నాడు.

రాసివున్న భర్త పేరుమీద కుడిచేతి చూపుడు వేలుతో స్పృశించింది.

ఆ తర్వాత మధురస్మృతులలో మునిగి పోయింది. అవి మధురయొక్క స్మృతులేకాదు— మధురమైన స్మృతులు కూడా.

*  *  *

జ్ఞానప్రకాశం పుట్టిన రెండు సంవత్సరాల తర్వాత ...

ఆ రోజు ఆఫీసు టూర్ మీద వెళ్లిన ద్వారకానాథ్ తిరిగి వచ్చాడు.

ఇంట్లోకి వచ్చిన ద్వారకానాథ్ హాల్లో 'మధుర' కన్పించక పోవడంతో ఆశ్చర్యపోతుండగా మేడ మెట్లు దిగి వస్తున్న డాక్టర్‌ని చూసి కొంచెం గాభరా చెందాడు.

"ఓ ... ఇదేనా రావడం?" అంటూ పలుకరించాడు డాక్టర్.

"అవును... ఇంతకీ మీరు?" ఆత్రంగా అడిగేడు.

"నిన్న మీ మిసెస్ మెట్ల మీంచి జారి పడి పోయారు. గాభరా పడవల్సిన అవసరం లేదు ... సింపుల్ ఫ్రాక్చర్... కానీ ..." ఆగేడు డాక్టర్.

"చెప్పండి డాక్టర్ ..." ఆ గొంతులో ఆందోళన.

"సారీ! ఆమె గర్భం పోయింది ..."

"ఓ ..." బాధగా కళ్లు మూసుకున్నాడు

"ఆమెకు అపాయం లేదు కదా!..."

"లేదు... కానీ... ఆమెకు ఇక ముందు పిల్లలు కలిగే అవకాశం కూడా ..."

"నో ప్రాబ్లమ్ డాక్టర్!... నాకు కావల్సింది 'మధుర ...' ఆమె వుంటే చాలు... ఆమెను రక్షించండి ..."

"ఆమెకు ఏం ఫర్వాలేదు..."అన్నాడుడాక్టర్.

"థ్యాంక్యూ ..." అంటూ అక్కడ ఒక్క నిముషం కూడా వుండకుండా గబగబా మెట్లు ఎక్కాడు.

మంచం మీద కాళ్లకు కట్లతో పడి వుంది మధుర.

"మధురా ..." అంటూ వెళ్లి ఆమె పక్కన కూర్చున్నాడు.

ఆమె నోరు విప్పి మాట్లాడలేదు కానీ కళ్లలో నిండుగా నీళ్లు.

"ఎందుకు? ఏమైందని? నేను వచ్చే శాను కదా!..." అన్నాడు.

ఆమె వెక్కి వెక్కి ఏడ్వడం మొదలు పెట్టింది.

"ఛ ... ఊరుకో... తప్పుకదూ!......" అన్నాడు.

"నేను... మీకు... మీ ఆశ ప్రకారం .. పాపను... ఇయ్యలేను..." బాధగా అంది.

"ఫర్వాలేదు. అందుకు బాధ లేదు. నాకు నువ్వే కావాలి... అంతే..." అన్నాడు ఆమె ముఖం తన చేతుల్లో ఇముడ్చుకుంటూ.

మరో నెల రోజులకు మామూలు మనిషి అయ్యింది... కానీ ఆమెలో మాత్రం గూడు కట్టుకున్న నిరాశ ...

"జరిగింది మర్చిపోయి ఆనందంగా వుండాలి నువ్వు... ఇలా బేలగా కూర్చుంటే నేను చూడ లేను. మధురా... నాకు పిల్లలు నీకంటె ఎక్కువ కాదు... నువ్వే నా సర్వస్వం అని ఎన్ని సార్లు చెప్పాను?" అన్నాడు కొంత బుజ్జగించు తున్నట్లుగా, కొంత మందలిస్తున్నట్లుగా.

ఆమెలో ఆశించిన మార్పు కన్పించకపోతే, సరదాగా ఎటైనా తిరిగి వస్తే బాగుంటుందని 'కాశ్మీర్' ట్రిప్పు వేశాడు.

జబల్పూరు, ఖజురాహో, భోపాల్, గ్వాలియర్, ఆగ్రా, ఢిల్లీ, చండీఘర్, జమ్ము మొదలైన ప్రదేశాలన్నీ తిప్పాడు. చూడదగిన ప్రదేశాలన్నీ చూపించాడు.

ఆమె అనుక్షణం నవ్వుతూ వుండేలా, బాధను మర్చిపోయేలా చేశాడు.

ఆ యాత్రలోనే ఆమె మామూలు మనిషి అయ్యింది.

ద్వారకానాథ్ కూడా సంతోషించేడు అతనికి కావాల్సింది అదే.

ఈ నెల రోజుల్లో ఆమెలో ఉత్సాహం కల్గింది. పాత గాయం మానింది.

జ్ఞానప్రకాశంని అల్లారు ముద్దుగా పెంచుతూ, ఆశలన్నీ వాడిమీదే వుంచుకుని, రోజులు గడపసాగేరు.

మధుర కూడా బాబునే లోకంగా చేసుకుంది.

ద్వారకానాథ్ తృప్తిగా నిట్టూర్చేడు.

ఒక వారం రోజుల తర్వాత ద్వారకానాథ్‌కే ఒక ఏక్సిడెంట్ జరిగింది.

ఆఫీసు నుంచి వర్క్‌సైట్‌కి అతను జీపు నడుపుకుని తీసుకువెళ్తుండగా ఎదురుగా రాంగ్ సైడ్‌లో ఒక లారీ వచ్చింది. ప్రమాదం తప్పించాలనే సదుద్దేశ్యంతో స్టీరింగు పక్కకు తిప్పాడు. అది ఒక చెట్టుకు గుద్దుకుని ఆగిపోయింది. ఆ జర్క్‌కి దూరంగా వెళ్లిపడ్డాడు అతను. ఫలితం — కాలు విరగడం — రెండు నెలలు మంచంమీదే వున్నాడు.

మధుర రాత్రనక, పగలనక అతనికి సపర్యలు చేస్తూ గడిపింది.

# తలనొప్పికోసం ఎన్నో వాడి చూశాను...

- బందిపోటు




## అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!

# సారిడన్




ట్రేడ్ మార్కు 'రోష్'

శక్తివంతమైనది, సురక్షితమైనది. ఒక్కటి వేసుకుంటే చాలు.

HTB-RPL-9324

అన్నీ మంచం దగ్గరే. అతనికి అన్నం అక్కడే. స్నానం లేదు కనుక తడిగుడ్డతో ఒళ్లు తుడిచేది. తల దువ్వేది. బోరు కొట్టకుండా కబుర్లు చెప్పేది. అసలైన, సిసలైన సహధర్మ చారిణిలా ప్రవర్తించింది. ఆమె సేవలకు పొంగి పోయేడు.

"మధురా !. . నావల్ల నీకు పని ఎక్కువై పోయింది కదూ !... నీకు కష్టం కల్గుతోంది కదూ !..." అన్నాడు గిల్టీగా.

అతని పెదాలపై తన అరచేతినుంచింది.

"నా సర్వస్వం మీరే .. మీకుకాక ఇంక నేను ఎవరికి చేస్తాను ? మనమధ్య అలాంటి మాటలకు తావులేదు. మీకు ఇలా అయిందన్న విషయం నాకు బాధ తెస్తుందిగానీ మీకు సేవలు చెయ్యవల్సివచ్చినందుకు కాదు. అది నా ధర్మం.. నా బాధ్యత..."

ఆమె గొంతులోని సిన్సియారిటీకి ఆశ్చర్య పోయాడు.

"మధురా !... నీ మనసు మధురం... నీ పలుకు మధురం... నీ చేతలు మధురం... నీ రూపు మధురం... నీ నడవడి మధురం... నిన్ను భార్యగా పొందిన నా బ్రతుకే మధురం" అన్నాడు.

ఆమె సిగ్గుపడిపోయింది.

"చాల్లెండి. కబుర్లు నేర్చారు. మాటల్లో మహావీరులైపోతున్నారు మీరు..." అంది సన్నగా నవ్వుతూ.

"అలాగా !... మాటల్లోనే కాదు...చేతల్లో కూడా వీరుడనని ఋజువు చేస్తానుండు..." అంటూ ఆమెను చేతుల్తో గట్టిగా బంధించి, ఆమె ముఖాన్ని దగ్గరకు లాక్కుని తన పెదవులతో...

ఆమె విడిపించుకుంటూ —

"ఆగండి... మీకు కాలు బాగోలేదు. కదలవద్దు... ఆవేశపడవద్దు. ."

"ఫర్వాలేదు.. కాలు బలహీనమైనా నా మనసు బలంగానే వుందిలే..."

భార్యాభర్తల మధ్య ప్రేమ ఉంటుంది. కానీ అది ఉండే మోతాదుల్లో తేడా వుండొచ్చు. కొందరు విప్పి చెప్పలేరు. . 'నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నిన్ను విడిచి వుండలేనని. .' అవి మూగమనసులు. అంతమాత్రాన్న ప్రేమ లేదని అనుకోరాదు. ఒక్కొక్కసారి ఒక్కొక్క విచిత్రమైన సంఘటన జరుగుతుంటే ఆ మూగమనసుకు భాష వస్తుంది.

కాలు విరిగి మంచంమీద వున్నా ఒక్క రోజు కూడా బాధపడలేదు ద్వారకానాథ్. మధుర సమక్షంలో అనుక్షణం మధురక్షణాలు గడుపుతూ ఆమె కష్టపడుతోందని కించిత్తు బాధపడుతున్నా ఆమె గుర్తిస్తే ఆమె బాధపడుతుందని సరిపెట్టుకున్నాడు.

మరో రెండు నెలలకు మామూలు మనిషి అయ్యాడు.

వాడిపోని అనురాగ కుసుమంలా, ఇగిరిపోని ప్రేమ గంధంలా — ప్రేమానురాగాలు తమలో తామేకాక బాబుకు కూడా పంచి ఇస్తూ రోజులు గడపసాగారు.

మధుర అంత మంచి భర్త దొరికాడని పొంగిపోని క్షణం లేదు.

ద్వారక అంత మంచి భార్య దొరికిందని ఆనందించని నిముషం లేదు.

ఆదర్శ దంపతుల లిస్టు ఎవరైనా తయారుచేస్తే అందులో వుండవల్సిన మొట్టమొదటి పేరు వాళ్లిద్దరివీ.

సాఫీగా సాగుతున్న ఆ జీవితంలో ఒకసారి ఒక చిన్న అపశృతి పలికింది.

అది ద్వారకానాథ్ ప్రొఫెషన్‌లో మార్పు తెచ్చింది తప్ప, దాంపత్య జీవితంలో కాదు. ద్వారకానాథ్ డ్యూటీలో చాలా ఖచ్చితమైన మనిషి. నీతిగా వుంటాడు. కష్టపడి పని చేస్తాడు. లంచం అన్నమాట వింటే చాలు శివాలు ఎత్తిపోతాడు. ఆ మాట ఎవరైనా అంటే గొంతు చించుకుని 'గెటౌట్' అంటాడు

మంచికి మహారాజా పదవి దక్కుతుందనీ, చెడుకు చెరసాలే గతి అనీ అనుకోవడం ఈ కలియుగంలో తెలివితక్కువ మాట అని మరోసారి ద్వారకానాథ్ విషయంలో ఋజువయ్యింది.

ఒక ప్రాజెక్టు నిర్మాణంలో ఒక కంట్రాక్టర్ రంగస్వామితో గొడవ అయ్యింది. పనిలో జాప్యాన్ని సహించని ద్వారక ఆ కంట్రాక్టర్ నత్తవేగంతో పని చేస్తుంటే అలా కుదరదని గొడవ పడ్డాడు. ఆ కంట్రాక్టర్ నిర్లక్ష్యంగా మాట్లాడేడు. అందుకు కారణం అతను ద్వారక కంటె పెద్ద ఇంజనీర్ల జేబులు నింపడం వల్ల.

అతనిపై ఆఫీసర్లు ఆ రంగస్వామిని సపోర్టు చేస్తూ, అతని పనిలో జాప్యానికి కారణం కొన్ని సామానులు లేకపోవడమని నమ్మించారు. ఆ తర్వాత ద్వారక ఊరుకున్నాడు. కానీ కంట్రాక్టర్ మాత్రం మీసం దువ్వుకుంటూ —

"ఈ ద్వారకకు నేను ఇచ్చిన లంచం సరిపోలేదని అలా గొడవపడ్డాడు. ఆ తర్వాత మరి కొంత సొమ్ము ఇచ్చాను. అందుకే ఇప్పుడు నోరు మూసుకున్నాడు ..." అని చెప్పసాగాడు, అందరితో.

అది నిజమని నమ్మారు పెద్ద ఆఫీసర్లు. వాళ్ళు గుడినీ, గుళ్లో లింగాన్నీ మింగినవాళ్లే అయినా ద్వారక గుడిని మింగేడని భ్రమపడి పెద్దమనిషిలాగ నటిస్తూ —

"ఏమయ్యా! ఆ కంట్రాక్టర్ అలా అంటాడేం ? వాడి దగ్గర లంచం తిన్నావా ?" అన్నారు.

"అదంతా అబద్ధం ... " అన్నాడు నమ్మకంగా.

అన్యాయంగా లక్షలు సంపాదించిన రంగస్వామికి ద్వారక తనని అంత తేలిగ్గా తీసి పారెయ్యడం నచ్చక పగబట్టి, ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి ద్వారకకు ఉద్వాసన చెప్పాలని నిర్ణయించుకుని, కార్యశూరుడై ఆ పై ఆఫీసర్లకు మరింత ఎక్కువ లంచం తినిపించి, దొంగ సాక్ష్యాలు సృష్టించి ద్వారక తన ద్వారా లంచం తీసుకున్నాడని నిరూపించి ద్వారకను సస్పెండు చేయించి గర్వంగా మీసం దువ్వుకున్నాడు.

దొంగని దొంగ అంటే వాడికి కోపం రాదు.

దొంగ కాని వాడిని దొంగ అని వేళాకోళంగా అన్నా కూడా కోపం తెచ్చుకుంటాడు. అదే జరిగింది ద్వారక విషయంలో.

తనపై ఇంత ఘోరమైన నింద వస్తుందని ఊహించకపోవడంతో బాగా దెబ్బతిన్నాడు. అభిమానపడి తనంతతాను ఉద్యోగానికి రిజైన్ చేశాడు.

తను పొదుపుగా వాడుకున్న డబ్బుతో ఒక చిన్న 'ఇంజనీరింగ్ గూడ్స్ షాప్' తెరిచాడు తెలివిగా మేనేజ్ చేసుకుంటూ దాన్ని అభివృద్ధి చేశాడు. దానిమీద బాగానే గడించడం మొదలు పెట్టాడు.

కాలం గడుస్తున్నా, తన నీతిపై తగిలిన దెబ్బకు బాధ మాత్రం తగ్గలేదు. తనలో తాను మథన పడుతూ వుండేవాడు.

"జరిగింది ఏదో జరిగిపోయింది. మర్చిపొండి. ఆ భగవత్కృపవల్ల మనకు లోటు లేకుండా గడిచిపోతోంది. అనవసరమైన ఆలోచనలతో మనసు పాడుచేసుకోకండి ." అని నచ్చ చెప్పేది మధుర.

ఆమె కోసం బాధను మర్చిపోయినట్లు నటించేవాడు.

పన్నెండు సంవత్సరాలు గడిచిపోయాయి

కొడుకు జ్ఞానప్రకాశంని ఏమైనాసరే ఇంజనీరింగులో చేర్చాలని పట్టుబట్టి, సాధించేడు

"చాలు మధురా ... నా కోరిక తీరింది వీడు కూడా ఇంజనీరు అవుతాడు. అంతేచాలు" తృప్తిగా నిట్టూర్చేడు.

ఆ రోజు ... మధుర జీవితంలో చెడ్డ రోజు —

ద్వారక ఆమెకు దూరం అయినరోజు —












జ్ఞానప్రకాశం పితృహీనుడయిన రోజు —

రాత్రి సుమారు తొమ్మిది గంటల వేళ, దుకాణం మూసి ఇంటికి వస్తున్న ద్వారక ఎదురుగా ఒక లారీ చాలా స్పీడ్‌గా వస్తూండటం గమనించాడు. ఫుట్‌పాత్ మీద తనకు కొంచెం ముందుగా రంగస్వామి నడుస్తున్నాడు. డ్రైవరు తాగివున్నాడో, లేక యాంత్రిక లోపంవల్ల కంట్రోలు తప్పిందో తెలియదు గానీ ఆ లారీ ఫుట్‌పాత్ మీదకు వచ్చేసింది. రంగస్వామి ఆ లారీ క్రింద పచ్చడి అయిపోవల్సినమాట. ప్రమాదం గుర్తించి ద్వారక వడిగా ముందుకొచ్చి రంగస్వామిని వెనకాల్నుంచి ముందుకునెట్టి, తను కూడా ముందుకు పోయేంతలో — లారీ క్రింద పడి పోయేడు. లారీ చక్రాలకు అంటిన నెత్తురు ద్వారకది.

రంగస్వామి ముందుకు పడబోయి చేతులతో ఆనుకుని వెనక్కి తిరిగి చూస్తే—జరిగిన సంగతి గమనించేకా — అతడి కళ్లలోంచి రక్తం కారింది— కన్నీళ్లు కాదు.

ద్వారకకు ఇప్పుడు పట్టినగతి, తనకు పట్ట వల్సింది. తనని రక్షించిన వాడు ద్వారక. ఏ ద్వారక ? తను ఎవరి పొట్టమీద కొట్టాడో, ఎవరి సుఖమయ జీవితంలో తను నిప్పులు పోశాడో — ఆ ద్వారక ...

తేరుకుని జరగవల్సిన కార్యక్రమం జరిపాడు పోలీసుల్ని పిలిచాడు. డ్రైవరు తాగి వున్నాడు. ఆ తర్వాత కబురు మధురకు చేరవేశాడు.

ఆమె గుండెలు అవిసేలా ఏడ్చింది. పెడ బొబ్బలు పెట్టింది. ఆ సమయంలో రంగస్వామి అన్నీ అయి కార్యం జరిపించేడు. అతనిలో గొప్ప పరివర్తన వచ్చింది. చుక్కాని లేని నావలాంటి ఆ కుటుంబానికి పెద్దదిక్కు అయ్యి ఆ కుటుంబ భారం మొయ్యాలని అనుకున్నాడు. అదే అన్నాడు —

''అమ్మా ! నన్ను మనస్ఫూర్తిగా క్షమించండి. ఒకనాడు ఆయనకు నేను అన్యాయం చేశాను. అయినా దాన్ని మనసులో పెట్టుకోకుండా నన్ను రక్షించి తన దొడ్డ మనసు చాటుకున్నాడు. నన్ను రక్షించే ప్రయత్నంలో తను ప్రాణ త్యాగం చేశాడు. మీరు ఏం చింతించవద్దు. మీకు తోడు నీడగా నేను వుంటాను. మిమ్మల్ని నా ఆత్మీయులుగా చూసుకుంటాను. ఆర్థికంగా, సాంఘికంగా మీకు అండగా నిలుస్తాను. ఆ దుకాణం నా చేతుల మీదగా నడుపుతాను ...''

మధుర అంగీకారంగా తల ఊపింది.

ఆ రోజు నుంచీ రంగస్వామి వాళ్లకు ఆప్తుడయ్యాడు. దుకాణం చూసుకుంటూ అండగా నిలిచాడు. జ్ఞానప్రకాశం చదువుకుంటున్నాడు. తను మాత్రం భర్తనే తల్చుకుంటూ, తండ్రి లేని లోటు కన్నబాబుకు తెలియకుండా ప్రేమతో అతన్ని పెంచుతూ కాలం గడుపుతోంది.

జ్ఞానప్రకాశం తెలివైనవాడు. బహుశా తండ్రి పోలికలు వచ్చాయి కాబోలు. అతను ఫస్టు రావడం చూసి మురిసిపోతూ వుంటుంది.

'మీ కోరిక మేరకు బాబు గొప్ప ఇంజనీరు అవుతాడు ...' అని రోజుకోసారి అయినా భర్త ఫోటోకు చెప్పుకుని మురిసిపోతుంటుంది. ఇక తన జీవితంలో వాడు కాక వేరేగా మిగిలిన పెన్నిధి మాత్రం ఏమున్నది ? వాడు తన కలల పంట. తన బంగరు నిధి.

వయసులో ముసలిది కాకపోయినా,జీవితంలో అనుభవాలు అన్నీ పొందేశాకా ఇక మిగిలింది ఏముందన్న నిరాశతో రోజులో చాలా భాగం భగవధ్యానంలో గడుపుతోంది. రంగస్వామి చలవ వల్ల దుకాణం చూసేది ఎవరన్న సమస్య లేదు. అతను వచ్చి డబ్బు ఇస్తాడు. కొడుకు చదువుకుంటాడు. తను మాత్రం ఇల్లు కదలక, ఇంటి పనులు చేసుకుంటూ, భర్తను తల్చుకుంటూ, కొడుకును ప్రేమగా పెంచుకుంటూ —

* * *

''ఏమిటమ్మా ? నువ్వు అప్పట్నుంచీ అలాగే కూర్చుని వుండిపోయావా ? చేతుల్లో ఆ పుస్తకం అలాగే వుండిపోయింది. ఆ కళ్లనిండా తడి ఎందుకమ్మా ?'' అన్నాడు జ్ఞానప్రకాశం వస్తూ.

స్మృతులలోంచి తేరుకుందుకొక నిముషం పట్టింది మధురకు.

ఆమె భుజాలు పట్టుకుని కుదుపుతూ ''అమ్మా'' అన్నాడు జ్ఞానప్రకాశం..

''ఏంలేదుబాబూ ! మీ నాన్నగారు జ్ఞాపకం వచ్చారు'' అంది.

''జ్ఞాపకం రావటమా ? ఆయన్ని నువ్వు అసలు మర్చిపోతే కదమ్మా జ్ఞాపకం రావడం రోజులో సగభాగం పైన నువ్వు ఆయన్నే తల్చుకుంటావు.''

''అదికాదురా ! ఈ పుస్తకం ... మీ నాన్నగారిదే...'' అంది పేరు చూపిస్తూ.

''నిజమా అమ్మా...''అంటూ ఆ పుస్తకం లాక్కుని ఆ పుస్తకం ముద్దు పెట్టుకున్నాడు కళ్లకు అద్దుకున్నాడు. ప్రేమగా నిమిరాడు

''నిజమా అమ్మా...నిజమా !...'' అతని భావోద్వేగం చెప్పలేనిది.

తల్లి పక్కనే కూర్చుని ఆ పుస్తకం వైపు ఆనందంగా, తండ్రి పేరు వైపు ఆప్యాయంగా చూస్తూ వుండిపోయేడు.

ఇంతలో రంగస్వామి వచ్చేడు.

ఒక బ్యాగ్ మధురకు అందచేస్తూ—

''ఇందులో అయిదువేలు ఉన్నాయమ్మా!.. వుంచండి ... ఎల్లుండి మన దుకాణంకి కావల్సిన కొన్ని సరుకులకోసం పట్నం వెళ్లాలి ... వస్తానమ్మా ! ...'' అన్నాడు.

ఈ రంగస్వామి లేకపోతే కొడుకు చదువు కుంటుపడేదే. ఆ షాపు చూసుకోవాల్సి వచ్చేది. ఈ పెద్దమనిషి అసలైన మనిషికి వుండాల్సిన మంచి మనసు వుంది. అందువల్లనే పరివర్తన చెందాడు.

రంగస్వామి మెట్లు దిగి వెళ్లిపోయాడు.

ఆ క్యాష్‌బ్యాగ్ కొడుక్కి ఇచ్చి లోపల బీరువాలో పెట్టమంది.

జ్ఞానప్రకాశం లోపలకు వెళ్లాడు.

ఆ పుస్తకాన్ని ముద్దు పెట్టుకుంది మధుర. ఆ పుస్తకం పేరు చదివింది మరోసారి.

''ఎలక్ట్రికల్ టెక్నాలజీ—బైద రాజా...''

భర్త పేరు చదివింది.

''సి. ద్వారకానాథ్ ...''

ఆ పుస్తకం గుండెలకు హత్తుకుంది మధుర. 






# కొత్త గొంతులు

— టి.యల్. కాంతారావు

ఎందుకొస్తావు మళ్ళీ
నా స్వప్నాల్లోకి ఊర్వశీ !
ఎన్నాళ్ళీ క్షోభ కన్నీళ్ళు.
నాకెన్నాళ్ళీ వెక్కిళ్ళు
ఎన్నాళ్ళీ చీకటి గుడారంలో
బతుకెన్నాళ్ళు —
నీకోసం ఎదురు చూస్తూ
వాక్కుడెళ్ళ లోకానికి !

— వజీర్ రహ్మాన్

1934 లో వచ్చాడు; 1983 లో వెళ్ళిపోయాడు. ఈ మధ్యకాలంలో 1963 లో 'ఎచటికి పోతావీరాత్రి' 83లో 'సాహసి' రెండు కావ్యాలు మాత్రమే ఇచ్చాడు. చలంతోవ తన తోవగా, చలం రక్షణ హస్తం తన జీవితానికి తోడుగా, చలం భావం తన ఊపిరిగా జీవించాడు రహ్మాన్. చలం రచనల్లోని కవిత్వాన్ని 'కవిగా చలం' అనే గ్రంథంలో చూపించాడు. మధురానంద కవితాకాశంలోనూ, దుర్గమ జీవన కీకారణ్యంలోనూ, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ భావసంపత్తిని, అనుభవాన్ని, జటిల సత్యాల్ని చలంనుంచి జీర్ణించుకున్నాడు. వివిధ భాషలలో అతనికున్న పాండిత్యం, ప్రాచ్య పాశ్చాత్య కవుల, విమర్శకుల తత్వ అవగాహన, కళపట్ల, జీవితం పట్ల అతనికిగల ఆరాధనభావం, జీవితాన్ని గురించిన అన్వేషణ అతని కవిత్వంలో వెలుగు చూసింది. ఉత్తమ కవిత్వమైనదానికి వివరణలూ, వ్యాఖ్యలూ అవసరం లేదంటాడీయన. దానికదే పాఠకునికి రసస్ఫూర్తిని కలిగిస్తుందని రహ్మాన్ అభిప్రాయం. ఈతని కవిత్వం ఎక్కడో తప్ప ఏ పత్రికల్లోనూ అచ్చు అయిందికాదు; అట్లా కావటం అతనికి ఇష్టంలేదుకూడా. 'తలనెప్పి మాత్రలకీ, గజ్జిమందు ప్రకటనలకీ మధ్య కవిత్వం ఇరికించి అచ్చువేయడంచూస్తే దేశంలో కవులకి పట్టిన దుస్థితికి దిగులూ, సంపాదకాధముల నిర్లక్ష్య బుద్ధికి అసహ్యమూ' అంటాడాయన. కవి జీవితానికీ, కవిత్వానికి విడదీయరాని ఐక్యత ఉంటుందని, జీవితానుభవంలోకి దానిదేదీ కవిత్వంగారాదని, ఒకవేళ వచ్చినా అది నామమాత్రంగానే మిగిలిపోతుందని చాలా బలంగా చెప్పాడీయన. గొప్ప కవిత్వ సృష్టికి జీవితానుభవమేకాక, అనంతమైన రచనా శిల్ప నైపుణ్యంకూడా ఆవశ్యకమని ఇతను నమ్మాడు. ''నన్ను ఆవేశపర్చిన అనుభవాల్నీ, నాకు తెలిసిన నేనెరిగిన వ్యక్తుల్నీ నా కవిత్వంలో ఇతివృత్తాలుగా యేరాను. నా అనుభవానికి రానిదీ, నాకు తెలీనిదీ రాయలేదు. అందువల్లనే సమకాలీన రాజకీయ రగడలు కాని ఆ బాపతు ప్రసక్తి కాని నా రాతల్లో రాదు. ఇది వాటిపట్ల నాకు విముఖత వల్ల మాత్రం కాదు. వాటిలో నాకు ప్రవేశం అనుభవం లేకపోవడం వల్లనే' అన్న అతని మాటలు గమనిస్తే అతన్నీ, అతని కవిత్వాన్నీ సరిగ్గా అర్థం చేసుకోవచ్చు. తన చుట్టూ లోకం నిండా అలుముకున్న అశాంతినీ, దుఃఖాన్నీ, దారిద్ర్యాన్నీ, ఎటు చూసినా కనిపించే, వినిపించే అమానుషాలను, ఆక్రందనలను, దిక్కులేని దీనజనుల దుర్భర హాహాకారాలను, మౌన బాధల్ని, వ్యధల్ని, కన్నీళ్ళని ఈ కవి చూశాడు కనుకనే సముద్రమంత విశాలమైన జీవితాన్ని ఏ ఒక్క చిన్ని రాటకో కట్టెయ్యలేదు. ప్రతిరోజూ ఆత్మనీ, దేహాన్నీ అమ్ముకుని అవమానాలనూ, ఉమ్ములనూ మోస్తూ, సహిస్తూ, అధికార ధూర్తుల ఇనుప బూట్ల కింద నలుగుతూ, ఎంగిలి మెతుకులు కతికే



నికృష్టపు బతుకుని తిరస్కరిస్తూ—పదవులూ, పరుగులూ, ఆశలూ, ఆక్రోశాలూ లేని స్వచ్ఛమైన బతుకుని కోరుకొన్నాడీ కవి. జీవితం ఒక వైకుంఠపాళి అని, దాంట్లో నేర్పరితనం కలవాళ్ళు తెలివి పికిరీలతో కళ్ళు కప్పి పరమపద పీఠమెక్కిపోతారని, న్యాయమనీ, దైవమనీ మళ్లీ మళ్లీ గళ్ళ లెక్కపెట్టుకుంటూ కూర్చునేవాళ్ళు సర్పకాట్లతో బ్రతుకును ఛిద్రమూ; దరిద్రమూ చేసుకొని ఎప్పటి రొచ్చులోనే మిగిలిపోతారని ఈ లోకపు న్యాయాన్ని అరబద్ధం చేశాడు.

జీవితాన్ని ఏ దృక్పథల్లోంచైనా గాఢంగా పట్టించుకున్న ఏ రచయితనీ, కవినీ సంఘం గుర్తించకపోగా ద్వేషిస్తుంది. శ్రీశ్రీని ఒకరకంగా ద్వేషిస్తే, చలాన్ని మరోరకంగా ద్వేషించటం మనకు తెలిసిన విషయమే. జీవితంలో ఉన్న, నిజాలవైపు హృదయాలను మళ్లించి, నేత్రాలను తిప్పిన వాళ్ళ వీళ్ళ. ఆ నిజం వైపే అంత గాఢానుబంధంలోనూ ప్రయాణం సాగించినవాడు వజీర్‌రహ్మాన్. మంచివాళ్ళు బాధపడుతున్నారు; చెడ్డవాళ్ళు సుఖపడుతున్నారు. మంచివాళ్లకు న్యాయం జరుగుతుందా ? ఇక్కడ చేసే మంచి, చెడులకు ప్రతీకారం ఇక్కడి వాళ్లకు తెలియకుండా జరగడమేమిటి ? ఇట్లా చెలం, రహ్మాన్ ప్రశ్నించుకుంటూ సాగిన అన్వేషణే అతని జీవితం; కవిత్వం.

కవి ఇస్మాయిల్‌గారికి తమ్ముడు; చెలంగారికి అల్లుడు వజీర్ రహ్మాన్. ఆనాడు చెలం తనికి తనే శిష్యై, శిలవై, గుండె కార్చే ఏకాకితనంతో అందరికీ దూరమై, బ్రతుకు భారమై కలుషాలకు, విషాలకు, మురికి మాలిన్యాలకు అతీతంగా సత్యసాధన అనే నిప్పుల భాండం నెత్తిన పెట్టుకుని రమణాశ్రమానికి వెళ్ళి అక్కడ తపనలో, వేదనలో, సాధనలో ''లేదు. నాకేం రాలేదు. ఎంత తరచి చూసుకున్నా, ఏ విధంగానూ నాకేం వచ్చినట్టు కనబడదు. ఇదంతా ఏం లాభం లేకపోయిందనిపిస్తోంది''అంటూ వెళ్ళిపోయాడు. వొంటరై, బ్రతుకు శోకమై తరగని బాటకేసి చూసి చూసి, ఈ రాత్రి యింకెంత దూరమో, ఈ వియోగ మింకెంత కాలమో అనుకుంటూ తన సాహసకాన్వేషణా ప్రస్థానాన్ని ఆపుచేసి ఈ లోక శోకాలు తప్పకొని, ఇరుకు చీకట్లు విప్పకొని ఏ నిర్మలోజ్వల స్వర్గతీరాల్లోనో, అనంత శాంతిలో శయనించటానికి వెళ్ళిపోయాడు కవి, తాత్వికుడు, అన్వేషకుడు వజీర్ రహ్మాన్. ★




(గత సంచిక తరువాయి)

ఆ లేడికూన పద్మ కంటివెంట నీరు కార్చు తోంది. జాలిచూపులను చంచలంగా అటూ యిటూ త్రిప్పుతూ ఏవో మూగ కోరికలను వెల్లడించుతోంది.

అది పుట్టిన తదాది యింతవరకూ లక్ష్మిని, ఏకవీరను విడచి గడిపిందిలేదు. ఇప్పుడీ దాపురించిన సంఘటన దానికి యమదర్శన మయినంత విషాద మయింది.

''నాయనా యిదిగో నీకు ఏకవీర యిచ్చిన ప్రేమకానుక. తీసుకో'' అన్నాడు వెంకన్నదొర.

''తండ్రీ నీవు మారీచుడు మాయలేడిని పట్టి శూర్పణఖకు సమర్పించినట్లుగా నాకు తెచ్చియిచ్చేవు'' అంటూ తండ్రిని తన శకార పాండిత్యంతో ప్రశంసించేడు బిజ్జలుడు.

''మరి నీవుకూడ నా ముచ్చట తీర్చవూ'' అంటూ ఒక కోరికను వెల్లడించటానికి ఉద్యుక్తుడయ్యేడు వెంకన్నదొర. వాస్తవానికి ఆయనకు తన బిడ్డ తెలివితేటలూ, పాండిత్యమూ ఎంతటివో అర్థం అవుతూనే ఉంది. కాని నిష్ప్రయోజకు డనుకుంటున్న తన కుమారుడు ఏకవీరను ఎలా వలలో వేస్తున్నాడోకాని ఆనాడొక అందాల వేంకటేశ్వరుని విగ్రహాన్ని తెచ్చేడు. అది ఏకవీర యిచ్చినదే. తరువాత దానిని చూచేందుకు ఏకవీర తమ యింటికికూడ వచ్చింది.

ఇప్పటికిప్పుడు లేడికూన పద్మను తెచ్చేడు. ఇదికూడ ఏకవీర బహూకరించినదే అని అంటున్నాడు. నిజమే అయివుంటుంది. ఏది ఏమయినా తన కుమారుడు ఎలా సాధించితే నేమిటి? తను కోరనున్న యీ కోరికను కుమారుడు తీర్చగలిగితే యజ్ఞం పూర్ణాహుతి జరగకుండా గందరగోళాన్ని సృష్టించవచ్చు అని భావించేడాయన.

''తండ్రీ! ఏమిటి నీ ముచ్చట? లోహితాస్యుడు దుష్యంతుని కోరిక తీర్చినట్లు నేను నీ కోరిక తీర్చగలను'' అంటూ అసంబద్ధ పురాణం వల్లించేడు బిజ్జలుడు. అతడు చెప్పే ఉపమానాలు వింటూవుంటే తండ్రికి మతి పోతూవుంది.

''నాయనా! యీ ప్రేమకానుకలుకావు. వీటిని నీకిచ్చే ఏకవీరనే నీవు వశపరచుకుని తీసుకు రావాలి. అందుకు నీకు నాలుగు రోజుల వ్యవధి యిస్తున్నాను. తెలిసిందా?'' అంటూ కొడుకుకి కర్తవ్యాన్ని ఉపదేశించేడు వెంకన్నదొర.

''ఓ! అలాగే. అది నాకెంతపని. కాని ఏకవీర యీ మధ్య పరధ్యానంగా ఉంటోంది. నేను పిలిచినా పలకటమే అపురూపమయింది'' అంటూ తన నిజమయిన సందేహాన్ని వెల్లడించేడు బిజ్జలుడు.

''మరి యీ ప్రేమకానుక ఎలా తెచ్చేవు?'' అంటూ ప్రశ్నించేడు వెంకన్నదొర అయోమయంలోపడి.

''ఓ అదా! అది అంతే...'' అంటూ అర్థంలేని ఒక సమాధానం బాణంలా వొదిలి తండ్రిని మరింత అయోమయంలో ముంచేడు బిజ్జలుడు.

వెంకన్నదొరకు విసుగొచ్చింది. ఆయన వెళ్ళి వసారాలో ఎత్తరుగుమీద తనకోసం ఎదురు చూచే సింహాసనంలాంటి దానిమీదికి వెళ్ళేరు

ఆలోచనలతో పరధ్యానం చిత్తగించేడు బిజ్జలుడు. అదే అదను చూసుకుని అతని చేతుల్లోనుండి ఛెంగున దూకి తక్షణమే పరుగు లంకించుకుంది లేడికూన పద్మ.

''పద్మా... పద్మా... పోకు. పోకు'' అంటూ మళ్ళీ దాని వెంటపడ్డాడు బిజ్జలుడు వెంకన్నయితే అటుకేసి ముఖంకూడ త్రిప్పలేదు. బిజ్జలుడు నిస్సహాయంగా దారినపోయేవారినీ పాలేర్లనూ పేరు పేరున పిలిచి నానా హడావుడి చేయసాగేడు. అతని గోల విపరీతమనిపించి ఎవరూ పలకలేదు. కాస్సేపు అలాగే పెరడంతా పరుగెత్తింది పద్మ. బిజ్జలుడు యిహ కాలుతీసి కాలు వెయ్యలేని స్థితికి వచ్చేడు.

యిది తన శరీరంలోని నీటిని తోడివెయ్యటానికే తనకు దాపురించింది. ప్రేమకానుక అనగానే తండ్రి పొంగిపోతాడని అలా చెప్పేడు తను. ప్రేమ యింత భారంగా ఉంటుందా? యీ ప్రేమవలన యింత ప్రయాస వున్నదనుకుంటే తానసలు దాని జోలికి పోకుండానే ఉండి పోయేవాడు.

ఇప్పుడు ఏకవీరను ప్రేమించి ఆమె యిచ్చిన పద్మను బుజాలమీదికి ఎక్కించుకున్నందువల్ల యింత ఆయాసం కలిగింది. తండ్రి ముచ్చట తీర్చేందుకు ఏకవీరనే యింటికి తీసుకువస్తే మరెంత ఆయాసం కలుగుతుందో అని ఆలోచించసాగేడు.

అదే అదను అనుకొని వీధిలోకివచ్చి ఛెంగు ఛెంగున పరుగెడుతూ ఆశ్రమంకేసి పోసాగింది పద్మ.

కొంతసేపటికి అది పారిపోయిందన్న తెలివి తెచ్చుకుని దానిని వెదుకుతూ తాను కూడా వీధిలోకి వచ్చాడు బిజ్జలుడు.

వసారాలో తన తాతలనాటి నుండి వారసత్వంగా వొచ్చిన ఆ చిన్న సింహాసనంలో కూర్చున్న వెంకన్నదొర యిదంతా చూచేడు.

ఆయనకు భవిష్యత్తు అర్థమయింది. తాను చీకటివయిపుగా నడుస్తున్నట్లు ఒక అనుభూతికి లోను అయ్యేడు.

''దొరవారు పరధ్యానం చిత్తగించేరు...''

**జరిగిన కథ — 10:** పద్మగంధి ఒక భిక్షకత్తె వేషంతో ఓరుగల్లులోని ఒక పాంథశాలకి చేరుతుంది. తను, పరదేశి కలసి గోపాల దేవునికి బుద్ధి చెప్పాలనుకుంటుంది. త్రిపురాంతకుడు గోపాలదేవునికి బాగ బుద్ధి చెపుతాడు. ఆహవమల్లు జైనస్వామి ఆదేశానుసారం జైన సభలు ప్రారంభించను ఏర్పాట్లు చేయడనికి మొగలిచెర్లలో విడిది చేస్తాడు. మొగలిచెర్లలో ఏ హరిజనుడు ఏకవీరదేవి ఆలయానికి వెళ్ళరాదని ఆజ్ఞ జారిచేస్తాడు వెంకన్నదొర. గోపాలదేవునికి స్పృహ పోగొట్టి పద్మగంధితో పాలంపాట చెర్వుకి బయలుదేరాడు త్రిపురాంతకుడు. వారిద్దరు రామప్ప ఆలయంలో జైనస్వామిని కలుస్తారు. జైనస్వామి పద్మగంధిని గుర్తిస్తాడు. ఏకవీర ఏడుకొండలవాడే తన సర్వస్వం అని భావించడం చూచి శ్రీదేవుని మనసు వికలమైంది. శ్రీదేవుడు స్వామిని నిందించగా ఏకవీర శ్రీదేవుడ్ని గాయ పరుస్తుంది. జైనస్వామి పద్మగంధిని జైనం స్వీకరించమని కోరగా తిరస్కరిస్తుంది. త్రిపురాంతకుడు తన ఛురికను వసంతునిపై విసిరి పద్మగంధితో పారిపోతాడు. పద్మగంధిని కాపాడే బాధ్యత తనపై ఉందని భావిస్తాడు త్రిపురాంతకుడు. ఏకవీర తాను దర్శించిన ఆ స్వామి రూపును మహాదేవుడికి వర్ణించి చెపుతుంది.

అంటూ అక్కడకు ప్రవేశించింది పద్మగంధి. ఆమె బహిరంగంగా వెంకన్నదొర యింటికి రావటం అదే ప్రథమం.

వాస్తవానికి వెంకన్నదొర యిల్లు అను వంశికంగా వారికి లభించిన హోదావల్ల న్యాయ స్థానం లాంటిది. ఊరివారి తగవులూ వగైరాల మీద విచారణ అక్కడే జరుగుతాయి. కాబట్టి అక్కడకు ఎవరైనా బహిరంగంగానే వొచ్చి పోవచ్చును. న్యాయస్థానంలోకి రాకూడని పౌరు దుండదు కదా!

''ఎప్పుడనగా కబురు పంపేను...''ఆమెకేసి చూడసాగేడు వెంకన్నదొర. యిటీవల ఆమెలో వయారపు మెరుపు క్షీణించినట్లు అనిపించింది.

దాని స్థానంలో మాతృత్వం తాలూకు గాంభీర్యం చోటుచేసుకుంటున్నట్లు అనిపించింది ఆయనకు.

''ఆటలకు వెళ్ళడం మానివేసేవా?'' అంటూ మళ్ళీ ప్రశ్నించేడు ఆయన. ఆమె మెత్తగా నవ్వింది. అందులో వెనుకటి కవ్వింపు లేదు. మనసులో వెలరేగుతున్న పవిత్రమైన



మాతృత్వపు మెరుపు వుంది. యిదంతా గమనించేడు దొర.

''చాలానే మారిపోతున్నావు...'' అన్నాడు మళ్ళీ.

''ఊఁ... యింకా...''అన్నది ఆమె రవ్వంత చనువు తీసుకొని.

''ఏమిటి ? యింకా...'' ప్రశ్నించేడాయన.

''యిప్పటికి మూడు వ్యాఖ్యానాలు విసిరేరు. యింకా అనవలసినవి ఏమయినా ఉన్నాయా !''

''ముందు లడిగిన ప్రశ్నలకు చెప్పు.'' వెంకన్నదొర.

''దొరా ! మీరు కబురు పంపేరు కాని వెంటనే పరిగెట్టుకు రావటానికి నా చేతిలో ఏముంది. ఆటలకు వెళ్ళడం నిజంగానే మాని వేసేను. ఇక మార్పు అంటారా ? ఏ మార్పూ రాకపోతే యీ జీవితాలను నడిపే శక్తి... అదే... కాలం... అనేది ఒకటున్నదని మనం మర్చి పోతాం. అందుకనే మనలో మార్పు చూపించి తనను మర్చిపోకుండా చేస్తుంది కాలం...''

''మరి యిదివరకు ఎలా రాగలిగేవు ?''

''అప్పటి స్థితి వేరు అప్పటి మీ కోరికలు వేరు ?''

''ఏమిటో అవి'' వెటకారించేడు వెంకన్న దొర.

''అవి వీమిటో మీ మనసుకు తెలుసు నేను నోటితో ఎలా చెప్పను. కాని యిప్పుడు యిప్పుడు మీరు అడుగుతున్నది నేను సమర్పిం చుకోలేనిది. మీరు కోరితే నా శరీరాన్ని—వేశ్యను కనుక సులభంగానే సమర్పించేను. కాని యిది మొత్తం వాడకు సంబంధించిన విషయం నా ఒక్కదాని చేతిలో ఏముంది ?''

అంటూ ఆయన వేసిన ప్రశ్నలన్నింటికి వరుసగా సమాధానం యిచ్చింది పద్మగంధి.

ఆ వివరాలు తెలుసుకోవటం అవుసరమని పించింది వెంకన్నదొరకు.

''ఓహో ! చాల గొప్పగానే చెప్పావు. ముందు యిది చెప్పు. నేను కబురెట్టగానే పరుగెట్టుకు రావటం నీ చేతిలో లేదన్నమాట ? ''

''లేదు ?''

## తిరుచరణాలు

"అక్కలవాడలో అందరికీ నచ్చచెప్పటంలో నీవు విఫలమయ్యావన్నమాట ?"

"అసలు వారందరికీ నచ్చచెప్పాలన్న తపన నాకు కలుగనేలేదు."

"ఏమో ! ఎందుకని ?" కటువుగా ప్రశ్నించేడు.

"ఎంత వేశ్యజన్మ ఎత్తినా...శరీరాలనైతే అమ్ముకోగలం. అందచందాలనైతే అమ్ముకోగలం. ఆటపాటలనైతే అమ్ముకోగలం. కాని ఆత్మలను అమ్ముకోగలమా దొరా ?"

"ఎంత రాటు తేలేవే నీవు ?"

"అంతరంగాన్ని చీల్చుకువచ్చిన మాటలే మీకు చెప్పుతున్నాను."

"అయితే మీరంతా శాంతి యజ్ఞం వయిపు మొగ్గేరన్నమాట ?"

"అదికూడా నేను నిశ్చయంగా చెప్పలేను ఎవరియిష్టం వారిది. కాదనేందుకూ అవుననేందుకూ మనకేమి సావకాశం ఉన్నది."

"మరి నీవు నిద్రపోతున్నావా ?" అంటూ ఉరిమేడు దొర.

"నిద్ర లేచేను దొరా !"

"అందువల్లనే ఆటలకు వెళ్ళటం మానివేసేవా ?"

"నిజం"

"ఏమిటా నిజం. యీ నిజం యిన్నాళ్లూ ఎక్కడుంది."

"చరిత్ర పుటల్లో దాక్కుంది. నివురు కప్పుకున్నదన్నమాట?"

"అంత గొప్ప విషయమా ?"

"అవును దొరా ! ఆడదాన్ని అంతర్యాన్ని చీల్చివేసే అంతర్మథనం ఆడబ్రతుకు అందుకోవలసిన తుదిమెట్టు"

"యీ వేధవ సుగుణం మాని అర్థమయ్యేట్టు చెప్పు." పద్మగంధి ఆలోచనలో పడింది

"యిప్పుడీ విషయాన్ని వెల్లడిస్తే ఏమవుతుంది" ఎంత దాచుకున్నా ఆమె మాతృ హృదయం దాగేట్టులేదు

ఆమెలో ఘర్షణ చెలరేగింది జైనస్వామి యిక్కడకు రావటం అనేది అనుమానాస్పదమయిన విషయం. ఆయన మాటను విశ్వసించి తాను అప్రమత్తురాలై ఉండటం సమంజసం కాదు. మానవ మస్తిష్కంలో ఉండే పైశాచికమైన ప్రవృత్తులు ఆమెకు బాగా తెలుసు. ఎందుకంటే... ఆమె వృత్తి అటువంటిది.

బయట ప్రపంచానికి కనుపించే వెంకన్నదొర వేరు. కాని తను చూచే వెంకన్నదొర వేరు. బయట ప్రపంచానికి వెంకన్నదొర గొప్ప వ్యవహారవేత్త. గ్రామానికి అధికారి. ఎవరికైనా ఏదయినా కష్టం వొస్తే ఆయనతో చెప్పకోవాలి. తగవు వస్తే ఆయన తీర్చాలి. ఏదయినా శుభ కార్యాలయినా, అశుభకార్యాలయినా ఆర్థిక యిబ్బందులొస్తే ఆయన ఆదుకోవాలి.

కనుక బయట ప్రపంచంలో వెంకన్నదొర వేరు. కాని తన దగ్గర... వెంకన్నదొర మామూలు మనిషి. అందరు మనుషుల్లో ఉండే బలహీనతలు ఆయనకూ ఉంటాయి. ఆయన తనదగ్గర నిజరూపం చూపుకోవాలి. సమాజం కోసం తాను ధరించిన ముసుగును తీసివేసుకోవాలి.

మామూలు మనిషి అయిపోయి తన కోర్కెలను వెల్లడించుకోవాలి. తన బలహీనతల్ని బయటపెట్టుకోవాలి.

ఒక వెంకన్నదొర అని ఏముంది. ఎవరైనా అంతే. ప్రపంచానికి చూపేందుకు వాళ్ళు ధరించిన ముసుగుల్ని వేశ్యల దగ్గరకు వొస్తే తొలగించుకుంటారు. అసలు రూపంలో కనిపిస్తారు.

అందువల్ల పద్మగంధికి మనిషి అంటే ఏమిటో తెలుసు అతనిలో ఉండే బలహీనతలు ఏమిటో తెలుసు.

రానున్న కురుక్షేత్ర సంగ్రామంలో ఎందరు మామూలు సామాజికులు, మధ్యతరగతివారు బలైపోతారో ఆమె ముందుగానే తన అనుభవంతో ఊహించగలదు

ఆ మారణహోమంలో తన కుమార్తె బలికాకుండా కాపాడుకోవాలి. ముఖ్యంగా వెంకన్నదొర వేసే ఎత్తులు తనకు తెలుసు. యజ్ఞం సాగకుండా ఆయన చేస్తున్న ప్రయత్నాలు తనకు తెలుసు హరిజనుల్ని ఎలా బెదిరించి లొంగదీశాడో కూడ తెలుసు

అవసరమనుకున్నప్పుడు ఆ బెదిరింపును నిజంగా మార్చే శక్తికూడ ఆయనకు వున్నది. తన లక్ష్యం నెరవేరటానికి ఎవర్ని బలిచేయాలనుకుంటాడో అక్షరాల అలానే చేసితీరుతాడు.

ఆ బలి హోమంలో తన కుమార్తె బలికాకుండా రక్షించుకోవాలి కృష్ణస్వామి హిందువు ఆయనకు లక్ష్యం కోసం తన ప్రాణాలివ్వటమే తెలుసు వెంకన్నదొరకు లక్ష్యం కోసం ప్రాణాలు తియ్యటం కూడ తెలుసు

కనుక తన కుమార్తెకు రక్షణ కావలసింది వెంకన్నదొర నుండి మాత్రమే అని ఆ మాతృమూర్తి ఆలోచించసాగింది.

ఆయననుండి రక్షణ పొందాలంటే ఆయనకు యథార్థం చెప్పటం అవసరమనిపించింది

జైనస్వామిమీద వెంకన్నదొరకు ఏపాటిభక్తి ప్రపత్తులున్నాయో తనకు తెలియదు. కాని వెంకన్నదొర స్వార్థం నెరవేరటానికి జైనస్వామి పాడినపాటే ఆయనా పాడాలి. అంటే జైన స్వామికి కోపం తెప్పించకుండా ఉండాలి

ఆ పరిస్థితిలో ఏకవీర జైనస్వామికీ, తనకూ జన్మించిన రహస్యం తెలియచెయ్యటం అనవసరమేనని ఆ మాతృహృదయం తలపోసింది. ఆ

రహస్యాన్ని బయటపెట్టవలసిన సమయం ఆసన్నమయిందని ఆమె ఊహ. అందువల్ల కుమార్తెకు రక్షణ దొరుకుతుందని ఆమె ఆశ.

''ఏమిటో దీర్ఘమయిన ఆలోచనలో మునిగిపోయేవు'' అంటూ హెచ్చరించేడు వెంకన్నదొర.

పద్మగంధి తృళ్ళిపడి చూచింది. వెంకన్నదొర విలాసంగా నవ్వుతున్నాడు. పద్మగంధిని తీవ్రమయిన ఘర్షణలో పెట్టగలిగేననీ, యీ ఘర్షణనుండి చివరకు ఆమె తనవయిపే మొగ్గు చూపుతోందనీ ఆయన నిర్ణయించికోగలిగేడు. అందుకే అలా విలాసంగా నవ్వుతూ ప్రశ్నించేడు.

''అనువు దొరా! యిన్నాళ్ళుగా కరుడు కట్టిన ఆంతర్యం యీ నాడు మీ ముందు బద్దలవుతున్నది'' అన్నది పద్మగంధి.

ఆమె ఏదో చాల ముఖ్యమయిన విషయమే చెప్పబోతున్నదని ఊహించేడు దొర. అయినా తాను అంతగా శ్రద్ధాసక్తులు కనబరచకూడదు. అలా చూపితే ఆమె కొంత బెట్టుచేసే అవకాశముంటుంది. అప్పుడు పూర్తిగా విషయాన్ని రాబట్టేందుకు తాను కొంత లొంగిపోవాల్సి వొస్తుంది. లేదా కొంత మూల్యాన్ని చెల్లించాల్సి వుంటుంది.

''దొరా! ఎన్ని యుగాలు చూచినా స్త్రీ జాతి చరిత్ర ఒక విధంగానే ఉంటుంది. ఆమె స్థితి మారకపోవటానికి కారణం ఆమెలోని పవిత్రత. అంటే వినటానిని ఆశ్చర్యంగానే ఉంటుందికదూ? సతీత్వమూ, మాతృత్వమూ భగవంతుడు స్త్రీ జీవితానికి యిచ్చిన వరాలు. కాని యీ సమాజం వాటిని ఆమె పాలిట శాపాలుగా మార్చింది'' అన్నది పద్మగంధి.

''నీకు రాకూడని ఆలోచనలు వొస్తున్నాయి'' పొడి పొడి మాటలతో వెంకన్నదొర ఆమెను అవహేళనకు గురిచేసేడు. సతీత్వమూ, మాతృత్వమూ అనేవి ఆయన దృష్టిలోకూడ గొప్ప విషయాలే. కాని వాటి విషయం ఒక వేశ్య మాట్లాడటం చాల హాస్యాస్పదమనిపించింది ఆయనకు.

''ఆడదానికి రాకూడని ఆలోచనలాయివి?'' పద్మగంధి ముక్కు సూటిగానే వెంకన్నదొరను ప్రశ్నించింది.

''ఒక వేశ్యకు రాకూడని ఆలోచనలు''

''నేను వేశ్యను అనే విషయం మీకుతెలుసు. కాని నేను ఒక తల్లిని అనే విషయం మీకు తెలియదు'' అన్నది.

పిడుగుపాటువంటి యీ వార్తవిని వెంకన్న దొర లోలోపల ఆశ్చర్యపడిపోయేడు. కాని ఆ విషయం రవ్వంత కూడ బయటకు పొక్కనీయలేదు. నిబ్బరంగా అడిగేడు.

''మరి యీ విషయం యిన్నాళ్ళుగా ఎందుకు దాచేవు ?''

''దొరా! అడగవలసిన ప్రశ్నే అడిగేవు దొరా! నేను తల్లిని కాని ఆ విషయం లోకానికి తెలియకుండా దాచాను. కన్న కూతురుని కళ్ళెదుట పెట్టుకుని నోరు మెదపలేకపోయాను ..'' అంటూ ఆమె చెప్పటం అర్ధాంతరంగా ఆపివేసి సన్నని స్వరంతో రోదించడం ప్రారంభించింది.

ఆమె తల్లి అనే విషయం తెలియటమేకాక ఆమె కూతురు కళ్ళెదుటే ఉన్నదనే విషయం వింటూంటే వెంకన్నదొరకు మూర్ఛవచ్చినంత పని అయింది. యీ ఆడవాళ్ళు ఎంతకయినా తగుదురు. ఇన్నాళ్ళుగా ఇంతమంది గ్రామస్తుల్ని, తననూ కన్నుగప్పి యీ గ్రామంలోనే కన్న కూతుర్ని పెట్టుకుని కులుకుతున్న యీ నెరజాణ యిప్పుడు చాల దీనురాలవలె, ఏమీ ఎరుగని అమాయకురాలివలె, విలపిస్తోంది.

కావాలనుకుంటే ఆడవాళ్ళు ఏమయినా చేయగలరనిపించింది. ఆలోచివలతో కాలక్షేపం చేస్తే విషయం పూర్తిగా బయటకు రాకపోవచ్చునన్న అనుమానం కలిగింది.

''ఎంత కసాయిదానివి పద్మగంధీ! అలా ఉండటం ఎలా సాధ్యపడింది. అయినా మేమంతా ఎందుకు ? నీకు ఏదైనా కష్టంవొస్తే ఆర్చేవాళ్ళూ తీర్చేవాళ్ళూ యీ వూళ్ళో ఎవరూ లేరనే అనుకున్నావా ? పోనీ మిగతావాళ్ళ విషయం వదిలిపెట్టు. నేనేమయ్యాననుకున్నావు ?'' అంటూ ధైర్యం చెబుతున్నట్టూ, మెత్తగా మందలిస్తున్నట్టూ మాట్లాడి రాజకీయ చతురతతో తన విశ్వరూపం ప్రదర్శించేడు దొర.

పద్మగంధికి ఆ మాటలలో ఆశాకిరణం దొరికింది. ఆమె దానిని పట్టుకుని తన కార్యం నెలవేర్చుకోవాలనుకుంది. ఏటినీటిలో కొట్టుకుపోయే అర్తుడు ఏ చిన్న ఆధారం దొరికినా ప్రాణాలు దక్కించుకోవాలని పోరాడుతాడు. కాని ఇప్పుడామెకు పెద్ద రక్షణ దొరికినట్లే ఊహించుకుంది.

''దొరా! నా బిడ్డకు ప్రాణభిక్ష పెట్టు'' అన్నది జీరపోయిన గొంతుకతో.

''నీబిడ్డకిప్పుడు ఏమికష్టం వొచ్చిపడింది?''

పద్మగంధికి ఎలా చెప్పాలో తోచలేదు. తన బిడ్డయిప్పుడు ఏ కష్టమూ లేకుండా హాయిగానే వుంది. లేనిదాన్ని, రానికష్టాన్ని ఊహించుకుని తను తొందరపడుతున్నట్లు ఒక క్షణం ఆమెకూ అనిపించింది. అయినా ఉద్వేగం ఆగలేదు.

'అతి స్నేహః పాపశంకీ' అనేది యిదే!

''రాకముందే అర్ధిస్తున్నాను. నీ రాజకీయ చతురతతో నా బిడ్డను ఒక పావును చెయ్యకు'' అంటూ చేతులు జోడించింది పద్మగంధి.

వెంకన్నదొరకు విషయం కొంత అర్ధమయింది.

''ఎవరు నీ బిడ్డ ?'' అంటూ ప్రశ్నించేడు నేత్రాలు విశాలంచేసి.

ఆయన ముఖాన్ని నిశితంగా పరిశీలిస్తూ ''అవును దొరా! నీ ఊహ నిజమే! ఆమే!'' అన్నది పద్మగంధి.

''అయితే ఏకవీరాలయంలో దొరికిన పసికందుకు తల్లివి నీవన్నమాట ?'' అన్నారు చివరిసారి అనుమానం తీర్చుకుంటూ.

''అవును'' అంటూ తలొంచింది పద్మగంధి. ఆమె చూపులు నేలకు అంటుకుపోయాయి.

వెంకన్న కనులముందు వేయి విద్యుల్లతలు వెలిగినట్లు అయింది. ఇక కృష్ణస్వామి పలుకుబడికీ, పవిత్రతకూ తిలోదకాలు సమర్పించినట్లే! ఎంత సునాయాసంగా దారి దొరికింది అంటూ అతరంగంలో పొంగిపోయేడు దొర.



"తండ్రి ఎవరో గుర్తుందా ?" అంటూ శూలందించేడు. ఆ మాటలోని క్రౌర్యం ఆమెను బాధించలేదు. అతడు తన క్రౌర్యాన్నంతా కూడ దీసుకుని కసుక్కున ఒక్క మాటతో పొడిచేడు. కాని ఆ బాధను మాతృత్వం మ్రింగివేసింది. ఆమెకు వెంకన్నదొర మాటలతో పొడిచిన పోటు వల్ల ఆమెకు దర్భపుల్ల పొడుచుకున్నంత బాధ కూడ కలుగలేదు.

"జైనస్వామి" అన్నది తెగింపువల్ల పాలి పోయిన ముఖంతో.

వెంకన్నదొరకు విషయం కాస్త ఆలోచించ వలసినది అనిపించిందిప్పుడు. ఇందాకటి ఆయన పథకానికి ఇది కొంత అవరోధమే అయినా ఇదొక పెద్ద అవకాశానికి దారి అనే విషయంలో ఆయనకు సందేహం కలుగలేదు.

"సరే ! నీవు వెళ్ళు నీ బిడ్డకొచ్చినబాధ ఏమీలేదు" అంటూ సింహాసనంలోంచి లేచేడు దొర.

దొర యిచ్చిన శుష్క వాగ్దానం ఆధారంగా తన బాధను కొంత ఉపశమించేసుకుని గృహాభి ముఖంగా సాగిపోయింది ఆ పిచ్చితల్లి.

వెంకన్నదొర లేచినవాడు లేచినట్టే తోట లోకి ప్రయాణమయ్యాడు. శిల్పులు యిప్పుడు పార్శ్వనాథుని విగ్రహాన్ని చెక్కటంలో నిమగ్న మయి వున్నారు. ఇంకా సమయం లేదు. చేయ వలసిన పనికి ఉన్న సమయం చాలదేమోనన్న అనుమానం కలుగుతుంది ఆయనకు.

శిల్పులను పిలిపించటానికి కూడా సమయం చాలదు.

నడుస్తూ ఆలోచిస్తున్నాడు దొర. యీ విషయం తనకు ఎలా ఉపకరిస్తుందన్న పథకం తయారుచేయటంలో ఆయనబుర్ర పనిచేస్తోంది. కృష్ణస్వామి మీద ప్రజలలో ఆగ్రహం కలిగేలా చెయ్యవచ్చు. ఇది గొప్ప అవకాశం.

హరిజనవాడలోంచి నడుస్తున్నాడు వెంకన్న దొర. మహాలక్ష్మమ్మ చెట్టు అరుగుల మీద హరిజనులంతా చేరివున్నారు. వారిలో వెంకన్న దొర, కృష్ణస్వామిని గూర్చిన చర్చ జరుగు తూంది.

నారాయణ ఏదో మాట్లాడుతున్నాడు. చుట్టూ చేరిన హరిజనులు మధ్య మధ్య ఏవో ప్రశ్నలు వేస్తూ వింటున్నారు

తన కార్యక్రమం యిక్కడ నుండే ప్రారం భించాలని అనిపించింది వెంకన్నదొర. నారాయణ ఆయనను చూడగానే ఎదురొచ్చాడు.

"దయచేయండి దొరా !"

"వొస్తున్నాగా ! పదండి మీకొక విషయం చెప్పాలి."

"ఏమిటిదొరా అది" అని అనుమానిస్తూనే అడిగేడు నారాయణ.

దొర మళ్ళీ ఏదో పథకం వేసేడని అతడికి అర్థమయ్యింది.

## తిరుచరణాలు

దొర వేదిక మీదికి ఎక్కేడు. అరుగుచుట్టూ హరిజనులు నిలిచేరు.

"నేను మీకు ఒక ముఖ్య విషయం చెప్తున్నాను. ఇది నేను స్వార్థంతో ఆడే అబద్ధం కాదు. పార్శ్వనాథుని మీద ఆనవేసి చెప్తున్నాను. మీరు దైవంగా భావించి పూజించే కృష్ణస్వామి ఆశ్రమంలో ఉన్న ఏకవీర పద్మగంధి కూతురు. బహుశా కృష్ణస్వామికీ, ఆమెకూ కలిగిన అక్రమ సంతానం అయివుండాలి. 'ఏకవీర ఆలయంలో దొరకటం; కృష్ణస్వామి పెంచటం యిదంతా మొగిలిచర్లను మోసగించేటందుకు కృష్ణస్వామి ఆడుతున్న నాటకం. యిప్పటికయినా కళ్ళు తెరచి లోకం చూడండి" అంటూ కాలకూట విషంకన్నా భయంకరమయిన అసత్యాన్ని క్రక్కి పాము కన్నా వేగంగా వారి మధ్యనించి తప్పుకు పోసాగేడు.

### మనిషి

చిరిగిన పేలికల్లోంచి
నగ్నంగా కనిపిస్తున్న
ఆమె సౌందర్యం చూసి
నీ శరీరం కామంతో
కాలిపోవటం కాదు
నువ్వు మనిషివన్న
దానికి గుర్తు
దీనంగా చూస్తున్న
ఆ కళ్ళ లోతుల్లోకి
చూడగలిగి, కరుణతో
నీ హృదయం ద్రవించిననాడు
నువ్వు మనిషివని
ధైర్యంగా చెప్పుకో —

- గడ్డమణుగు గోపాలక్రిష్ణమూర్తి

హరిజనులంతా ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు నారాయణ మనసు రోషంతో భగభగ మండిపోతోంది. కాని ఏమి చేయగలడు. కాదు అని చెప్పేందుకు తన దగ్గర సాక్ష్యం ఏమివున్నది. ఏకవీర పద్మగంధి కూతురు అయివుండవచ్చు. తండ్రి కృష్ణస్వామి అన్నది వెంకన్నదొర కల్పించిన కథ.

'నిజం చెప్పలు తొడిగేసరికి అబద్ధం ఊరంతా తిరిగొచ్చింది' అన్న సామెతగా యీ విషయం క్షణాలమీద ఊరంతా ప్రాకింది.

### 16

కర్ణాకర్ణిగా కృష్ణస్వామికీ విషయం తెలియ వచ్చింది. ఆయనకు రవంతైనా ఆశ్చర్యం కలుగక పోగా ఇంతకుముందే లోకులమీద ఆయనకున్న అభిప్రాయం మరింత బలపడింది. పండితుల ద్వారా ఏకవీరకు కలుగుతున్న తన్మయ భావుకత, తాదాత్మ్యమూకూడ తెలిసింది.

ఏకవీరలో వొచ్చిన మార్పును ఆయన గమనించేరు. కాని అది యింత తీవ్రమైన రూపానికి వచ్చిన విషయం తెలియదు అయితే ఆయన అనుభవంలో యీ రెండు విషయాల మధ్య పొంతన కుదుర్చుకోవటం కష్టసాధ్య మయింది. ఆశ్చర్యకరం కూడ అయింది.

ఒక సామాన్యురాలయిన సమయాను కూలకూ; హైందవ విరోధి అయిన జైనస్వామికీ పుట్టిన బిడ్డకు వేంకటేశ్వరునిమీద మనసు నిలిచింది. ఇది అపూర్వమయిన విషయమే.

వెంకన్నదొర ప్రమేయంతో విషయం క్రొత్త మలుపు తిరిగింది. ఏకవీర తండ్రి జైనస్వామి అన్న విషయాన్ని తనమీదుగా మళ్ళించి, అభాండం ఒకటి సృష్టించి ప్రచారం సాగించేడు అతడు.

కృష్ణస్వామి భారంగా ఒక నిట్టూర్పు విడిచేరు. ఇదంతా చివరకు ఎలా పరిణమిస్తుం దన్న విషయంలో యిసుమంత అయినా ఆయనకు అనుమానం లేదు. హిందూ ధర్మం జయించి తీరుతుంది. లోగడ దానిమీద యింతకన్న బలమయిన దండయాత్రలే జరిగేయి. ఆ దాడుల్ని అది తట్టుకుని నిలువకలిగింది. ఇప్పుడుకూడ నిలుస్తుంది. కాని అలా జరిగే ముందు ఏకవీర జీవితం ఏమి అవుతుందన్న బాధ యిప్పుడు ఆయన హృదయాన్ని గాయపరచ సాగింది. లేచి ఆయన తోటలోనికి వెళ్ళేరు.

ఏకవీర పూలన్నీ తెచ్చి పెద్ద మాల కడుతోంది

"అమ్మా ! ఏకవీరా ! ఎందుకు తల్లీ యింత పెద్ద మాల కడుతున్నావు" అంటూ ప్రశ్నించేరాయన.

పరధ్యానంగా ఉన్న ఏకవీర త్రుళ్ళిపడింది

"స్వామికి.." అన్నది మామిడికొమ్మ మీదినుండి కాలు నేలమీదికి ఆనించి లేచి నిలుస్తూ.

"ఏ స్వామికి తల్లీ !"

"నా స్వామికి. ఏడుకొండల స్వామికి..."

"యింత పెద్ద దండ ఏమి చేస్తావమ్మా ?"

"స్వామికి సమర్పిస్తాను. ఆయన మెడలో అలంకరిస్తాను."

"స్వామి ఎక్కడున్నారు ?" అని ప్రశ్నిస్తు న్నప్పుడు కృష్ణస్వామి నేత్రాలు ఆర్ద్రమయాయి. కంఠం రుద్ధమయింది.

"ఎక్కడో ఎందుకుంటారు. యిక్కడే ఉన్నారు. ఏకాంత సేవకు వేళ అయింది కదూ!" అన్నది ఏకవీర.

"స్వామికి ఏకాంత సేవ నీవు చేస్తున్నావా తల్లీ !"

"ఆయన వొచ్చి కూర్చున్నారు. అన్నీ

పూజలూ నేనే చూచుకోవాలి! యిప్పటికే కాలాతీతమయింది" అన్నది తాతగారి ఉనికి భరించలేనని సూచిస్తూ.

కృష్ణస్వామికి బాధ అనిపించలేదు. గర్వమనిపించింది ఆనందాతిశయంవల్ల రోమాంచమయింది.

కళ్ళు తెరవని పసికందుగా ఉన్నప్పుడు ఆయన చేతులలోకి వచ్చింది ఏకవీర. అప్పటి నుండీ ఆయన అల్లారుముద్దుగా పెంచేరు. వైరాగ్యాన్ని ప్రక్కనపెట్టి రవంత లౌకికంలోకి అడుగుపెట్టేరు. మమతానురాగాలు పాదుర్భవించి బలంగానే పాదుకొన్నాయి. యిప్పుడు ఈమె జన్మ రహస్యం తెలియగానే ఆమెను తననుండి విధి బలంగా లాగి దూరంగా వేస్తున్నట్టు అనిపించుతోంది. సృష్టిలో అన్నిటికన్న బలీయమైనది విధి.

దానికి తలవొంచక తప్పదని తెలుసు. కాని తనంత తానుగా త్రెంచుకోవటం మాటలుకాదు.

"అమ్మా! గంధికి కబురుపంపేను ఇప్పుడో యింకాస్సేపటికో ఆమె రావచ్చు నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి"

"పద్మగంధి అంటే ఎవరు?"

"నీకు జన్మ యిచ్చిన తల్లి."

ఏకవీర విరక్తిగా నవ్వింది, ఆమె మనసు చలించలేదు.

"తాతగారూ! నాకు తల్లీ తండ్రీ ఆ దైవమే!"

"తల్లీ నీవు ధన్యురాలవి. అన్నిటినీ అవలీలగా జయించగలిగేవు. కాని మా జన్మలు వేరు. ప్రయత్న సాధ్యంగా కూడ యీ స్థితిని మేము అందుకొనలేము తల్లీ" అన్నారాయన. ఆయన కంటి కొలుకులనుండి రెండు కన్నీటి బిందువులు రాలి నేలలో యింకిపోయాయి.

అంతలో పద్మగంధి అక్కడకు వచ్చి ఆయనకు నమస్కరించి దూరంగా చేతులు కట్టుకుని నిలుచుంది. ఆమె చూపులు అన్నీ ఏకవీరమీదనే ఉన్నాయి. ఏకవీర చూపులు అన్నీ స్వామిమీదనే ఉన్నాయి.

కృష్ణస్వామి చూపులు అంతర్ముఖంగా ఉన్నాయి.

"స్వామీ పిలిచేరట..." పద్మగంధి వినయంగానే అడిగింది.

"అవును" అన్నారు కృష్ణస్వామి. ఆయన గొంతు చాల దృఢంగా ఉన్నది.

పద్మగంధికి మాటలు పెగలలేదు. కృష్ణస్వామికి యీ విషయం తెల్సివచ్చిందన్న విషయం ఆమె గ్రహించింది. కాని యిప్పుడు పిలిపించిన కారణం ఏమిటో ఆమె ఊహకు అందలేదు

"ఏకవీరకు నీవు తల్లివి. ఆ విషయం త్రికరణశుద్ధిగా అంగీకరిస్తున్నావు కదూ!" ప్రశ్నించేరు కృష్ణస్వామి.

పద్మగంధి కన్నార్పుతూ ఆయనకేసి దీనంగా చూచింది

"యింత కాలంగా నీవు యీ విషయాన్ని స్వార్థంతో దాచి గొప్ప తప్పిదమే చేశావు. కాని ఆ తప్పిదానికి శిక్ష అనుభవించింది ఏకవీర'

"యిప్పుడామె కేమి లోటు వచ్చింది? ప్రశాంతమయిన యీ ఆశ్రమంలో, పవిత్రమైన మీ చేతులలో పెరిగింది. ఆమెకు యిది వరమనే నేను భావిస్తున్నాను" అన్నది కన్నీటిని తుడుచుకుంటూ

"అమ్మా! రేపటినుండి నేను యజ్ఞ దీక్షలో కూర్చొనవలసిఉంది. ఈలోపుగానే నేను యీ బంధంనుండి విముక్తుడిని కాదలచాను. యీమె తండ్రి ఎవరైనా నివు కనన బిడ్డ. దైవవశంగా నాకు దొరికింది. పెంచాను. ప్రేమను పెంచుకున్నాను. కాని యిప్పుడామె తల్లివి నీవు అని తెలిశాక నేను ఆమెకు సంరక్షకుడుగా ఉండటం ధర్మ సమ్మతంకాదు. నీ బిడ్డను నీవు స్వీకరించు" అన్నారు కృష్ణస్వామి. ఆయనకు కన్నీటి పొరలమధ్యలో కంరిదప్పొంగా దుఃఖంలో మునిగిఉన్న పద్మగంధి ముఖం కనుపించలేదు

ఈ మాట అనగానే రోదిస్తూ పద్మగంధి ఆయన పాదాలమీద వాలింది

"స్వామీ! నేను కన్నానేకాని తల్లిని ఎలా అవుతాను? పాలిచ్చి పెంచేనా? దాని ఆలనా పాలనా చూచేనా! కసాయిదానివలె కడుపుతీపి త్రెంచుకుని విసిరివేసేను. యివ్వాళ స్వార్థంతో ఆమె నాది అనికోవటం ఎలా చెల్లుతుంది ఆమె... ఆమె." అంటూ ఏమో చెప్పాలని ప్రయత్నిస్తోందికాని గొంతుక పూడిపోయింది

"అమ్మా! నీతో నేను ఎక్కువగా చర్చకు పూనుకోను ఆమె నీ బిడ్డ కావాలనుకున్న తక్షణం నీకు అప్పగించటం నా ధర్మం. నేను నా ధర్మాన్ని నెరవేర్చాను. నీ విషయం నీవు ఆలోచించుకో" అని ఆమెకు చెప్పి ఆశ్రమానికి అభిముఖంగా నడువసాగేరు కృష్ణస్వామి.

ఆయన అటువెళ్ళగానే లేచి కన్నీరు తుడుచుకుని కన్నబిడ్డను కళ్ళనిండా చూచుకుంది పద్మగంధి.

"అమ్మా ఏకవీరా!"

"ఊఁ..."

"నాకేసి ఒకసారి చూడవూ."

"యీ కనులు స్వామి దర్శనానికి కైంకర్యం చేసేనమ్మా! యీ లోకంలో నేను చూడవలసింది యింక ఏమీలేదు."

"నా తల్లీ! దీనురాలయిన నీ తల్లిమాట ఒక్కసారి వినమ్మా."

"కొండరాళ్ళమీద పడుతున్న జలపాతంలా— అది చేసే చప్పుడులా నవ్వుతారు నా స్వామి. ఆ చప్పుడుకోసమే నేను జీవితమంతా వేచిఉంటాను ఆయన పిలుపుతప్ప నాకు ఏమీ వినిపించదమ్మా."

"అమ్మా! ఏదీ —ఒకసారి పిలువు మళ్ళీ,"

"అమ్మా! అమ్మా! అమ్మా! దయచేసి నీవు వెళ్ళిపో! నా స్వామి ఏకాంత సేవకు భంగం కలుగనీయకు."

[ఇంకా వుంది]



## భారతి – వనపర్తి

పితారక్షతి కౌమిర్యే ... నస్త్రీ స్వాతంత్ర మర్హతి అని మనుస్మృతి శ్లోకం. అంటే జీవితంలో మనకు ఏ దశలోనూ స్వాతంత్ర్యం లేదా ?

★ ఉండక్కరలేదని మునువుగారి నమ్మకం. ఆధునిక మనువులు కూడా ఏమాత్రం అవకాశం యిచ్చినా–ఆడదాన్ని మనుస్మృతి కాలం నాటికి నెట్టివేస్తారు ! ఆడదాన్ని మనిషిగా గుర్తించని మనువుని తోసిరాజని – సమాజంలో పురుషులతో సమాన ప్రతిపత్తితో స్త్రీ బతకడానికి ప్రయత్నించాలి. తెగించాలి. పోరాడాలి... లేకపోతే –వీరి ఆదర్శాలన్నీ కాగితాల మీదే వుంటాయి. ప్రవర్తన మాత్రం ప్రాచీన మను ధర్మశాస్త్రం ఆధారంగా వుంటుంది.

## జె. ఎస్. కె. – ప్రొద్దుటూరు

ఎన్నో అవినీతి, అక్రమాలు మా కండ్ల ముందర జరుగుతున్నాయి. అవినీతి నిరోధక సంఘంవారు ఎక్కడ వుంటారు ? చెప్పండి.

★ భగవంతునిలా నిజానికి వారు సర్వాంతర్యాములుగా వుండాలి. కాని లేరులా వుంది. ''ఇదే కమ్యూనిస్టు దేశాలలో అయితే– ఒకరిపై ఇంకొకరి నిఘా'' అని చెప్తారు ! నిజంగా మీకంత రిపోర్టివ్వదగ్గ అవినీతికన్పిస్తే– ఎడ్రసే దొరకదా ?! మనవాళ్లకి ఆకాశరామన్న ఉత్తరం పడేసినా చాలు.

## రమేష్ – ఉరవకొండ

నన్ను ప్రేమించిన అమ్మాయి తనను తొందరగా పెళ్లి చేసుకోమని పదేపదే హెచ్చరిస్తూంది. విషయం ఎంత అడిగినా చెప్పకున్నది.

★ రెండే కారణాలుంటాయి : తనవాళ్లు సంబంధం నిశ్చయిస్తూనేనా వుండాలి. నెల తప్పేనా వుండాలి. ఇవి సినిమాలలో తరచూ చూస్తూంటాం కదా ? లేదా అమ్మాయి కాస్త గట్టిదైతే– మీ ప్రేమను పరీక్షకి పెట్టూనేనా వుండాలి.




## ప్రసాద్ – మచిలీపట్నం

పూలన్‌దేవిపై మీ అభిప్రాయం – పరిస్థితులకు బానిసకాదా ? మరి యీ లోకంలో పరిస్థితులకు బానిసలు కాని వాళ్లెవరు? అయితే దేశభక్తుడు దేశద్రోహి అని విభజింపవలసిన అవసరం ఏమిటి ?

★ భక్తిమార్గాన పోవడం లేటు అనుకునే శత్రుమార్గం అవలంభిస్తారు – ఇద్దరిదీ గమ్యం ఒకటే, ధ్యేయమూ ఒకటే–దేశసేవ చేయడం!!

## ఎస్. కె. ఎమ్. – మద్రాసు

కె. రా. గారూ అవసరాలు కోరికలు కంట్రోల్‌లో వుంచినంత మాత్రాన సుఖంగా జీవించకలం అంటారా ? కోరికలు మనిషిని సుఖపెట్టకఅవని నా నమ్మకం ?

★ అవసరాలు కోరికలు – కంట్రోల్ చేయడం కాదు చేయవలసిన పని – వాటిని తగ్గించుకోడం, ఇక సుఖం అంటారా ? తీర్చుకో కలిగిన కోరికలు కూడా మనిషికి తృప్తినియ్యవు. అది మానవ సహజం.

## బి. వి. ఆర్. ఎమ్. హైదరాబాదు

ఆరుద్రగారికి గోంగూర పచ్చడి చేయడం మీరే నేర్పారా ? లేకపోతే దేవాంతకుడులో అంత బాగా ఎలా వ్రాయకల్గారు ?

★ ఆయన సిసలైన ఆంధ్రులు. అందుకే గోంగూరపచ్చడి ఎలా వుండాలన్నది బాగాతెలుసు. నాకేంతెలుసండీ వంట? మరీ 'సాంబారు సాదం' మనిషిని.

## కలిమిశ్రీ – కొత్తరెడ్డిపాలెం

మంచి కోరేవారినీ సమాజం బ్రతకనివ్వదేం ?

★ ఎవరి మంచి కోరుతున్నారు–పేరులోనే అంత స్వార్థం పెట్టుకుని ! మన గుణాలని సమాజానికి ఆపాదించడం – ఆడలేక మద్దెల ఓడనడం.

## ఎ. ఎస్. – దొడ్డిపట్ల

మనిషి పుట్టింది భోజనానికైనప్పుడు భగవంతుడీలోకంలో పేద ధనిక బేధాలు ఎందుకు పెట్టాడు కె. రా. గారు.

★ దాన్నిపట్టే అర్థం కావడంలేదా - మనిషి తిండి తినడానికే పుట్టలేదని !

## ఎమ్. కె. ఆర్. – విశాఖపట్నం

రచయిత్రి పదానికి నానార్థాలలో 'గున్న ఏనుగు' అని జోడించాలని తెలుగు ఎకాడమీకి సలహాయివ్వాలని వుంది. లైన్ క్లియర్‌చేస్తారా?

★ సంతోషంగా ! కాని ఒక్కటేబెంగ – తె. ఎ వారు అయ్యవార్ని చేయిబోయి కోతిని చేస్తూంటారని విన్నాను. పైగా వారి తెలుగు అందరికీ అర్థం అవుతుందా. ఆలోచించండి మీ టాలెంటిలా వేస్టు అయిపోవడం నా కిష్టం లేదు.

## జి. హెచ్. – రామదుర్గం

ఆరుద్రగారు ఇంటిలో ప్రళయరుద్రులౌతారా ? చెప్పరూ ?

★ అబ్బె, వారెప్పుడూ– మెత్తనిపులి.

## కె.జి.ఆర్. – పిస్సా కోడేరు

అగాధమైనది స్త్రీహృదయం. అది అందుకోవడం ఘనవిజయం.

★ చిత్తం, ఎవరూ తేలివచ్చినట్టు లేదు– అగాధమైన స్త్రీ హృదయాన్వేషనలో పడి.

## ఎం. ఎన్. ఆర్. – బైపల్లి

పోయినాళ్లందరూ మంచోళ్లు ఎలా అవుతారు ?

★ ఎవర్నీ బాధపెట్టకుండా. ★









[ఓ లైట్‌బాయ్ స్వగతం]

ఇప్పుడు ఏ స్వర్గాన ఉన్నారోగాని ''మీరంతా మాకన్నా ఉచ్ఛస్థితిలో ఉండేవారు'' అని మా గురించి జోక్‌గా అంటుండేవారు రేలంగి గారు.

నిజానికి ఫ్లోర్‌లో హీరో—హీరోయిన్‌లు, డైరెక్టరు, నిర్మాత, ఇతర టెక్నీషియన్‌లు — అందరికన్నా ఎత్తున పనిచేసే వాళ్ళం మేమే! వాళ్ళంతా మా క్రింద పనిచేసేవాళ్ళే! ఇది జోక్ అయినా—వృత్తిరీత్యా వాస్తవమే కదా ?...కాని, సంపాదనలో... ? మేమే అధమాధములం.

ఒక హిందీ సినిమా ఫీల్డు ఛాయాగ్రహకుడు మమ్మల్ని ''ఏయ్,ఉప్పర్‌వాలా?'' అంటూ తమాషాగా సంబోధించేవాడు. ఉత్తరాదివారు ఆ భంగవంతుడ్ని 'ఉప్పర్‌వాలా' [పైన ఉండేవాడా] అని స్మరించడం కద్దు.

మాలో చాలామందికి రిటైర్ అయ్యే వయసొచ్చినా—మమ్మల్నందరూ 'లైట్ బాయ్స్' అనే అంటుంటారు.

ఎవరెలా పిలిచినా — షూటింగ్ సెట్‌లో దాదాపు 150 అడుగుల ఎత్తున — అడ్డుగా కట్టిన నిచ్చెనల మీదో, కొయ్య పలకల మీదో అడుగులో అడుగువేసుకుని జాగ్రత్తగా నడుస్తూ, కెమెరామన్ చెప్పినట్లు లైట్లు అమర్చడం మా డ్యూటీ. అక్కడ పైన ఎంత వేడిని భరిస్తుంటామో చెప్పనలవికాదు. నెత్తి మీద పైకప్పుకు జింక్ రేకులు... ఒక వంక సెట్‌లో ఉండేవారందరూ వదిలే బొగ్గుపులుసు వాయువు వేడిగా మా ముక్కులకు తగులుతూంటుంది; మరోవంక హై ఓల్టేజ్ లైట్లవేడి... ఇక వేసవికాలమైతే చెప్పాలా? ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అయిపోతూంటాం. ఒక్కోసారి తలతిరిగి, అంత పైనుంచి ఎక్కడ కింద పడిపోతామో — అనిపిస్తుంటుందికూడా. కర్మకొద్దీ ఒకరిద్దరు పట్టు తప్పి అలా కిందపడి గుటుక్కుమన్నారు కూడా.

ఎప్పుడో ఒకటి రెండుసార్లు ఏ సింగిల్ టీ కోసమో, ఏ గ్లాసుడు నీళ్ళకోసమో కిందికి దిగి వచ్చి, మళ్ళీ తాళ్ళు పట్టుకొని మా ''ఉన్నతమైన స్థానానికి'' ఎగబాకిపోతూంటాం.

మా కింద కొన్ని లక్షల పెట్టుబడితో సినిమా తయారావుతుందని మాకు తెలుసు. లక్షలకు లక్షలు పారితోషికం పుచ్చుకునేవారంతా మా కింద పనిచేస్తుంటారని కూడా మాకు తెలుసు...కాని, మేమే గనక ఆ 'త్రిశంకు స్వర్గం'లో ఆ లైట్ల వెనుక లేకపోతే... ? వాళ్ళంతా ప్రకాశించేవారా ? అంతగా ఆర్జించేవారా ? ఇలా అప్పుడప్పుడు మాలో మేము జోక్‌గా అనుకుంటూంటాం.

ఇంతకి, మా జీతం ఏ మాత్రం ఉంటుందంటారు ? ఎంత పెరిగినా గొర్రెకు బెత్తెడే తోక అన్నట్లు — మూడు వందల లోపే. మాలో ఒకతనికి భార్యా, ఆరుగురు పిల్లలు,రోగిష్టి తల్లి ఉన్నారు. అతని జీతమెంతో తెలుసాండీ ? అలవెన్సుతో సహా రూ. 299-90 పైసలు.

ఇక అప్పుడప్పుడు అప్పులుచేయక తప్పదుగా? ఎప్పుడైనా బోనస్ అంటూ వస్తే గిస్తే ఆ అప్పులు తీర్చడం ... మళ్ళీ కొత్త అప్పులు చేయడం...భూమి గుండ్రంగా ఉందని అనుకోవడం...సరే — షూటింగ్ సమయంలో బేటాలంటూ ఏదో ఇస్తారనుకోండి. అవ్వ వడికిన నూలు తాత మొలతాడుకు సరి—అన్నట్లు, ఆ డబ్బు లక్కడికక్కడే బీడీ గ్రటాకు సరిపోతుంది.

మా కింద పని చేసే వారిలో కొందరి జీవితం పూల పాన్పు వంటిదనీ, మరి కొందరి జీవితం ముళ్ళబాట వంటిదనీ మేమెరుగుదుము.

ఈ విచిత్ర పరిశ్రమలో ఎవరు ఎప్పుడు ఎలా అమాంతంగా పైకొస్తారో, పైకొచ్చిన వారిలో కొందరు అంత హఠాత్తుగానే ఎలా కింద పడి రూపూ మాపూ లేకుండాపోతారో ఎవ్వరికీ తెలీదు.

ఒకప్పుడు మా లైట్ల వెలుగులో జిగేల్‌మని మెరిసినవారు ఇప్పుడు వృద్ధ పాత్రలు ధరిస్తున్నారు. ఒకప్పుడు బాల తారలు నేడు హీరో హీరోయిన్‌లుగా వెలుగొందుతున్నారు.

ఇవన్నీ మేం మా ఉన్నతమైన స్థానంలో లైట్ల వెనుకనుంచి అంతా గమనిస్తూనే ఉన్నాం — ఎదుగూ బొదుగూలేని మా జీతాలతో, జీవితాలతో...

అదేవిధంగా ఒక కొత్త హీరో గాని, హీరోయిన్‌గాని వృద్ధిలోకి వస్తారో — రారో, తొలి షూటింగ్‌లోనే వాళ్ళ నటన, నడక, నడత, నవ్వు, మాటతీరునిబట్టి ఇట్టే చెప్పేయగలం. అలాగే జరిగే షూటింగ్సునుబట్టి చిత్రం బాగా ఆడుతుందో — లేదో చెప్పగలిగే వాళ్ళుకూడా మాలో కొందరున్నారు.

ఒకప్పుడు చిత్ర నిర్మాణం ఒక క్రమ పద్ధతిలో సాగిపోతూండేది. మార్కస్ బార్ట్లే దొరగారిలాంటి టాప్ కెమరామన్‌లు సైతం షూటింగ్ ముందురోజున సెట్లో 'లైటింగ్ రిహార్సల్స్'ను ప్రత్యేకంగా ఏర్పాటు చేసేవారు. సెట్‌లో క్రమశిక్షణ, టీమ్‌వర్క్ కనిపించేది. అందరూ ఆప్యాయతతో, అభిమానంతో మసలుకునేవారు.

ఇప్పుడో...! అంతా యాంత్రికంగా జరిగిపోతోంది. హడావిడిగా షూటింగ్‌లు జరిపేస్తున్నారు. సెట్‌కు ఎవరు ఎప్పుడొస్తారో, ఎప్పుడు వెళ్తారో ఎవ్వరికీ తెలీదు. ''లైట్స్ ఆన్! లైట్స్ ఆఫ్!'' అన్న కేకలు మాకు వినిపిస్తుంటాయి.ఆఆజ్ఞలను మేం పాటిస్తుంటాం.అంతే

ఒకేరకమైన కథలతో, ఒకేరకమైన సన్నివేశాలతో సినిమాలు యమస్పీడుగా తయారైపోతున్నాయి. సెట్స్‌లో దాదాపు అన్ని భాషల చిత్రాల షూటింగ్‌లూ మేం చూస్తుంటాం కదా ?

అందుకే ఇటీవల సినిమాలు చూడాలనే ఆసక్తి మాలో సన్నగిల్లిపోయింది. ఒకప్పుడు ముఖాలను లైటింగ్ ఎంత చక్కగా తీర్చిదిద్దేదో, కెమెరామెన్‌లు ఏ ఎఫెక్ట్‌కోసం ఓ లైటింగ్‌ను



ఎందుకు ఏర్పాటుచేశారో చూడాలనే తహతహ కొద్దీ ప్రత్యేకంగా సినిమాలు చూసేవాళ్లం. ఇప్పుడు మా పిల్లలుమాత్రం అప్పుడప్పుడు సినిమాలు చూసొచ్చి చెప్తూంటారు "స్టంట్లు" బాగున్నాయని. నిజమే. ఇటీవలి చిత్రాలలో స్టంట్లు, సెక్సు విధిగా ఉంటున్నాయి. ఒక్కోసారి అలాంటి సన్నివేశాలు సెట్స్‌లో మరీ మితి మీరి చిత్రీకరింపబడుతున్నప్పుడు పైన "త్రిశంకుస్వర్గం" నుంచి చూసే మాకే ఎబ్బెట్టుగా ఉంటూంటుంది. కాని, మా డ్యూటీ మాది.

ఎవరుచెప్పినా ఒక్కటే—అప్పటికీ ఇప్పటికీ టెక్నికల్‌గా ఎంతో అభివృద్ధిని సాధించామని. అంతే.




ఆ రోజుల్లో అతి బరువైన మిచ్చెల్ కెమెరాను ఎక్కువగా సెట్స్‌లోనే ఉపయోగించ వలసివచ్చేది. ఇప్పుడు ఎక్కడికైనా ఇట్టే తీసు కెళ్లగలిగే ఏరిఫ్లెక్స్ కెమెరాలు వచ్చాయి. స్పీడ్ ఫిలిమ్ వచ్చింది. భూతాకారంలాంటి భారీ లైట్లకు బదులు చేతిలో పట్టుకోగలిగే 'సన్‌గన్స్' వచ్చాయి. వీటితో పని చాలా తేలికైపోయింది.

చిత్ర నిర్మాణంకూడా అంత తేలికై పోయింది. ఎప్పుడంటే అప్పుడు, ఎక్కడబడితే అక్కడ — భవనాల్లోనో, గుడిసెల్లోనో గబగబా రీళ్ళు చుట్టెయ్యడానికి వీలయిపోయింది.

దాంతో — స్టుడియోలలో పనిచేసే మాలాంటివారికి పని తగ్గింది.

హడావిడిగా తయారయ్యే సినిమా డబ్బాలు అంత వేగంగానే తిరిగొచ్చేస్తున్నాయి.

చలనచిత్ర పరిశ్రమ భవిష్యత్తు మాట అటుంచండి, మా భవిష్యత్తేమిటో మాకే అయోమయంగా ఉంది.

మేమేలాపోతే ఎవరికి కావాలి ?

—జి.వి.జి. ★



బెంగాలీ, హిందీ భాషల్లో దాదాపు 20 చిత్రాలు నిర్మించిన అషిక్‌రాయ్ సుప్రసిద్ధ డిస్ట్రిబ్యూటర్‌కూడా. తమాషా ఏమిటంటే – ఈయన నిర్మించిన చిత్రమేదీ ఈయన పంపిణీ సంస్థ ద్వారా విడుదల చేయలేదు.

ఈయన కలకత్తానుంచి బొంబాయి వెళ్లినప్పుడల్లా భారీ హోటల్స్‌లో రోజుల తరబడి బసచేస్తుంటాడు. "మీరు బొంబాయిలో ఏదైనా ఫ్లాట్‌గాని, బంగళాగాని కొనవచ్చుకదా?" అంటే, ఈయన సమాధానం : "నా లాంటి వ్యాపారస్థులకు హోటళ్లలో బస చేయడమే లాభదాయకం. నేను ఒక ఫ్లాట్ కొన్నాననుకోండి, సుమారు ఎనిమిది లక్షల రూపాయలు అందుకు తగలడిపోతుంది. ఇక ఫర్నిచర్లు, మిగతా వసతులకు మరింత వృధా అయిపోతుంది. ఈ ఎనిమిది లక్షలకు నెలకు 3 శాతం వడ్డీ చొప్పున నెలకు రూ. 24 వేలు అవుతుంది. దానికి బదులు ఖరీదైన హోటల్లో ఉండి నెలకు 15 వేలు చెల్లించినా 9 వేల రూపాయలు ఆదా అవుతాయికదా ? అందేత, అదే ఎనిమిది లక్షలను నేను వ్యాపారంలో పెడితే ఎంతో లాభాన్ని సంపాదించవచ్చుగా ?"

దక్షిణాది చిత్ర నిర్మాతల గురించి ఈయన అభిప్రాయం : "వాళ్ళు ఆర్టిస్టుల రేట్లు పెంచి, మార్కెట్‌ను కొంత పాడుచేశారనే చెప్పాలి. ఐతే, ఆర్టిస్టులు ఏ మాత్రం విసుక్కోకుండా ఉదయం 9 నుంచి రాత్రి 9 గంటలవరకు వొళ్ళువంచి పని చేస్తారు. మెచ్చుకోదగ్గ అంశం మరొకటుంది. ఈ నిర్మాతలు వ్యాపార విషయంలో చాలా నిక్కచ్చిగా ఉంటారు. పూర్తి డబ్బు చేతిలో లేనిదే ఏ ... మొదలెట్టరు. బొంబాయి నిర్మాతలైతే, రెండు లక్షలుంటే చాలు. చిత్రాన్ని



ప్రారంభింపచేసి, ఆ తర్వాత ఫైనాన్షియర్స్‌కోసం వెతుక్కుంటూంటారు.''

కొత్త నిర్మాతలగురించి : ''వారం వారం ఎంతో నల్లధనం ఈ సినిమారంగంలో ప్రవేశిస్తోంది. దీన్ని సరఫరాచేసే, చిత్ర నిర్మాణమంటే ఏమిటో తెలియని కొత్త నిర్మాతలు పుట్టి చవటలు.''

అషిష్‌రాయ్ ''స్పెహెదార్'' అనే చిత్రాన్ని తయారుచేశాడు. దీనికి రీ రికార్డింగ్ లండన్‌లో జరిగింది. ఈ చిత్రం ఇంగ్లీషులో డబ్ చేయబడిందికూడా. ఇందులో ఎన్నో కరాటే ఫైట్స్ ఉన్నాయట.

ఈయన బెంగాలీ చిత్రం ''లాల్‌కోఠి'' కలకత్తాలో 75 వారాలకుపైగా ప్రదర్శింపబడింది.

ఈయన త్వరలో బెంగాలీ హీరో బిశ్వజిత్ కొడుకు ప్రసన్నజిత్ హీరోగా బెంగాలీ, హిందీ భాషల్లో ఒక చిత్రాన్ని నిర్మించబోతున్నాడు.






''ఆ హీరోయిన్ తెరమీద కనపడితే వాలు పిచ్చెక్కిపోతాడు!''

## కురుక్షేత్రంలో సీత

''పాచ్ వర్క్‌ను జూలైలో పూర్తి చేస్తున్నాం,'' అన్నారు అట్లూరి నాగేశ్వరరావు. ఈయన నిర్మించే అనూరాధా సినీ ఎంటర్‌ప్రైసెస్ ''కురుక్షేత్రంలో సీత''లో దాసరి నారాయణరావు రచన విశేష కర్షణ. మురళీమోహన్, మోహన్‌బాబు, గొల్లపూడి మారుతీరావు, త్యాగరాజు, సాక్షి రంగారావు, ఎ. బలరాం, జయసుధ, అంబిక, రాజసులోచన, నిర్మల పాత్రధారులు. దాసరి, సి. నారాయణరెడ్డి, కొసరాజు గీతాలకు రమేష్‌నాయుడు బాణీలు కూర్చారు. ఎస్. హరనాథ్ ఛాయ, కందస్వామి కూర్పు, సలీమ్ నృత్యాలు, సాయిప్రసాద్ నిర్వహణ, బి.వి. ప్రసాద్ దర్శకత్వంతో ఎ.బి.ఎల్. ప్రసాద్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసరు.





'శక్తి' లో కృష్ణ, రాధ

# సినిమా

## మగ మహారాజులో ఆడ మహారాణి!

భుజంగరావు (రావు గోపాలరావు) అన్నం వడ్డిస్తూన్న లక్ష్మి (పి. ఆర్. వరలక్ష్మి) చేతి గాజులు లెక్కపెట్టసాగాడు. అదేమిటని ఆమె అడిగితే, ''ఇవ్వాళ మార్నింగ్ ఇంటర్‌వ్యూలో — ఎవడో రవిరాజట .. 'సార్, మీరు ఇన్ని క్వొశ్చన్సు అడుగుతున్నారు. నేను తిరగబడి ఒక్క ప్రశ్న అడిగితే మీరు జవాబు చెప్పగలరా? రోజూ అన్నం వడ్డించే మీ ఆవిడ చేతికున్న గాజులెన్ని ?' అన్నాడు,'' అని వివరించాడు భుజంగరావు.

డైనింగ్ టేబుల్ పక్కనే కూర్చున్న జయ (సుహాసిని) చప్పట్లు కొట్టింది. ''ఫెంటాస్టిక్! డాడీ, ఎవరతను? ఎవరూ? రవిరాజా? తిరగబడి అటువంటి ప్రశ్న వేయాలనే థాట్ రావడం ఉంది చూశారూ? దట్స్ గ్రేట్! హి ఈజ్ ది హీరో ఆఫ్ ది ప్రెసెంట్ సొసైటీ,'' అంది.

భుజంగరావుకు చిర్రుమంది. ''జయా! షటప్! నీ తండ్రిమీద తిరగబడినవాడు నీకు హీరోగా కనిపిస్తున్నాడు. నాలాంటివాడి కాళ్ళు చుట్టూ 'దేహీ ... ఉద్యోగం ఇవ్వండి బ్రతుకుతాం' అని ప్రతిక్షణం తిరిగే ఒక దౌర్భాగ్యుడు నీ దృష్టిలో హీరో ఆఫ్ ది ప్రెసెంట్ సొసైటీ ... ఈ చదువు ఎన్ని వెర్రి తలలు వేస్తోందంటే ... అవున్లే. నువ్వు తిరగటానికో కారు, వీలయినంత ఖర్చు పెట్టుకోటానికి బాగ్ నిండా డబ్బు, నువ్వు ఏదడిగితే అది క్షణాలమీద సమకూర్చే నీ తల్లిదండ్రులు, ఎ.సి. రూమ్‌లు, సోఫాబెడ్‌లు — ఇవన్నీ ఉంటే, నీకు మంచేమిటో — చెడ్డేమిటో ఏ మాత్రం గౌరవం తెలియటం లేదు. అదే — చాలీచాలని తిండి, చాలీచాలని గుడ్డ — బ్రతుకుతున్నామో, చస్తున్నామో అర్థంకాక బ్రతుకుతూన్న ఏ దౌర్భాగ్యుల ఇళ్ళల్లోనో నాలుగు రోజులు బతికితే అర్థమవుతుంది — ఈ ఇళ్లేమిటో, ఈ జీవితమేమిటో, ఈ ఇంట్లో మనుషుల మనసులేమిటో ...''

అంతే. జయ ఇంకేం వినలేకపోయింది చివాలున లేచి, మేడమీది తన గదిలోకి వెళ్ళి, కాస్సేపు ఆలోచించుకొని, వెళ్ళిపోడానికే నిశ్చయించుకుంది. తన బట్టలు పెట్టెలో సర్దుకొని, తండ్రి గదిలోని అప్లికేషన్‌లలో రవిరాజ్‌ది వెతికి తీసుకుని, బయలుదేరింది.

విజయబాపినీడు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మించిన శ్యాం ప్రసాద్ ఆర్ట్స్ ''మగ మహారాజు'' చిత్రం త్వరలో విడుదలవుతుంది.

## ''పోరాటం''

''జూలైలో పాటలు రికార్డవుతాయి ఆగస్టు నుంచి షూటింగ్,'' అన్నారు కోడి రామకృష్ణ. ఈయన డైరెక్ట్‌చేసే ''పోరాటం'' చిత్రంలో కృష్ణ, జయసుధ, చంద్రమోహన్, పూర్ణిమ, రావు గోపాలరావు, గొల్లపూడి, జయంతి, అన్నపూర్ణ అధినాగల వారుంటారు పరుచూరి సోదరులు సంభాషణలు రాస్తున్నారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. ''చక్కని సెంటిమెంట్ గల ఆక్షన్ చిత్రం. డిసెంబర్‌లో రిలీజ్ చేయాలనుకుంటున్నాం,'' అన్నారు ఈ చిత్ర నిర్మాత 'ఎస్ ఆర్. ఫిలిమ్స్' అధినేత ఎస్. రామచంద్రరావు.

## గుత్తా రామినీడు దర్శకత్వంలో తమిళ చిత్రం

మాదాల ''యువతరం కదిలింది'' సంచలన చిత్రాన్ని గుత్తా రామినీడు దర్శకత్వంలో జనశక్తి క్రియేషన్స్ అనే సంస్థ తమిళంలో నిర్మిస్తుంది.

కుమారి జయశ్రీ 'కల్యాణవీణ'





సుమన్ 'పండంటి కాపురానికి 12 సూత్రాలు'

## మోహన్‌బాబు చిత్రావళి

"హీరో అవడం ఎంత అదృష్టమో — హీరోఅయ్యాక ప్రతి చిత్రంలోనూ వెరైటీగా ఉండే పాత్రలభించడం అంతకన్నా అదృష్టం — అంటూంటారు. ఈ 'అంతకన్నా అదృష్టం' నాకు లభించడానికి ఇంతకాలం పట్టింది. 'పగ' ప్రధానాంశంగాగల చిత్రమొకటి హిట్అయిందనుకోండి. దాదాపు అలాంటి ఇతివృత్తాన్నే విభిన్నమైన సన్నివేశాలతో తీయడానికి నిర్మాతలు పూనుకోవడం ఓ విధంగా వ్యాపార లక్షణం. అయినా, మార్పుదల అనేది చాలా అవసరం. నేనెప్పుడు నటిస్తూన్న, కొత్తగా అంగీకరించిన ప్రతి చిత్రంలోనూ నాది దేనికదే విశిష్టమైన పాత్ర. ఇంతకన్నా ఆర్టిస్టుకు ఆనందం ఇంకేముంటుంది ? నేను అంగీకరించిన 15 చిత్రాలలో ఎనిమిదింటికి డేట్స్ ఇచ్చాను," అంటూ మోహన్‌బాబు ఈ వివరాలు తెలియజేశారు.

డాక్టర్ డి. వి. ఎస్. రాజు నిర్మించే చిత్రానికి కె. బాపయ్య దర్శకుడు. 2. నందం హరిశ్చంద్రరావు దర్శకత్వంలో ఎస్. వెంకటరత్నం నిర్మించేచిత్రంలో త్రిపాత్రాభినయం విశేషాకర్షణ 3 కుమార్జీ చిత్రం. 4. కె. యస్. ఆర్ దాస్ దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావునిర్మించే పి. ఎన్. ఆర్. పిక్చర్స్ చిత్రం 5. శ్రీ లక్ష్మి ప్రసన్న పిక్చర్స్ చిత్రంలో ప్రభ, నళిని నాయికలు. 6. బి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వంలో కె. వి. వి. సత్యనారాయణ, కె. సత్యనారాయణ నిర్మించే సత్యా ఫిలింస్ చిత్రం. 7. కె.ఎస్.ఆర్. దాస్ దర్శకత్వంలో కేశవరావు నిర్మించే చిత్రం. 8. కె. వాసు దర్శకత్వంనెఱపే చిత్రంలో జయసుధ నాయిక.

"ఇక నా మాతృసంస్థ తారకప్రభువారి చిత్రానికి మా గురువుగారు శ్రీ దాసరి నారాయణ రావు దర్శకులు. అసలు 'రంగులపులి' చిత్రంలోనూ నాది విలక్షణమైన పాత్ర. లలితకళలపట్ల మక్కువగల కథానాయకుడు — అలాగే 'అగ్నిజ్వాల, మాయగాడు, మూగివాడి పగ, మరో మొనగాడు, భార్యాభర్తల సవాల్' ఇలా ప్రతి చిత్రంలోనూ కొత్త మోహన్‌బాబు కనిపిస్తాడు. 'దుర్గాదేవి' చిత్రంగురించి ఒక ముక్క చెప్పాలి. ఇది ఓ విధంగా నెగెటివ్ హీరో పాత్ర. తన తల్లిపై ఒకప్పుడు అత్యాచారంచేసింది తన ప్రేయసి తండ్రేలని తెలిశాక ఎంతటి సాధువైనా ఆవేశంలో సింహంఅవక తప్పదు అంటే, ఇప్పుడున్న ఇమేజ్‌కి కాస్త భిన్నంగా — మామూలు హీరోకాని పాత్ర. ఐతే, ఒక ఆర్టిస్టుకు ఛాలెంజింగ్ రోల్ అదీగాక నా సోదరసమానుడైన నిర్మాత వడ్డే రమేష్‌గారిపట్ల స్నేహభావంతో ఈ పాత్రను అంగీకరించడం జరిగింది.. ఇది వరకు దుష్ట, హాస్యపాత్రలు ధరించేటప్పుడు నాకాట్టే సమస్యలు ఉండేవికావు. షూటింగ్‌లకు హాజరవడం. చెప్పింది చేయడం. అంతే... కాని, హీరోఅయి ఓ ఇమేజ్ ఏర్పడ్డాక బాధ్యత మరింత పెరిగింది. అనేకమంది దృష్టి హీరోమీద కేంద్రీకరింపబడి ఉండడం సహజం. అలాగే హీరోకూడా పెక్కు అంశాలమీద దృష్టిని కేంద్రీకరించవలసి ఉంటుంది," అన్నారు మోహన్‌బాబు.

## రవిచిత్ర ఫిలిమ్స్ చిత్రంలో శోభన్‌బాబు

శోభన్‌బాబుతో వై. వి. రావ్ నిర్మించే మరో చిత్రానికి బాలమురుగన్ కథ రాశారు ఈ చిత్రానికి కూడా కట్టా సుబ్బారావు దర్శకుడు.

జయప్రద 'పులి—బెబ్బులి'





## "ఈనాడు" తదుపరి భాగంగా "ఇని ఎంగినామ్" మలయాళ చిత్రం

''ఈనాడు—చిత్రంలో నేటి మన సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితులను, ప్రజాపీడిత సమస్యలను చిత్రించాం. వాటి పరిష్కార మార్గాలు ఆ చిత్రంలో లేవు. అవి 'ఇని ఎంగినామ్' (ఇప్పుడు మనమెక్కడున్నాం) కొత్త చిత్రంలో ఉన్నాయి. మన దేశానికి స్వాతంత్ర్యం అందజేసేటప్పుడు ఆంగ్లేయులు ఏదో ఒక అడ్మినిస్ట్రేషన్ అంటూ ఏర్పాటుచేసి, తమపాటికి తాము వెళ్లిపోయారు. అప్పట్నుంచీ అంతా అస్తవ్యస్తంగా ఉంది. మనకు స్వరాజ్యం సిద్ధించడానికి కొన్ని ముందుగా ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో జపాన్‌లో చాలా భాగం ధ్వంసమైపోయింది వాళ్ళిక కోలుకోడానికి చాలాకాలం పట్టొచ్చని అందరూ భావిస్తున్న తరుణంలో—హఠాత్తుగా చూస్తుండగానే అన్ని రంగాలలోనూ ఎంతో అభివృద్ధిని జపనీయులు సాధించారు. కాని, మనం ఏమాత్రం పురోగమించలేదు సరికదా — మరింత వెనుకబడిపోతున్నాం మనం సాధించని, సాధించలేని ప్రగతిని అతి చిన్న దేశమైన జపాన్ ఎలా సాధించగలిగిందన్నది వివరిస్తుందీ చిత్రం . మన దేశానికి చెందిన కొందరు యువకులు విదేశాలలో పర్యటిస్తారు. హాంకాంగ్, జపాన్ దేశాలు దర్శించాక, ఆ దేశాలకు — మనదేశానికి సాంఘిక, రాజకీయ పరిస్థితుల తారతమ్యాలను పరిశీలించడంతో ఈ చిత్ర కథ మొదలవుతుంది,'' అన్నారు నిర్మాత బాలన్ కె. నాయర్. ''ఈనాడు'' అనంతరం ఈయన నిర్మిస్తున్న కొత్త చిత్రానికికూడా దర్శకుడు ఐ. వి శశి, కథకుడు దామోదరన్

కథకుడు దామోదరన్ కళ్ళికోటలోని ఓ బడిలో డ్రిల్‌మాస్టరు. పేరుమోసిన ఫుట్‌బాల్ ఆటగాడు. కేరళ రాష్ట్రంలో ప్రముఖ అథలటిక్స్ కోచ్. ''ఈనాడు'' చిత్రం గురించి ఈయన ఇలా అన్నారు : ''నిరుడు ఏప్రిల్ 17న కేరళలో ఎన్నికలు... ఈనాడు—చిత్రం ఏప్రిల్ 14న విడుదలైంది. ఎన్నికల ప్రచారంలో కమ్యూనిస్టులు 'మీరు ఈనాడు చిత్రం చూస్తే కాంగ్రెస్‌వాళ్ళ అరాజకాలు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి' అని, కాంగ్రెస్‌వాళ్ళు . 'ఈనాడు చిత్రం చూసి కమ్యూనిస్టులు చేసే అన్యాయాలను తెలుసుకోండి,' అంటూ 'ఈనాడు' చిత్రానికి విపరీతమైన పబ్లిసిటీ ఇచ్చారు. 'ఈనాడు' చిత్రంలాగే 'ఇని ఎంగినామ్' కూడా మరో సంచలన చిత్రం కావచ్చు.''

## బాపయ్య దర్శకత్వంలో డాక్టర్ రాజు చిత్రం

''మా పిక్చర్‌లో కొత్త మోహన్‌బాబు కనిపిస్తాడు. అలాగే రావు గోపాలరావు ఇదివరకు ధరించిన పాత్రలన్నీ ఒక ఎత్తు, మా చిత్రంలోని పాత్ర ఒక ఎత్తు. ఆద్యంతం నవ్వించే పాత్ర చంద్రమోహన్‌ది,'' అన్నారు డి. వి. ఎస్. రాజు. ఈయన వర్మ ప్రొడక్షన్స్ బ్యానర్‌లో జూన్ 29 న షూటింగ్ ప్రారంభించి చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, గిరిబాబు, నళిని, సుహాసిని ఇతర పాత్రధారులు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. వెంకట్ ఛాయ, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం, ఎం. ఎస్ దాస్ స్టంట్లు, శీను నృత్యాలతో ఈ చిత్రానికి దర్శకత్వం వహించే కె. బాపయ్య ''సెప్టెంబర్‌కు షూటింగ్ అయిపోతుంది. అక్టోబర్‌లో విడుదల.'' అన్నారు.



## త్వరలో విడుదలవుతూన్న "స్వరాజ్యం"

''డబ్బింగ్, రీరికార్డింగ్ కార్యక్రమాలన్నీ పూర్తయ్యాయి. స్వరాజ్యంకోసం అహర్నిశలూ శ్రమించి, పోరాడిన విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజుకు ఈ చిత్రాన్ని అంకితం చేస్తున్నాం,'' అన్నారు మాదాల రంగారావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, నిర్మాణ సారధ్యంలో నవతరం పిక్చర్స్ రూపొందించిన ''స్వరాజ్యం'' ఎందరికో కనువిప్పు కలిగించే చిత్రం. మాదాలతో పాటు మురళీమోహన్, వంకాయల, జీవా, శశిమోహన్, నల్లూరి వెంకటేశ్వర్లు, నర్రా, వీరభద్రరావు, రమణమూర్తి, తూనుగుంట, ఎస్. బి. ప్రసాదరావు, శ్యామలగౌరి, కె. విజయ, పుష్పకుమారి, అత్తిలి లక్ష్మి, కల్పనారాయ్, జయశీల, అప్పల అప్పారావుగా సంగీత దర్శకుడు చక్రవర్తి పాల్గొన్నారు. కాగడా శర్మ సంభాషణలు, ఆర్. రామారావు, ఛాయ, ఉర్చి శిల్పం, సి హెచ్. సుబ్బారావు కూర్పు, గోగినేని నరసింహారావు సహకార దర్శకత్వం తెర వెనుక హంగులు.

## "శ్రీకృష్ణ చరిత్ర"

''భారీ సెట్టింగులతో, రవికాంత్ నగాయిచ్ ట్రిక్ ఫోటోగ్రఫీతో అద్భుతంగా డైరెక్టర్ ఎ పి. నాగరాజన్ రూపొందించిన చిత్రం,'' అన్నారు నిర్మాతలు, ఎన్. చెన్నకేశవరావు, ఎస్ ఎస్ రమేష్‌బాబు బాలబాలాజీ చిత్ర పతాకంలో నిర్మితమైన పై చిత్రం త్వరలో విడుదలవు తుంది. జయలలిత, శివకుమార్, శ్రీవిద్య, ఎస్. వరలక్ష్మి, మనోహర్, రాణి, మనోరమ, కుచేలుడుగా నాగేష్ నటించారు. మాటలు, పాటలు వీటూరి రాశారు. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు

'విముక్తికోసం' కుమారి పద్మ





'రాజ్‌కుమార్' శోభన్‌బాబు, అంబిక

# అవి - ఇవి

★ మద్రాసు మౌబ్రేస్ రోడ్‌లో వాణీజయరాం, ఆమె భర్త కలిసి ''మయూరప్రియ'' అనే మ్యూజిక్ షాప్‌ను తెరిచారు ప్రారంభోత్సవ సమయాన మొట్టమొదటి ఎల్ పి. రికార్డును కొనుగోలు చేసినవారు గాయని పి సుశీల ఆ రికార్డు వాణీజయరాం పాడినదే. ''పర్వాన్'' అనే ఘజల్

★ ''రాజీవ్‌గాంధీకి నటించటం గురించి ఏ మాత్రం తెలుసో — రాజకీయాల గురించి నాకంతే తెలుసు.'' ఈ మాటన్నది అమితాబ్‌బచ్చన్.

★ నటి సిమి దర్శకత్వంలో జూన్ 25 నుంచి అమెరికాలో షూటింగ్ జరిగే ''రుక్సత్'' హిందీ చిత్రంలో అలనాటి నటి, నర్తకి పద్మిని నటించబోతోంది.

★ సత్యమూవీస్ వారి చిత్రంలో పద్మిని, ఎ. వి. ఎం. వారి చిత్రంలో జమున తల్లి పాత్రలో కనిపించనున్నారు.

★ చాలా కాలం తర్వాత జెమినీగణేశ్, ప్రమీల ''సూరకోట్టై సింగకుట్టి'' అనే తమిళ చిత్రంలో బుక్ అయ్యారు.

★ సంగీత దర్శకుడు ఇళయరాజా స్వయంగా నిర్మించే ''ఆనందగుమ్మి'' తమిళ చిత్రానికి బొంబాయిలో పాటలు రికార్డ్ చేయించాడు.

★ శ్రీదేవి ఇంతవరకు ఆరు హిందీ చిత్రాలలో నటించింది ఆ చిత్రాలన్నిటి షూటింగ్‌లూ మద్రాసులోనే జరిగాయి.

★ ఏప్రిల్ 8న విడుదలైన ''అంధా కానూన్'' చిత్రం న్యూబొంబాయిలోని 'మేఘదూత్' (వశి) థియేటర్‌లో ఆనాటి మధ్యాహ్నం 12 గంటల ఆటలో ప్రారంభమవ వలసింది. కాని, అక్కడ అది వరకు ప్రదర్శింపబడిన ''అర్పన్'' చిత్రం ప్రింట్‌ను తీసుకెళ్ళ డానికి బరులు అప్పుడే వచ్చి దిగిన ''అంధా కానూన్'' ప్రింట్‌ను ఒక రెప్రెజెంటెటివ్ పొరబాటున తీసుకెళ్ళిపోయాడు. తారుమారు గుర్తించేసరికి 12 గంటలు దాటిపోయింది. అంచేత, ''అంధాకానూన్'' ప్రింట్‌ను తెప్పించి, 3 గంటల ఆటగా ప్రదర్శన ప్రారంభించారు

★ ''పోస్ట్‌మార్టమ్'' మలయాళ చిత్రాన్ని హిందీలో నిర్మించే హక్కులను ఎ జి ఫిలిమ్స్ వారు కొనుగోలు చేశారు

★ బి ఆర్ చోప్రా, యాష్ చోప్రాల చిత్రాలలో డింపిల్ నాయికగా బుక్ అయింది.

★ గురజాడ కళామందిర్ వారి తొలి చిత్రంలో నూతన్‌ప్రసాద్ ఒక పాట పాడారు.




మే 30వ తేదీ మధ్యాహ్నం మండుటెండవేళ మద్రాస్ మీనంబాకంలోని ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టు సినిమా జనంతో కిటకిట లాడుతోంది. ఆ రోజు 12–30 గం.ల విమానంలో ప్రముఖ దర్శకుడు కె. రాఘవేంద్ర రావు — నెల రోజులపాటు యూరప్ పర్యటన ముగించుకొని మద్రాసుకి తిరిగివస్తున్నారు. పన్నెండు పదికి రావలసిన ఫ్లైట్ పన్నెండున్నరకి వచ్చింది. రాఘవేంద్రరావును రిసీవ్ చేసుకోవ డానికి వచ్చినవారిలో ఏ. యస్. ఆర్. ఆంజనేయులు, జి. ఆదిశేషగిరిరావు (పద్మాలయా) చలసాని గోపి (పద్మాలయా కంబైన్స్), కె. నాగేశ్వరరావు (రమా ఫిలింస్), సి. అశ్వనీదత్ (వైజయంతీ మూవీస్), కె. దేవీవరప్రసాద్ (దేవి ఫిలిం ప్రొడక్షన్స్), ఎ. గోపాలకృష్ణ (గోపీ మూవీస్) రామా నాయుడుగారబ్బాయి సురేష్‌బాబు (సురేష్ ప్రొడక్షన్స్) యు. వి. సూర్యనారాయణరాజు (గోపీకృష్ణ మూవీస్) రాఘవేంద్రరావు అన్నగారు కె. కృష్ణమోహన్‌రావుగార్లతోపాటు అనేకమంది సాంకేతిక నిపుణులు, ప్రొడక్షన్ అసిస్టెంట్స్ (పెద్ద పెద్ద పూలమాలలతో) వచ్చారు. రాఘవేంద్రరావు ఆయనతోపాటు విదేశీ పర్యటనకు వెళ్లిన మరో యిద్దరు ప్రముఖులు కెమెరామన్ కె. యస్. ప్రకాష్, రచయిత సత్యానంద్ — కస్టమ్స్ చెరనుంచి తప్పించుకొని బయటపడేసరికి రెండున్నర అయింది.

"ఈ కస్టమ్స్ — చెకింగ్ ఇవన్నీ పెద్ద న్యూసెన్స్. ఇవన్నీ పడలేకనే నేను విదేశాలకు వెళ్లడం మానుకున్నాను" అన్నారు గోపీమూవీస్ అధినేత గోపాలకృష్ణ ఛలోక్తిగా.

### ఫస్ట్ టైమ్

"నేను డైరెక్టర్ అయ్యాక నెల రోజులు హాలిడే ట్రిప్ తీసుకోవడం యిదే ఫస్ట్ టైమ్" అన్నారు, రాఘవేంద్రరావు.

"ఏ ఏ ప్రదేశాలు చూశారు ?" అని అడిగినప్పుడు ఆయన నవ్వి "నెలలో వారం రోజులు షికాగో నగరంలోను, వారం రోజులు లాస్ ఏంజిలిస్ (హాలీవుడ్)లోను గడిపాను. అమెరికా అంతా పూర్తిగా చూడాలంటే రెండు నెలలైనా పడుతుంది. లాస్ ఏంజిలిస్‌లో యూనివర్సల్ స్టూడియో — అక్కడి చిత్ర నిర్మాణ విధానం, డిస్నీలాండ్ — అందులోని అద్భుతాలను చూశాను. ఇవి చూస్తే అమెరికాలోని ముఖ్యమైనవి చూసినట్లే" అన్నారు.



కొడుకు కృష్ణని ఆశీర్వదించి పట్టు వస్త్రాలు బహూకరిస్తున్న తల్లి దండ్రులు శ్రీమతి నాగరత్నమ్మ, శ్రీ వీరరాఘవయ్య చౌదరి.

## 'సూపర్ స్టార్' పుట్టిన రోజు

మే 31 'సూపర్ స్టార్' కృష్ణ పుట్టిన రోజు. ఆ రోజు కృష్ణగారి తల్లి నాగరత్నమ్మ గారు, తండ్రి ఘట్టమనేని వీరరాఘవయ్యచౌదరి గారు — కృష్ణగారి నిర్మాతల్ని, దర్శకుల్ని, సన్నిహితుల్ని, వారి యింటికి లంచ్‌కి పిలిచారు. కృష్ణగారు 'రామరాజ్యంలో భీమరాజు' షూటింగ్ నుంచి పన్నెండున్నరకి వచ్చారు. ఇంట్లోని హాల్లో కొడుకుని కుర్చీలో కూచోబెట్టి నెత్తిమీద అక్షతలు చల్లి ఆశీర్వదించి పట్టు వస్త్రాలు పెట్టారు, నాగరత్నమ్మ, రాఘవయ్యగార్లు. అనంతరం ఆహూతులందరికీ పలురకాల వంటకాలతో భోజనం పెట్టారు.

### మినీ డిన్నర్

ఆ సాయంత్రం 6–30 గం.లకు విజయనిర్మలగారింట బర్త్‌డే కేక్ కటింగ్ జరిగింది. టాప్ ఫ్లోర్‌లో ఓపెన్ టెర్రస్‌లో అందంగా అలంకరించిన కేక్‌ని కృష్ణ కట్ చేయగానే కట్ చేసిన ముక్కను కృష్ణగారి నోటికి అందించారు విజయనిర్మల. వచ్చిన వారంతా హర్షధ్వానాలను తెలిపారు. ఆహ్వానితులకు శ్రీమతి విజయనిర్మల 'మినీ డిన్నర్' ఎరేంజ్ చేశారు. మినీ డిన్నర్ పేరుకేగాని, నిజానికి ఒక పెద్ద డిన్నర్‌కి సరిపడినన్ని పదార్థాలు చేసి అందరికీ దగ్గరుండి సంతుష్టిగా వడ్డించారామె. "కృష్ణగారింటికి వచ్చినవారందరిలోనూ 'మా కృష్ణ' అనుకుని వచ్చినట్లే కనపడు తున్నది తప్ప, ఎవరిలోనూ కృతకమైన భావం లేదు. అంతటి ఆప్యాయతా అనురాగాలు సంపా యించుకున్న కృష్ణ ధన్యుడు" అన్నారు సహజకవి, నిర్మాత మల్లెమాల సుందరరామిరెడ్డి.

## ట్రేడ్ సీక్రెట్ !

జూన్ 1న వాహినీలోని 7వ ఫ్లోర్ చాలా సందడిగా వుంది. ఆ రోజు రమా ఫిలింస్‌వారి "ఇద్దరు దొంగలు" షూటింగ్ ప్రారంభం. నటుడు సత్యనారాయణ సమర్పిస్తున్న యీ చిత్రాన్ని ఆయన తమ్ముడు కైకాల నాగేశ్వర రావు నిర్మిస్తున్నారు. కె. రాఘవేంద్రరావు దర్శకత్వం వహిస్తున్న యీ చిత్రంలో 'ఇద్దరు దొంగలు'గా కృష్ణ, శోభన్‌బాబు నటిస్తున్నారు. శోభన్‌బాబు సరసన జయసుధ, కృష్ణ సరసన రాధ నాయికలు. సత్యనారాయణ, శారద ఇంకొక జంట. వీరందరితోపాటు ఆ రోజు అల్లు రామలింగయ్య కూడా (హెడ్‌కానిస్టేబుల్ వేషంలో) వచ్చారు. ఆయన్ని చూడగానే 'గ్లామర్ బాయ్ ఆఫ్ ది డే' అని జయసుధ జోక్ చేసింది. "వయసు పెరిగేకొద్దీ గ్లామర్ పెరిగిపోతోందీయనికి" అన్నారు సత్యనారాయణ.

"మీ గ్లామర్ సీక్రేటు ఏమిటండీ ?" అని అల్లు రామలింగయ్యగార్ని ఎవరో అడిగారు. "అది ట్రేడ్ సీక్రేట్, నేను చెప్పను" అన్నారాయన.



'ఇద్దరు దొంగలు' ప్రారంభం రోజున ఇద్దరు నాయకుల మధ్య దర్శకుడు కె. రాఘవేంద్రరావు

పదింపావుకి ముహూర్తం షాట్ తీశారు రాఘవేంద్రరావు. జయసుధ ఒక ప్లేట్‌లో లడ్డులు పట్టుకొచ్చి, ఒకటి కృష్ణ నోట్లోను, మరొకటి శోభన్‌బాబు నోట్లోను పెట్టడం ముహూర్తం షాట్. దాసరి నారాయణరావు క్లాప్ కొట్టారు కె. యస్. ప్రకాశరావు కెమెరా స్విచాన్ చేశారు.

## సెన్సారు పునాదులు కదిలించిన యన్. టి. ఆర్!

'వీరబ్రహ్మంగారి చరిత్ర' గురించి సెన్సారు తెలిపిన అభ్యంతరాలకు సహేతుకమైన కారణాలు వివరించవలసిందిగా యన్. టి. ఆర్ మద్రాసు హైకోర్టులో కేసు వేసిన సంగతి అందరికీ తెలిసినదే! ఆ దెబ్బతో సెన్సారువారికి పునాదులు కదిలాయి. ఇన్ఫర్మేషన్ బ్రాడ్ కాస్టింగ్ శాఖలో సంచలనం వచ్చింది. తత్ఫలితంగా యిపుడు కొత్త రూల్స్ వచ్చాయి అయిదుగురితో కలిసి ఒక 'అపిలేట్ ట్రిబ్యునల్' ఏర్పాటు చేశారు. ఈ అయిదుగురిలోను ఒక రిటైర్డ్ జడ్జిగాని, జడ్జి హోదా కలిగిన వ్యక్తి కాని వుంటారు. ఇపుడువున్న 'సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిల్మ్ సెన్సార్స్' పేరును 'సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిల్మ్ సర్టిఫికేషన్'గా మార్చారు.

ఇంతవరకూ సెన్సారుకి చిత్రం చూపించే ముందు స్క్రిప్ట్ యివ్వడం ఆనవాయితీ ఇపుడు అలాగాక ఆ చిత్రం ప్రింటుగాని, వీడియో ప్రింటుగాని సెన్సారు ఆఫీసులో యివ్వాలి. నిర్మాత అప్లై చేస్తే సంవత్సరాంతాన ఆ ప్రింటు యిస్తారు. వీడియో ప్రింట్ అయితే యివ్వరు. స్క్రిప్టు బుక్‌కి బదులుగా యిదో కొత్త ఏర్పాటు.

— మోహన్ కుమార్ *

'దుర్గాదేవి' జయసుధ, మోహన్ బాబు

సీరియల్

# [illegible]

## వక్కలంక పద్మావతి

(గత సంచిక తరువాయి)

నెల రోజులు గడిచాయి. సూర్యోదయం, వెన్నెల, వెలుగు ఏవీ సురేంద్ర మనసులోని చీకటిని నశింపచేయలేకపోతున్నాయి. కాలం పుగోగ గమిస్తుందో.. నిలిచిపోయిందో అతనికి తెలియటం లేదు. నైరాశ్యం, దుఃఖం, కోరుకున్నది సాధించ లేకపోయానే అన్న బాధ... గతస్మృతుల అనుభూతులలో కృంగి కృశించి బ్రతుకుపట్ల నిరాశను పెంచుకున్నాడు. గాయత్రి తనను ఎంతగా ప్రేమించి ఆరాధించిందీ, పదే పదే గుర్తుకువచ్చి, సంతోషం, ఆమె తనకు కలిగించిన నిరాశకు విచారం వుండి వుండీ అతన్ని కమ్మేస్తున్నాయి. గాయత్రికి పెళ్ళి అయిపోయిందనే భావన అతన్ని స్థిరంగా వుండనీయటంలేదు.

ఊజీఛైర్‌లో కూలబడి నుదుటిమీద చేత్తో రుద్దుకుంటూ కూర్చున్నాడు సురేంద్ర. అరగంట గడిచింది. అతని ఆలోచనలు తెగటం లేదు ఎంతకాలమైనా!

''సురేంద్రా!'' అన్న పిలుపు వినిపించి ఉలిక్కిపడి కళ్ళుతెరిచి చూశాడు.

ఎదురుగా విశ్వనాథంగారు కనిపించారు. కంగారుగా లేచి ఎదురెళ్ళి 'రండి అంకుల్' అంటూ ఆహ్వానించాడు.

విశ్వనాథంగారు కూర్చోలేదు. సురేంద్ర కేసి కళ్ళప్పగించి చూస్తుండిపోయారు. పీక్కుపోయి నీరసంగా కనుపిస్తున్న ముఖాన్ని, లోతుకు పోయిన కళ్ళని, మాసిపోయిన గడ్డాన్ని, బాధగా చూశారు. గాయత్రి గురించి అతనెంత కృంగిపోయాడో ఒక్క చూపుతో గ్రహించారాయన.

'కూర్చోండి అంకుల్' అతని కంఠంలో ఆప్యాయతకు విశ్వనాథంగారు చలించిపోయారు.

సోఫాలో కూర్చుంటూ అన్నారు ''రెండు నెలలు శలవుపెట్టి ఇంత అర్ధాంతరంగా వచ్చేశావేం సురేంద్రా... ఒంట్లో కులాసాగాలేదా?'' అన్నారు ఏమీ తెలీనట్టు.

సురేంద్ర తన విషయం పట్టించుకోనట్టుగా ''మీరెప్పుడొచ్చారు అంకుల్ యాత్రల నుంచి. ఆంటీ కులాసాగా వున్నారా, మంజుల దగ్గర్నుంచి లెటర్సు వచ్చాయా...'' అంటూనే ఆయన సమాధానాన్ని వినకుండా.. ''కాఫీ తీసుకువస్తానుండండి,'' అంటూ అక్కడినుంచి వెళ్ళిపోబోయాడు!

''ఉండు సురేంద్రా! ఇప్పుడవేమీ వద్దుగానీ! కూర్చో! నీతో మాట్లాడాలి'' అన్నారు గంభీరంగా.

సురేంద్ర మౌనంగా వచ్చి ఆయనక్కు ఎదురుగా కూర్చున్నాడు.

''నేనొచ్చి చాలాసేపయింది. క్రింద మీ నాన్నగారితో మాట్లాడే వస్తున్నాను. బైట ఏం జరుగుతుందో... ఇంట్లో ఎవరొచ్చి పోతున్నారో అనే ధ్యాసకూడా నీకులేదని నీ వాలకం చెప్తూనే వుంది.

మేం యాత్రలనుంచి వచ్చేసరికి గాయత్రి పెళ్ళి శుభలేఖలు కనిపించాయి. తెరచి చూస్తూనే ఆశ్చర్యపోయాము. మీరెవ్వరూ చెప్పకపోయినా ... నువ్వు గాయత్రిని ప్రేమిస్తున్నావనే విషయం నేను గ్రహించాను. కానీ వేరే వ్యక్తితో గాయత్రి పెళ్ళేమిటా అని ఆశ్చర్యపోయాను.

రామూ అన్ని విషయాలూ చెప్పాడు.''

సురేంద్ర కుతూహలంతో వింటున్నాడు.

''పరిస్థితి అర్థంకాక ఏమీ తెలీనట్టు వెంటనే గాయత్రి ఇంటికి వెళ్ళాం. ఇల్లంతా బోసిగా, నిశ్శబ్దంగా వుంది. బంధువుల తాలూకూ ఆవిడ ఎవరో మమ్మల్ని చూసి సంగతులు చెప్పింది. గాయత్రి ముందు పెళ్ళికి ఒప్పుకుని ఆ తర్వాత పెళ్ళి ముందురోజు ఇంట్లోంచి వెళ్ళిపోయిందని, ఆ అవమానంతో విచారంతో ఆమె తండ్రి మంచంపట్టి, ఆ తర్వాత రెండు రోజులకే గుండెపోటుతో మరణించాడని చెప్పింది. గాయత్రి ఎక్కడుందో ఇంతవరకూ తెలియలేదట కూడా!'' ఒక్క నిమిషం ఆగి మళ్ళీ అన్నారాయన.

''ఒక్కో విషయం వింటూంటే అది కలో నిజమో అర్థంకాలేదు. సురేంద్రా! ఆ ఇల్లు నరకంలా అనిపించింది.

మమ్మల్ని చూడగానే కిరణ్, బేబీలు బావురుమన్నారు. మేమిద్దరం బొమ్మల్లా అయిపోయాం! మాకు నోట మాటే రాలేదు. కిరణ్‌ని, బేబీని ఎలాగో ఓదార్చాం. ఆ ఇంటి పరిస్థితి చూస్తుంటే అయోమయంగా వుంది.''

పరిసరాలను మర్చిపోయి వింటున్న సురేంద్ర హతాశుడయ్యాడు. ఆయన చెప్పే విషయాలు వినలేక తనను తాను నిలదొక్కుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. అతని కళ్ళముందు గాయత్రి రూపమే మెదులుతోంది. ఆమె కోసం అతని మనసు గిలగిల కొట్టుకుంది.

''ఏమైంది గాయత్రీ! తన మనసు తన ప్రాణం, తన గుప్పెటలో పెట్టుకుని ఎక్కడికి వెళ్ళిపోయింది ఎవరికీ తెలియకుండా! అసలు చనిపోయిందేమో!''

ఆ వూహ అగ్నిజ్వాలలా అతని మనసును మాడ్చివేస్తుంది

''నో! గాయత్రి బ్రతికే వుంటుంది. నా కోసం బ్రతికే వుంటుంది'' ఉద్వేగంతో,

**జరిగిన కథ — 6:** సురేంద్ర తను గాయత్రిని ప్రేమిస్తున్నట్లు మంజులతో చెపుతాడు. గాయత్రి మాటలకు సురేంద్ర మనసు దెబ్బతింటుంది. తను గాయత్రిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నట్లు ఆమెకు చెపుతాడు. గాయత్రి కూడ సురేంద్రను ప్రేమిస్తుంది కాని తండ్రికి భయపడి తన ప్రేమను బయటకు వ్యక్తం చేయలేకపోతుంది. గాయత్రి మనస్సు విప్పి తన ప్రేమను సురేంద్రతో చెపుతుంది. మంజుల, వినోద్, సురేంద్ర, గాయత్రీలు మహాబలిపురం పిక్నిక్ వెళ్ళి అక్కడ సరదాగా కాలక్షేపం చేస్తారు. మంజుల వివాహం వినోద్‌తో జరిగిపోతుంది. తిరుపతిలో ఒక సినిమా నిర్మాత గాయత్రి అందాన్ని చూసి ఆకర్షింపబడుతాడు. శ్రీనివాసన్ సెక్రటరీ 'స్వామి' శ్రీనివాసన్ గాయత్రిని పెళ్ళి చేసుకోను ఇష్టపడుతున్నట్లుగా పరమేశంగారికి చెప్పగా ఆయన తన కూతురి అదృష్టానికి మురిసిపోతారు. గాయత్రి తండ్రి మాటను కాదనలేక పెళ్ళికి అంగీకరిస్తుంది. కానీ ఆఖరి క్షణంలో మనస్సు సరిపెట్టుకోలేక ఇల్లు విడిచి సురేంద్ర దగ్గరకు పారిపోతుంది. సురేంద్ర ఇంట్లో లేకపోగా నిరాశతో కదిలే రైలెక్కుతుంది.

అప్రయత్నంగా బయటికే అనేశాడు సురేంద్ర. విశ్వనాథంగారు కంగారుపడ్డారు. అతని భుజం మీద చేయివేసి —

''బాధపడకు సురేంద్రా! ధైర్యంగా వుండు'' అని ధైర్యం చెప్పారు.

''అంకుల్! గాయత్రి నా ప్రాణం! ఆమెను పెళ్ళి చేసుకోవాలని, నా ఇంటికి వెలుగు అవుతుందని ఎన్నో కలలు కన్నాను. ఎంతో ఆశతో, ఆత్రుతతో ఎదురుచూశాను. ఆ కలలు ఇంత విషాదంగా మారతాయనుకోలేదు. గాయత్రి నన్ను కాదని మరొకర్ని చేసుకో బోతుందనే కోపంతో ఆమెను తూలనాడాను. గాయత్రి నా కోసం ఎక్కడో బ్రతికే వుంటుంది. ఆ ఆశ నాకుంది అంకుల్'' అన్నాడు.

అతని మాటల్లో స్పష్టతని, దృఢత్వాన్ని విశ్వనాథంగారు కళ్ళప్పగించి చూస్తున్నారు.

''అంకుల్! వాళ్ళ కుటుంబం ఇలా చిన్నా భిన్నం కావటానికి కారణం నేనే! ఆ నిజం నన్ను కాల్చి వేస్తుంది ... నా పాపానికి నిష్కృతి చేసుకోవాలి! మనం వెంటనే వెళ్ళాలి! గాయత్రి తమ్ముణ్ణి, చెల్లెల్ని మనింటికి తీసుకొచ్చేద్దాం. వాళ్ళిద్దరూ అనాధలు కాకూడదు. వాళ్ళ బాధ్యత నేనే వహిస్తాను అంకుల్ ...''

విశ్వనాథంగారు అతని గొప్ప మనసుకు ఎంతో ఆనందించారు.

''కిరణ్‌ని, బేబీని మనింటికి తీసుకు వచ్చాను బాబూ! గాయత్రి నాకు మంజులతో సమానం బాబూ! గాయత్రి ఇలా చేసిందంటె నా మనసు కన్న తండ్రిలా ఆమె కోసం ఎంతగా ఆరాట పడుతుందో గ్రహించావా! నా తల్లి ఎక్కడుందో... ఏమో...!'' ఆయన కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

సురేంద్ర కళ్ళ నుంచి జల జలా నీళ్ళు రాలాయి. గాయత్రి గురించిన భావనల ప్రకంపనల వల్ల వాతావరణం విషాదంగా అయింది.

ఆ సాయంత్రమే తండ్రితో చెప్పి విశ్వనాథం గారితో కలిసి తిరుపతి బయల్దేరాడు సురేంద్ర

* * *

తెల్లవారుఝాము నాలుగ్గంటలవుతుంది.

హోరుమని గాలి వీస్తోంది. కుండపోతగా వర్షం. ఆకాశం నిండా కారుమేఘాలు కమ్మి.. మరింత చీకటిగా చేసింది లోకాన్ని. ఉరుములు, మెరుపులతో... ఆకాశం అప్పుడప్పుడు తళుక్కున మెరుస్తోంది.

గాయత్రి ఎక్కిన కంపార్టుమెంటులో తెలుగు వాళ్ళెవరూ కనిపించటం లేదు. ఆ రైలు ఎక్కడికి వెళ్తుందో నన్న ఆలోచన అప్పుడు కలిగిందామెకు. ఎదుటిసీట్లో కూర్చున్న వయసు మళ్ళిన వ్యక్తిని ఇంగ్లీషులో అడిగింది ఆ రైలు ఎక్కడికి పోతుందని!

'తిరువణ్ణామలై' అన్నాడతను క్లుప్తంగా.



కొద్ది నిమిషాలాగి ఆమె ఆసక్తిని గమనించి ఆ వూరు చాలా అందంగా వుంటుందని, అక్కడ రమణాశ్రమం వుందని, ఎందరో అభాగ్యులు అందులో నిశ్చింతగా జీవిస్తున్నారని ఇంకా ఇంకా ఆ వూరి విశిష్టతలు ఎన్నో చెప్పాడాయన.

ఆ వూరి గురించి మరో ముఖ్యమైన విశేషం గాయత్రికి జ్ఞాపకానికి వచ్చింది. వ్యక్తిగా, కవిగా, మేధావిగా, సాహితీ జగత్తులో తన విశ్వరూపాన్ని ప్రదర్శించిన 'చలం' మహాఋషిగా కాలంగడిపిన 'అరుణాచలం' అదేనని తెలిసి ... ఆమె మనస్సు ప్రశాంతంగా అయింది.

ట్రయిన్ దిగుతుంటె ఆమె మనసెందుకో కంపించింది. దారి తప్పిన లేడిపిల్లలా అల్లాడి పోయింది. రమణాశ్రమానికి వెళ్లటానికైనా వర్షం దిమ్మరించి వేస్తోంది.

స్టేషనంతా నిర్మానుష్యంగా వుంది. బయటకువచ్చి చూసింది. జట్కాలున్నాయి. కానీ అంత వర్షంలో ఎవరూ రామన్నారు. చేసేది లేక దిక్కులు చూస్తూ నిలబడింది గాయత్రి.

ఒకపావుగంట తర్వాత వర్షం కాస్త తగ్గినట్లనిపించింది. చాలా సేపట్నుంచి ఆమె అలా నిలబడి వుండటంచూసి తను ఆశ్రమానికి తీసికెళతానని, వచ్చాడు ఒక బండి అతను.

గాయత్రి జట్కాలో ఎక్కి కూర్చుంది.

వర్షంలో గుర్రం ముందుకు కదలటానికి అయిష్టంగా అడుగులేస్తోంది. ఇంకా ఫర్లాంగు దూరంలో ఆశ్రమం ఉదంనగా గుర్రం ఇక అడుగు కూడా ముందుకు కదలదని మొరాయించింది. బయట వర్షం ఉధృతం అయింది మళ్లీ!

"అమ్మా! కాస్తదూరం నెమ్మదిగా నడిచి వెళ్లండి! బండి వెళ్లటానిక్కూడా వీలుగా లేదు." అన్నాడు అరవంలో! గాయత్రి కేమీ అర్థంకాకపోయినా అతని చేతిలో డబ్బులు పెట్టి మెల్లగా నడవసాగింది,

కాస్తదూరం ఎలాగో నడవగలిగింది కానీ ఎదురుగాలి ఆమెను వెనక్కి నెట్టేస్తోంది, అడుగు పడనివ్వకుండా! వర్షం మరింతగా కురవటంతో ఏంచేయాలో తోచక అటూ ఇటూ చూసింది. కాస్త దూరంగా చెట్లమధ్య ఒక పెంకుటిల్లు కనిపించింది మసక వెలుతురులో.

ఆ ఇంటికేసి దారితీసింది గాయత్రి.

మూసివున్న తలుపుల మీద గట్టిగా చప్పుడు చేసింది పిడికిలితో. ఎక్కువ సేపు ఆలస్యం కాకుండానే ఆ ఇంట్లో లైటు వెలిగింది. వెంటనే తలుపులు తెరచుకున్నాయి.

తలనిండా ముసుగు కప్పుకుని, చలికి గజగజా వణుకుతూ తలుపు తెరిచిన యువకుడి వైపు చూపులు సారించింది.

అతనికి సుమారు ముప్పయి సంవత్సరాలుంటాయి. తెల్లటి లుంగీమీద మల్లెపూవు లాంటి లాల్చీ వేసుకున్నాడు. అతని కళ్ళకి సన్నటి ఫ్రేమ్ కళ్ళద్దాలున్నాయి. అతని గుండ్రని తెల్లటి

## ఇది మేఘ సందేశమూ...

మొహానికి నల్లటి పల్చటి గడ్డం ... అతని వయసును రెండు మూడేళ్ళు పెంచుతున్నట్టు వుంది.

అతని వెనుక ఎవరైనా ఆడవాళ్ళు వస్తారేమోనని చూసింది. కానీ ఆ జాడ కనిపించలేదు.

తడిసిన బట్టల్లో వణుకుతూ నిల్చున్న ఆమెను చూసి అతను ఆశ్చర్యం ప్రకటించాడు.

"నాంగో..." (మీరూ...?)

గాయత్రికి అతను అన్నదేమిటో అర్థం కాలేదు. ఒక పక్క చలి. నోట్లోంచి మాట కూడా బయటికి రావటం లేదామెకు.

"చీకటిలో దారి కూడా తెలీటం లేదు. కాస్త మీ ఇంట్లో కొద్దిసేపు ఆశ్రయం ఇవ్వగలరా!" అంది ఇంగ్లీషులో.

ఆమె అలా ప్రాధేయపడటం చూసి అతనికి బాధ కలిగింది.

"అయ్యో!... మీరు లోపలికి రండి" అన్నాడు వెంటనే.

గాయత్రి లోపలికి అడుగు పెడుతూనే అతను తెలుగు మాట్లాడటం విని ఆశ్చర్య చకితురాలైంది. కృతజ్ఞత నిండిన కళ్ళతో అతన్ని చూసింది.

అతను తలుపుగడియ బిగించి వేగంగా లోపలికి వెళ్ళి టవల్ తెచ్చి ఇచ్చాడు.

### మందుల భ్రమ!

పిల్లల తెలివితేటలు, చదువుల్లో వారి శక్తిసామర్థ్యాలు పెరగటానికి, రాత్రి పూట ప్రశాంతంగా నిద్రపోవటానికి పశ్చిమ జర్మనీలో తలితండ్రులు వివిధ రకాల మందులను పిల్లలకు ఇస్తున్నారు. ఫెడరల్ ఆరోగ్య సమాచార కేంద్రం జరిపిన ఒక సర్వేలో 42 శాతం మంది ఇందులో తప్పేమిటని ప్రశ్నించారు. ఇదంతా మందుల కంపెనీల ప్రభావమేనని ఈ కేంద్రం పేర్కొన్నది. పిల్లలకు నిద్రమాత్రలు ఇవ్వటం చాలా ప్రమాదకరమని వీరు పేర్కొన్నారు. పిల్లల్లోని శక్తిసామర్థ్యాలను ఇవి మరుగుపరచి, చివరకు ఒక దురలవాటుగా మారుతుందని వీరు అన్నారు. విటమిన్ మాత్రలను గురించి చెబుతూ, విటమిన్లను ఆహార రూపంలో ఇవ్వటమే మంచిదని, ధాన్యాలు, పప్పుదినుసులు, గుడ్లు, పాలు, మాంసాలలో విటమిన్లు, పోషక పదార్థాలు సమృద్ధిగా లభిస్తాయని వీరు తెలియ చేశారు. మందులవలన తెలివితేటలు పెరగటమనేది ఒట్టి భ్రమ మాత్రమే అని హెచ్చరించారు.

"భయం లేదు. పక్క రూంలోకి వెళ్ళి తల తుడుచుకోండి" అన్నాడు.

గాయత్రి అతన్ని చూసింది. దీప కాంతిలో అతని మొహం ఉజ్వలంగా ప్రకాశిస్తోంది. రెప్ప వేయకుండా తనని చూస్తున్న గాయత్రిని చూసి చిన్నగా నవ్వాడు.

"వెళ్ళండి" అన్నాడు మళ్ళీ!

గాయత్రి నెమ్మదిగా కదిలి వెళ్ళింది అతను చూపిన గదివైపు. కాసేపటికి తల తుడుచుకుంటూ బయటికి వచ్చింది. చీర మాత్రం గట్టిగా పిండి అదే కట్టుకుంది మళ్ళీ!

ఆమెను చూడగానే అతను ఫ్లాస్కులో టీ కప్పులోకి వంచి అందిస్తూ "మీ పేరు" అనడిగాడు.

"గాయత్రి!" అంది. తెల్లటి ఆమె మొహానికి నల్లటి పొడవాటి జుట్టు మరింత అందాన్నిస్తోందనిపించింది. బొట్టులేకపోవడం చూసి గబగబా వెళ్ళి విభూది పండు తెచ్చి ఇచ్చాడు!

అది నుదుటన పెట్టుకోవటానికి సందేహించింది గాయత్రి.

"సారీ! కుంకుమ లేదు" అన్నాడు ఇబ్బందిగా. చిన్నగా నవ్వి విభూతితో బొట్టు పెట్టుకుంది.

ఆమె మరింత అందంగా, పవిత్రంగా కనపడింది అతనికి. గాయత్రి మౌనంగా ఇంటినంతా పరిశీలిస్తూ, తనకుదూరంగా టేబిల్‌మీద పరచివున్న కాగితాలమీద దృష్టి నిలిపింది.

"కూర్చోండి గాయత్రీ!" అన్నాడతను.

గాయత్రి టేబిల్ ముందున్న రెండు కుర్చీల్లో ఒకటి ఇవతలికి లాగి కూర్చొంది .. టేబిల్‌మీద రాసివున్న కాగితాల్లో ఒకటి చేతిలోకి తీసుకుని చూసింది. అప్పుడర్థమయిందామెకు అతను 'రచయిత' అని.

పక్కకుర్చీలో కూర్చోబోతున్న అతన్ని "మీరు కథలు రాస్తారా!" అని అడిగింది ఆశ్చర్యంగా.

అవునన్నట్టుగా తలూపాడు నవ్వుతూ.

"మీ పేరు."

"శ్రీకాంతన్! నేను తమిళియన్ని. నేను పుట్టి పెరిగిందికూడా ఇక్కడే.

నా తల్లిదండ్రులు చనిపోయిన తర్వాత ఉద్యోగాన్వేషణలో తిరుగుతూ విశాఖపట్నంలో ఉన్నాను ఒక సంవత్సరంపాటు. అప్పుడు తెలుగు నేర్చుకున్నాను మా ఫ్రెండ్ దగ్గర. ఇది ఆరేళ్ళ నాటి సంగతి. అక్కడ నా కెలాంటి జాబ్ రాలేదుకానీ, తెలుగులో మంచి కవితలు రాయగలననే పేరు మాత్రం వచ్చింది. అక్కడ గజిబిజి వాతావరణం నాకు సరిపడక తిరిగి వచ్చేశాను తర్వాత ఇక్కడే ఒక జూనియర్ కాలేజీలో లెక్చరర్‌గా జాబ్ వచ్చింది.

నేను ఒంటరివాణ్ణి. ఈ సమాజానికి అంగీకారమైన విలువల్ని ఆధారంగా చేసుకుని







నాలో భావాలని, నా మనోద్రేకాల్ని ... ప్రజలు వాటిని అర్థం చేసుకోగలిగేలా ఎన్నో రచనలు చేసి వారినుంచి వచ్చే పొగడ్తలతోనూ, తిగడ్తల తోనూ కాలక్షేపం జరిగిపోతుంది. రమణ మహర్షి ధ్యానంలో కావలసినంత మనఃశ్శాంతి దొరుకుతుంది ఇంకేం కావాలి జీవితానికి.

తెలుగంత బాగా రాకపోయినా .. తెలుగు భాష అంటే నాకు ఎంతో యిష్టం అందుకే తెలుగులో కూడా మంచి రచనలు చేయాలని పించింది. ఆ ప్రయత్నంలోనే కూర్చున్నాను. ప్రారంభించగానే మీరు తలుపు తట్టారు.

మీ కట్టు బొట్టు చూసి మిమ్మల్ని కాస్త ఆలస్యంగా తెలుగమ్మాయిగా ఊహించి మీతో తెలుగులో మాట్లాడాను. నా ఊహ నిజమే అయింది.

మరి మీ రెవరు ? ఇక్కడ ఎంతకాలం నుంచీ ఉంటున్నారు ? మీరేం చేస్తుంటారు?'' వేగంగా అతనడిగిన తీరుకు గాయత్రికి నవ్వొచ్చింది.

ఆ ప్రశ్నలతో ఆమె గుండెల నెవరో పిండుతున్నట్టు ఏదో బాధ ఆమెకు తెలియకుండానే రగులుకుపోతోంది. మరచిపోవాలనుకుంటున్న జ్ఞాపకాలు తిరిగి రేగినట్లయ్యాయి. గాయత్రి చెంపలమీద కన్నీరు ధారలు కడుతున్నాయి.

దుఃఖంవల్ల వణికే గొంతుతో, "నేనొక అభాగ్యురాలిని'' అంది.

శ్రీకాంతకవేమీ అర్థంకాలేదు. ఏమైంది ఈమెకి ? ఎందుకిలా బాధపడుతుంది ? అనుకున్నాడు.

గాయత్రి కుర్చీలోంచి లేచి ప్రక్కనే ఉన్న స్తంభాన్ని ఆనుకుని నిల్చుంది

''ఏమండీ ! మీరు ఎందుకిలా బాధపడుతున్నారో నాకు తెలియటం లేదు. కానీ అర్థం చేసుకోగలను. జీవితంలో ఏ మనిషైనా ఎదురుదెబ్బలు తినటం సహజం. జీవితం ప్రవాహం లాంటిది. ఎప్పటి కప్పుడు మారే స్వభావం ఉంటుంది దానికి. ప్రతిసారీ మారుతున్నప్పుడల్లా భయపడకూడదు. ధీరత్వం లేనివాళ్ళు జీవించడటానికి అనర్హులు'' అతని కంఠం దృఢంగా, స్పష్టంగా ఉంది.

అతని మాటలు గాయిత్రికి మరింత బాధ కలిగించాయి. ఆమె ఏం మాట్లాడలేదు

కొద్ది క్షణాలు మౌనంగా గడిచాయి.

ఆమె ఏమైనా మాట్లాడుతుందేమోనని అతను మౌనంగా ఉండిపోయాడు. అతని అంచనా నిజమే అయింది.

''శ్రీకాంత్ !'' అని పిలిచింది ఆమె స్వరంలో దిగులు ...

కళ్ళు పెద్దవిచేసి చూసాడు అతను.

''శ్రీకాంత్ ! నా అనుభవాలు, అనుభూతులు కన్నవారికీ, చుట్టూ సమాజానికి పణంగా పెట్టటంతో అవన్నీ చేదు నిజాలుగా మిగిలి నా బ్రతుకును కాటేశాయి. నా జీవితంలో కొన్ని ఘట్టాలు వినండి, చెప్తాను'' అంది.

వాన వెలసి వాతావరణం ప్రశాంతంగా ఉంది. అప్పుడే తెల తెల వారుతుంది. ఆ ఏకాంత సమయంలో గాయత్రిలో ఎన్నో జ్ఞాపకాలు కళ్ళ ముందు కదిలాయి. అందమైన అనుభవాలు .. భాషకందని భావాలు . తరంగాల్లా ఎగిసిపడుతున్నాయి. ఆ ఆలోచనలు నిండిన ఆమె హృదయం పరవశంతో నిండినా మరుక్షణమే వేదన అలముకుపోయింది.

గాయత్రి తన గురించి చెప్పటంలో మునిగిపోయింది

* * *

తూర్పు దిక్కున వెలుగురేఖ పొడిచేవరకూ గాయత్రి శ్రీకాంతన్ సంభాషిస్తూనే ఉన్నారు. ఆ మూడు నాలుగ్గంటల పరిచయంలోనే శ్రీకాంతన్ పట్ల మంచి అభిప్రాయం ఏర్పడింది గాయత్రికి. అశాంతితో రగిలిపోతున్న ఆమె మనసును ... నిర్మలమైన అతని మాటలు, ఆదరణతో నిండిన అతని చూపులు స్వాంతన పరిచాయి.

గాయత్రి చెప్పటం ఆపి అచేతనంగా నిలబడిపోయింది. వారిద్దరి మధ్యా నిశ్శబ్దం పరుచుకుంది.

ఆ నిశ్శబ్దంలో భరించలేనంత ఒంటరితనం ఒక్కసారిగా తనని ఆవరించినట్లు ఫీలయింది గాయత్రి.

''చూడండి గాయత్రీ ! జీవితం చాలా విచిత్రమైనది క్షణ క్షణానికీ తీవ్రమైన కదలిక వుంటుంది. నిజంగా ప్రేమ పొందాలనే ధ్యాస ఉంటే ఎలాంటి త్యాగమైనా చేయగలగాలి అప్పుడే ప్రేమలోని గొప్ప వీణారవం వినపడుతుంది'' అని క్షణమాగి మళ్ళీ అన్నాడు.

''గాయత్రీ ! మీ రభ్యంతరం లేకపోతే ఈ యింట్లో ఉండవచ్చు. ముందు మీ మనసుకి కాస్త శాంతి లభించనీయండి. భవిష్యత్తు గురించి తర్వాత ఆలోచిద్దాం ! ఇక్కడి వాతావరణం చాలా ఆహ్లాదంగా ఉంటుంది ఇలా బైటకురండి'' అంటూ తలుపుతీసి బైటకి నడిచాడు.

గాయత్రి అతన్ని అనుసరించింది.

"అటు చూడండి గాయత్రీ !'' అంటూ చూపుడు వేలితో అల్లంతదూరంలో ఉన్న రమణాశ్రమాన్ని చూపిస్తూ,అదిగో ఆ కనిపించే భవనమే ఆశ్రమం. ఆ ఆశ్రమం ఎదురుగా చిన్న డాబా కనిపించటంలేదూ, అది నా గురువు, స్నేహం.. తెలుగువాళ్ళకు గొప్పకవి... అయిన చలంగారి యిల్లు'' అన్నాడు.

ఆశ్చర్యంగా పెద్ద పెద్ద కళ్ళతో ఆ యింటికేసి చూసింది

''ఇటు చూడు గాయత్రీ !'' అని ఆగి ఏదో గుర్తువచ్చినవాడిలా అన్నాడు. ''ఏకవచనంలో పిలుస్తున్నందుకు గాయత్రి నన్ను క్షమిస్తుందికదా !'' అన్నాడు

''ఫర్వాలేదు పిలవండి'' అంది నవ్వుతూ

''థాంక్యూ ! చుట్టూ ఈ కొండలు, చెట్లు ఎంత బావున్నాయోకదూ ! ఆ తూర్పు కొండలమధ్యనుంచి సూర్యుడు బైటకి వస్తున్నప్పటి దృశ్యం చూస్తుంటే మనసులోని చీకటి పూర్తిగా తొలగిపోయినట్లనిపిస్తుంది. గాయత్రీ! ఇంత అందమైన ప్రకృతిని ఆస్వాదించటంలో కలిగే ఆనందం ఇంక నాకెందులోనూ కనిపిం




చదు. అందుకే నేనిలా ఒంటరిగా బ్రతగ్గలుగుతున్నాను'' అన్నాడు మందహాసంతో.

అతనొక వింతమనిషిలా అనిపించాడు ఆమెకి.

''ఆఁ... గాయత్రీ! నువ్వు స్నానంచేసి రెడీ అయియుండు. నేనిప్పుడే బైటకి వెళ్ళొస్తాను. భయపడకు'' అతని మాటల్లో ఆప్యాయతకు గాయత్రి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి.

శ్రీకాంతన్ ఆమెనుచూసి నొచ్చుకున్నాడు.

''ఎదుకు అప్పిడికవలప్రడాయి. అప్పిడిఆనా, యనకు కొవమా యిరక్కరదు !''

## ఇది మేఘ సందేశమా ..

గాయత్రికేమి అర్థం కాలేదు. పైగా ఆ భాష కొత్తగా, గజిబిజిగా ఉండి నవ్వొచ్చింది.

ఆమె నవ్వు చూసి నాలుక్కరుచుకొన్నాడు.

''ఓహ్, సారీ గాయత్రీ! ఎంతయినా అరవ వాడిని కదా ! ఆ భాషే వస్తుంది. ఇంతకీ నేనేమన్నానో తెల్సా ! ఎందుకలా బాధ పడతావు ... నాకు కోపంగా ఉంటుంది అలా అయితే అన్నాను'' అన్నాడు నవ్వుతూ.

''ఏమో భాష తెలియదు కదా అని తిడుతున్నా చేసేదేముందీ''అంది నెమ్మదిగా నవ్వి.

''ఛ, ఛ .. అలా అనకు, స్వీట్ !'' అన్నాడతను బాధపడుతున్నట్టుగా !

అతను బైటకి వెళ్ళిపోయాడు.

గాయత్రి ఒక్కసారి తనున్న యింటినీ, యింటి ముందు స్థలాన్ని చూసింది. ఆమె ముఖం ఒక్కసారిగా విప్పారింది. దూరంగా ఉన్న ప్రకృతి అందాలు చూస్తూ, యింటి ముందున్న రకరకాల పూల మొక్కల్ని చూడనేలేదు. అందంగా పెరిగి పువ్వులు బూసి కన్నులకు విందు చేస్తున్నాయి.

మైమరచి ఆ చెట్లను చూస్తున్న గాయత్రికి... తను యింటి దగ్గర ప్రేమగా పెంచుకుంటున్న గులాబీ తోట గుర్తుకొచ్చింది. ఒక్కొక్క జ్ఞాపకం మనసులో ముసురుకోసాగాయి. తిరిగి ఆమె పరిస్థితి యధాస్థితికి వచ్చేసింది. ఆ చెట్ల మధ్యనే కూర్చుండి పోయింది దిగులుగా !

* * *

గాయత్రి వచ్చి నెల రోజులు గడిచిపోతున్నా శ్రీకాంతన్‌కి ఆమెతో అంత చనువు ఏర్పడలేదు. కానీ గాయత్రి పట్ల అతని ఆలోచనలకు ఒక స్పష్టత ఏర్పడింది. ఆమె మంచి మనిషిగా, ఆమె అణుకువతనం, గాంభీర్యం అతనికి అభిమాన గుణాలైనాయి. గత స్మృతుల నీడల నుంచి ఆమెను తప్పించటానికి అతను సున్నితంగా ప్రయత్నించేవాడు.

ఉదయం నిద్ర లేవగానే యిద్దరూ కొండ అంచుల వైపు చాలా దూరం నడక సాగించటం వారి దినచర్యలో ఒక భాగమైపోయింది. శ్రీకాంతన్ కాలేజీకి వెళ్ళబోయే ముందు ఆశ్రమానికి వెళ్ళి రాకపోతే అతని మనసేమిటో అశాంతిగా అనిపిస్తుంది. అతనితోపాటు గాయత్రి కూడా అప్పుడప్పుడూ వెళ్తూండేది. ఆశ్రమ వాతావరణం ఆమెకు ఎక్కడలేని ప్రశాంతతని కలుగజేసేది. కానీ ఆ ప్రశాంతత ఆ వాతావరణంలో ఉన్నంతవరకే! బైటికివస్తే ఆమె పరిస్థితి మామూలైపోతుంది.

శ్రీకాంతన్... కాలేజీ నాలుగు మైళ్ళ దూరముండటంవల్ల ఉదయం వెళ్తే సాయంకాలం వచ్చేవాడు. అప్పటివరకూ గాయత్రి వంటరితనం పోగొట్టటానికి ఆమెకి తన బుక్ షెల్ఫ్ చూపించాడు అందులో ఎన్నో.. గొప్ప రచయితల ఇంగ్లీషు రచనలు. మరికొన్ని తమిళం. చాలా తక్కువగా తెలుగు పుస్తకాలు అమర్చబడి ఉన్నాయి. గాయత్రి ఎక్కువగా షేక్స్‌పియర్, టాగూర్, చలం పుస్తకాలతో పగలంతా కాలం గడిపేది.

ఎంత ఆసక్తిగా ఆమె పుస్తకాలను చదువుతున్నా ఉన్నట్టుండి. . ఎక్కడో లోలోపల్నించీ పొంగుకొచ్చే ఉద్విగ్నత ఆమె మనసును తట్టి లేపుతుండేది. తన ప్రేమకు ఆధారబిందువు .. జీవమైన సురేంద్ర ఎందుకో... మబ్బుల్లో మెరుపులా తళుక్కున మెరిసి మాయమయ్యాడు. నిరంతరం నిత్యనూతనంగా చలించే ఆ స్పందన




## టి. ఎస్. ఎస్. - రామాయంపేట

మా అమ్మగారు ఆహారం తీసుకొంటే జీర్ణం కావటంలేదు. గోధుమ చపాతీ ఒకటి తీసుకొంటే జీర్ణం అవుతుంది. ఒకవేళ రెండు చపాతీలు తీసుకున్నట్లయితే ఆ రోజు కడుపు ఉబ్బరంతో చాలా బాధ బాడుతూ ఉంటుంది.

★ బేరియం మీల్ సీరీస్ అనబడే ఎక్స్‌రేలు తీయించి వైద్యులకి చూపించండి. శస్త్ర వైద్యులవద్ద కడుపు భాగాన్ని పరీక్షింప చేసుకోవటం అవసరం. చిన్నప్రేవుల మొదటిభాగంలో అవరోధం ఏర్పడినా, కడుపులో(స్టమక్) 'కండ' పెరిగినా, అసలు కడుపు రోగగ్రస్తమయి బాగా ముకుళించుకుపోయినా ఇలా జరిగే అవకాశం ఉంటుంది.

## ఎస్. ఎస్ - అల్లూరు

నా వయస్సు 45 సం.లు ఇంటర్‌కోర్సు సమయంలో నా పురుషాంగము కొద్దిసేపు నిటారుగా ఉండి ముడుచుకొని పోతుంది. ఇంటర్‌కోర్సు సమయంలో పురుషాంగిము ఎక్కువసేపు నిలిచి ఉండాలంటే ఏమి చేయాలి ?

★ వయస్సుమీరిన కొద్దీ జననేంద్రియాల పటుత్వం కొంతమేరకు తగ్గటం సహజం. లేపనశక్తి మానసిక ప్రవృత్తుల మీద, హార్మోనుల ప్రభావం మీద, స్త్రీ పురుషుల వయస్సులోని తారతమ్యాల మీద ఆధారపడి ఉంటుంది.

టెస్టోస్టిరాన్ మాత్రలు వాడిచూడండి. ఈ మాత్రలను ఎక్కువరోజులు వాడటం వల్ల కొన్ని అవాంతరాలేర్పడే అవకాశం ఉంటుంది.

## ఎస్. డబ్ల్యు - మద్రాసు

బీజముల ఇరువైపులా నరాలు దిగితే దానికి ఆపరేషన్ అవసరమా ? లేక మందులతో నయం అవటానికి అవకాశం ఉందా ?

★ మీరు వ్రాసినదాన్నిబట్టి "హెర్నియా" అని తోస్తున్నది. హెర్నియా వచ్చినప్పుడు ఆపరేషన్ ద్వారా చికిత్స చేయించుకోవటం మంచిది. మందులేవీ ఈ రోగానికి పనికిరావు. కొన్ని సందర్భాలలో బెల్టులు వాడే అవకాశం ఉంటుంది. కాని వాటివల్ల నిరంతర లాభం ఉండకపోగా కొందరికి వాటివల్ల కొన్ని ఇబ్బందులు, అవాంతరాలు ఏర్పడే అవకాశం ఉంటుంది.

## కె. ఎం. వి హెచ్. - యాదికి

నా వయస్సు 19 సం॥లు. నేను చాలా బలహీనంగా ఉన్నాను. నాకు ఎప్పుడూ జలుబుగా ఉంటుంది. అస్తమానమూ చీమిడి నీరు మాదిరిగా కారుతూ ఉంటుంది. ఇలా రావటానికి ఈస్నోఫీలియా కారణం అని డాక్టర్లు చెప్పారు?

★ దీనిని క్రానిక్ పెరాక్సిస్మల్ రైనోరియా అని అంటారు. ఇటువంటి వారికి కొన్నేళ్ళపాటుగా ఈ లక్షణం ఉంటుంది. కొందరికి దాదాపు జీవితాంతం ఈ లక్షణం ఉండే అవకాశం ఎక్కువ. కొందరికి దుమ్ము, ధూళి మొదలయిన వాటివల్ల ఏర్పడే అలర్జీ మూలంగా ఇలా వస్తుంది.

విటమిన్ 'సి' మాత్రల వాడకం, అధికంగా ఉన్నప్పుడు అవిల్, పిరిటాన్ మొదలయిన మందులు వాడటం మాత్రమే వేయగల చికిత్స.

## ఎస్.ఎస్ ఆర్ .- చినగుమ్మలూరు

నా భార్యకి 10 సం.ల క్రితం మైట్రల్ స్టినోసిస్‌కి వాల్వ్యాటమీ చేశారు. వారానికి రెండు రోజులు ఎసిడ్రెక్స్ మాత్రలు వేయమన్నారు. ఉప్పు వేసుకోకూడదన్నారు. 10 సం.లుగా అలాగే చేస్తున్నది. ప్రస్తుతం ఆదుర్దా చెందినా, కోపంగా మాట్లాడినా ఆయాసం వచ్చి, గుండె వేగంగా కొట్టుకుంటుంది. ఈ మందులు వదలకుండా వాడవచ్చా రెండు మూడుసార్లు కె. జి. హెచ్‌కి వెళ్ళి అడిగితే అవే వాడమన్నారు తర్వాత వెళ్ళటం మానివేశాము.

★ అక్కడే మరలా టెస్టు చేయించుకోవటం అవసరం. ఎసిడ్రెక్స్ మాత్రలను నిరంతరంగా వాడవలసిన అవసరం లేదు బ్లడ్‌ప్రెషర్ ఉన్నదేమో పరీక్షింపచేసి, తగిన మందులు వాడటం అవసరం మల్వ్యాటమీ తర్వాత మైట్రల్ రీగర్జిటేషన్ ఎక్కువగా ఉందేమో పరీక్షింపజేయండి. ●

---

తనకు మహదానందాన్నే కలుగజేస్తుంది కానీ... ఇలా ఎంతకాలం ?

అతని ప్రేమ నంతటినీ హృదయంలో నింపి, తనకు సమర్పిస్తే ... తను అతనికి మిగిల్చింది ఏమిటి ? తనని క్షమిస్తాడా అతను ? ఎలా ఉన్నాడో ! తన కోసం ఎంతగా అలమటిస్తున్నాడో ! తనిట్లా వచ్చేయటం వాళ్ళందరిలో ఏలాంటి భావాలను రేకెత్తిస్తుందో ! ఒకవేళ తను చచ్చిపోయిందనుకోవటం లేదుకదా !! ఆ ఆలోచన ఆమె హృదయాన్ని కంపింప చేసింది.

తన తండ్రి తన నెంతగా అసహ్యించుకుంటున్నాడో ! తన మీద కోపం ... ఆయనలో రగిలిపోతుంటుంది ! తను చేసింది తప్పో, వప్పో కూడా తేల్చుకోలేక పోతుంది తను. అయినా తనెంత తెలివితక్కువది, తన గురించి తనకు పూర్తిగా తెలుసా అసలు ? తనకేం కావాలో తను స్పష్టంగా నిర్ణయించుకోలేదు. కోరుకున్న దాన్ని పొందలేని అధైర్యవంతురాలు' అలాంటి ఆలోచనలతో గాయత్రి మరింత కృంగిపోతుంది.

ఏది ఏమైనా శ్రీకాంత్‌న్ సహచర్యం, అతను చూపే స్నేహపూర్వక ఆదరణ ఆమెకు కొంత అనునయాన్ని కలుగజేస్తున్నాయి.

"గాయత్రీ!" ఎదురుగా చేతులు కట్టుకుని, గోడ కానుకుని నింపాదిగా తననే చూస్తున్న శ్రీకాంతన్‌ని చూసి కంగారుగా లేచి నిలబడింది.

సన్నటి ఫ్రేం కళ్ళద్దాల్లోంచి చురుగ్గా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

అయిదు నిముషాల సేపు అతను అలాగే నిలబడి చూసాడు.

గాయత్రి ఇబ్బందిగా పెట్టింది ముఖాన్ని.

ఒక్కసారిగా పకపకా నవ్వాడతను.

అర్థంకాని దానిలా అతన్ని చూసింది. అతనంత గట్టిగా నవ్వటం ఇదే మొదటసారి ఆమె చూడటం.

"ఎందుకలా నవ్వుతున్నారు" అంది నెమ్మదిగా.

"ఎందుకో నవ్వాను. నాకే తెలియదు" అన్నాడు.

అతనక్కడి నుంచి కదలి టేబుల్ మీాద ఫ్లాస్క్‌లో టీ కప్పులోకి వంచుకుని, "గాయత్రీ! అలా షికారెళ్దాం. రాకూడదూ !" అన్నాడు.

గాయత్రికి వెంటనే వెళ్దామని చెప్పాలనిపించింది. ఈ రోజెందుకో ఆమెకు మాటిమాటికీ తన వాళ్ళంతా గుర్తుకు వస్తున్నారు.

( ఇంకా వుంది )




''ఏం వండీ...''

''ఊం...''

''మరేమో... మన పక్కింటి సుబ్బలక్ష్మి లేదూ... క్రొత్త షిఫాన్‌చీర కొనుక్కుందండీ, అదెంత బావుందంటే...''

సుజాత కళ్ళలోకి చూసాడు శ్రీపతి.

బెడ్‌లైట్ అందించేకాంతిలో అమావాస్య లోని తారకల్లా అగుపించాయి సుజాతకళ్ళు.

''నిజమండీ... మీరు చూళ్ళేదుగానీ... అంత అందగత్తె గాకపోయినా సుబ్బలక్ష్మి ఆ చీరెలో ఎంత అందంగావుందో !...'' — ఆ'ఎంత' అనే పరిమాణాన్ని సుజాత కళ్ళలోంచి, గొంతులోంచి ఈజీగా పసిగట్టేసాడు శ్రీపతి.

''అలాగా...''— శ్రీమతి బుగ్గల్ని సుతారంగా నిమిరాడు.

''మరేనండీ... ఆ చీరెలో ఆ సుబ్బలక్ష్మి అంత అందంగావుంటే...''

వాక్యాన్ని పూర్తిచేయక వదిలేసింది. అలా వదిలేయడంలో తను గొప్ప అందగత్తెననేభావం స్పష్టంగా ధ్వనించింది.

''నువ్వు అప్సరసలావుంటావు— రేపు తప్పక కొనేద్దాం...''

శ్రీపతి ఆరువందలు సంపాదించే గుమాస్తాయేకావచ్చు— ఆ షిఫాన్‌చీరె ఆతని ఆర్థిక స్థితికి ఆవలిగట్టునే వుండవచ్చు— అయినా ఆ టైంలో ప్రక్కనున్న శ్రీమతితో ఆ మాట అనక తప్పిందికాదు. దాని క్కారణం 'రాత్రి'కావచ్చు, 'బెడ్ లైట్' కాంతికావచ్చు, అంత కంటే తన భార్య 'అందం'కావచ్చు.

భర్తమాటలువిన్న సుజాత, గులాబిరేకుల్లా వున్న తన లేత పెదాలపైనవుంచిన శ్రీపతి మునిపంటిని రెస్పాన్సిచ్చి 'రిసీవ్' చేసుకుంది.

సుజాతతో శ్రీపతి పెళ్ళయి నాలుగు నెల్లయింది.

* * *

''ఏం వండీ... ఈ చీరెపైన ఈ నెక్లెస్ బావుందిగదండీ...''

సాయంత్రం శ్రీపతి ఆఫీసునుండి రాగానే వరండాలోకే ఎదురువచ్చి అడిగింది సుజాత.

నెక్లెస్‌చూసిన శ్రీపతికి సుజాత తను స్వయంగా కొనేసిందేమోనని భయంతోకూడిన అనుమానం కలిగింది.

''మీ ఫ్రెండ్‌దా సుజీ... ఆ నెక్లెస్, బావుంది...''

''ఫ్రెండ్ సరోజలేదూ... అది షాపింగ్‌కి వెళ్తూ నన్నూ తోడు రమ్మందండీ... తను ఇలాంటిదే తీసుకుంటూ నన్నూ తీసుకొమ్మంది. మా వార్నడిగి వీలైతే తర్వాత తీసుకుంటానని చెప్పానండీ... 'అన్నయ్యగారికి నేను చెపుతానులే. డబ్బులు ఫస్టుకు ఇవ్వొచ్చు. కొత్త డిజైన్ అందులో స్టాకుకూడా లేవు' అంటూబలవంతాన

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.

Colgate DENTAL CREAM

Colgate

STOPS B

కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E B82 86 TL

కొనిపించిందండీ, మూడొందలే.... ధర తక్కువయినా బావుంది కదండీ... సరోజ చాలా తెలివైందండీ... తక్కువ ధరలో మంచివి సెలెక్టు చేస్తుంది. ''

భర్త కళ్ళలోకి చూసింది సుజాత.

చెప్పనని ఆ కళ్ళలో అసహనం వుందో, అసమర్థత వుందో తెలియదుగాని సుజాతకు మాత్రం కొద్దిగా కోపం కనిపించింది.

''మీకిష్టం లేకపోతే చెప్పండీ... వాపసు ఇచ్చేద్దాం. దుకాణం వాడికి ముందే చెప్పాను. ఇలాంటివి మావారికి నచ్చవు, ఒకవేళ తిరిగి ఇచ్చేస్తే తీసుకోవాలీ అనీ...''

శ్రీపతి మాట్లాడేందుకు గొంతురాలేదు.

చేతిలోని ఫైళ్ళ కట్టతో లోనికి భారంగా అడుగులు వేసాడు.

* * *

''ఇంత ఖరీదైన కాస్మాటిక్సూ, మేకప్ సామాను ఇప్పుడే మవసరం సుజీ...''

అదే నెలలో ఇంట్లో హఠాత్తుగా కనిపించిన ఖరీదైన మిర్రరూ, మేకప్‌సెట్టూ చూసి అడిగాడు శ్రీపతి ఆరోజు.

బుంగమూతి పెట్టడమేకాదు బుజ్జిపాపాయిలాగే అంది సుజాత — 'ఒక్కొక్కటీ సమకూర్చుకోకపోతే ఎలాగండీ' అని.

''అలాగని ఒకేసారి కొనెయ్యడమేనా .. గ్రాడ్యుయేటువయినా ఇంకా జ్ఞానం వచ్చిచావలేదు. . ఛ.. ఛ .''

''నా మొగానికి ఈ మేకపు సామానొద్దు.. ఈ చీరెలూ, నెక్లెసూ వద్దు, కొట్టువాడికి తిరిగి పంపించెయ్యండి... ఆకలైతే ఇంత తిని దరిద్రపు దేవతలా ఓ మూల పడివుంటాను. .''

ఉరుములా ఉరిమింది... ఆపైన వానలా కన్నీరు కార్చింది సుజాత.

శ్రీపతి తగ్గాడు... తప్పిందికాదు.

''అదికాదు సుజాతా.. ఈ నెలలోనే చీరె కొన్నావు, నెక్లెసు కొన్నావు, ఆపైన ఈ సామాను... నీకు తెలును... నా జీతం ఆరొందలని, దాంతోనే నెలంతా గడిచేదని. కావాలనుకుంటే వచ్చే నెలలో కొనుక్కునేవాళ్ళం...''

సుజాత విసురుగా లోనికెళ్ళింది.

ఆ రోజు రాత్రి శ్రీపతి బుజ్జగించి తన వేపు త్రిప్పుకొనేవరకూ కోపాన్నే అభినయించింది ఆవిడ.

* * *

నెల చివర్లో ... ఆబిడ్స్‌లోని షాపులో ...

''ఏమండీ ... ఈ ప్యాంటు పీసు మీకు చాలా బావుంటుందండీ...''

''వద్దులే సుజాతా ... తర్వాత కొనుక్కుందాం ... ''

''మీకున్నవే రెండు ... తీసుకోండి. మా సరోజ రిలెటివ్సే ఈ షాపు యజమాని, తర్వాత డబ్బు కట్టొచ్చు. కదూ సరోజా ...''

# ''సుజాత ది గ్రేట్ !

ప్రక్కనున్న సరోజ వేపు తిరిగింది సుజాత. సుజాత భర్తతో షాపింగ్‌కు వస్తూ సరోజనూ వెంట తీసుకవచ్చింది. సరోజ సెలెక్షన్ బావుంటుందని సుజాత నమ్మిక.

''అవునండీ ... వెరైటీగా వుంది ... తీసుకోండి'' సరోజ రెట్టించింది.

శ్రీపతిలో అభిమానం మేల్కొంది. అవుననక తప్పలేదు. సరోజను వెంట తీసుక వచ్చినందుకు మనస్సులో సుజాతను తిట్టకా తప్పింది కాదు.

''సుజాతా ... ఈ బ్లాక్ పీసు చూసావూ ... ఫుల్ పాలిష్డ్ ! నిన్ననే వచ్చాయట. నీ బాడీ కలర్‌కు చక్కగా సూటవుతుంది—తీసుకో. నేనూ ఒకటి తీసుకుంటున్నాను ... ''

సరోజ మాటలకు సుజాత భర్త మొగంలోకి చూసింది. సరోజపై లోలోన నిప్పులు కక్కుతున్నా మొగంపైన మాత్రం చిరునవ్వును పులుముకున్నాడు, సుజాతపై ప్రేమ వొలకబోసాడు.

''తీసుకో సుజీ...''

శ్రీపతి మాటలకు సుజాత మొగంలోకి దీపావళి వచ్చి నిల్చింది. డోర్ కర్టన్సంటూ, విండో కర్టన్సంటూ ఆరోజు బిల్లును అయిదొందలకు పెంచింది సుజాత.

షాపునుండి అసహనంగా కదిలాడు శ్రీపతి.

ఇంట్లోకి అడుగు పెట్టిగాని మూడోకన్ను తెరవలేదు.

సుజాత కళ్ళు సముద్రాలయ్యాయి.

ఆ రోజు ఎవ్వరూ ఎంగిలిపడలేదు — రాత్రి పదకొండు దాటింది.

కోపంతోనే నిద్రలోకి జారుకుంది సుజాత

ఆమె మొగంలోకి చూసాడు శ్రీపతి. నిర్మలంగా వుంది, అమాయకంగా వుంది. అంతకంటే సున్నితంగా వుంది. ''ఇంత సుకుమారమైన మనస్తత్వం పైనేనా తను చేయి చేసుకుంది'' తనను తనే నిందించుకున్నాడు శ్రీపతి.

''తమ ఇద్దరి మధ్యా కలహానికి కారణం చాలీచాలని తన జీతం! దాంతో సుజాత తను సుఖపెట్టలేక పోతున్నాడు. అందుకే ...'' ఓ నిర్ణయానికొచ్చాడు శ్రీపతి — అప్పటికిగాని అతని మనస్సు తేలికపడలేదు.

* * *

తెల్లవారింది.

''సుజీ... నీకు గుడ్ న్యూస్ ...''

ఏమిటన్నట్టు చూసింది సుజాత.

''నెల్రక్రితం నీకొచ్చిన ఉద్యోగానికి జాయినింగ్ డేటు ఇంకా వుందా ...''

''గడువయి పోయింది గాని రెక్వెస్టు చేస్తే జాయిన్ చేసుకోవచ్చునేమో.. అవునూ ఇప్పుడెందుకండీ ఆ వుద్యోగం గురించి, అప్పుడు జాయినవ్వడం వద్దన్నారు గదా . ''

''రేపు వెంటనే వెళ్ళి జాయినింగ్ రిపోర్టిచ్చెయ్ .. ''

''నిజంగా ! .''

ఆశ్చర్యం, ఆనందం — ఈ రెండూ కలిసాయి సుజాత గొంతులో. ''అవును సుజీ ... నా ఒక్కడి జీతంతో మనం హాయిగా ఉండలేక పోతున్నాం. నీ కోరికలూ, నీ అభిరుచులూ నీకున్నాయి ఆర్థిక ఇబ్బందుల మూలంగా మన మధ్య కలహాలు రాకూడదు.''

''మెనీ మెనీ థ్యాంక్సండీ.. '' కాఫీ కప్పును ప్రక్కనబెట్టి తన బుగ్గపై ఒక ముద్దిచ్చి సిగ్గుతో లోనికి పరుగెత్తే 'సుజీ'ని చూసి హాయిగా ఊపిరి పీల్చాడు శ్రీపతి.

* * *

''హలో సరోజా.. గుడ్ న్యూస్ ! మావారు నా ఉద్యోగానికి గ్రీన్‌సిగ్నలిచ్చారు...'' ఆ సాయంకాలం సరోజ ఇంటికెళ్ళింది సుజాత.

''రియల్లీ ! కంగ్రాచ్యులేషన్స్ ... అయితే మన ప్లాను సక్సెసన్నమాట.''

''కాని... నాకు మాత్రం బాధగా వుందే.. మా వారిని మోసం చేసానేమోనని ...''

''ఇందులో మోసం ఏముందే... మీ వారి మనస్సు మార్చడం కొరకు చూసినవన్నీ కొంటానన్నావ్ .. గెల్చావు... ఏది చేసినా మీ ఇద్దరి సంతోషానికే గదా. . మొత్తానికి సాధించావు...''

''పోవే... నాటకంలో అసలు పాత్రధారి నువ్వేకదా...''

కలసినవ్విన వీరి నవ్వుల్లోంచి పన్నీజాజులు కురిసాయి.



## ఇంటి పెత్తనం స్త్రీలదే!

జపాను స్త్రీలు సున్నిత మనస్కులనీ మంచీ మర్యాద తెలిసినవారని విదేశీయుల అభిప్రాయం. ఆ సంగతి ఎట్లా ఉన్నప్పటికినీ, ఇంటి పెత్తనం మాత్రం గృహిణులదే. ఇంట్లోకి ఏమేమి కొనాలీ, చదువులకెంత ఖర్చుపెట్టాలీ, ఎంత పొదుపు చేయాలీ మొదలైన విషయాలలో స్త్రీలదే తుది నిర్ణయం, జపానులో ఉద్యోగంచేసే మహిళల సంఖ్య పెరుగుతున్నది. దాంతో స్త్రీల గౌరవ మర్యాదలు కూడ పెరుగుతున్నాయి. అనేక వ్యాపార సంస్థలలో స్త్రీలను నియమించటం ఆర్థికంగా లాభకరంగా ఉంటున్నది. విద్యారంగంలోకూడా స్త్రీలు చురుగ్గా పాల్గొంటున్నారు. ఎటొచ్చీ, రాజకీయాలలో స్త్రీలు పాల్గొనే అవకాశం కన్పించటం లేదు !

BONDED LEAD HB * 621 * NATARAJ * H.P.P.LTD.

## పెన్సిళ్ళన్నీ ఆకారానికి సమానమే
## కాని ఈ రకం మట్టుకు దీర్ఘకాలం వ్రాస్తాయి.

# నటరాజ్ పెన్సిళ్ళు

గ్యారంటీ : చెక్కుతున్నప్పుడు విరగదు.
ఎందుకంటే, దీని "బాండెడ్ లెడ్", మిగిలిన వాటి కంటె ధాటీగా పని చేస్తుంది. మరి పెన్సిల్ ఎంత తక్కువ విరిగితే అంత ఎక్కువ కాలం మన్నుతుందన్న విషయం మీకు తెల్సుకదూ !




గ్యారంటీ: అతి మృదువుగా, అతినల్లగా వ్రాస్తుంది.
ఎందుకంటె, నటరాజ్ అసమానమైన లెడ్ ఫార్ములా కలిగివుంది. మైక్రొనైజ్‌డ్ గ్రాఫైట్ మరియు క్లేల మిశ్రమము.
ఇంకా, అతి ప్రత్యేకమైన శ్రేణిలో అప్సరా పెన్సిళ్ళు ! రాయుటకు, రంగులు వేయుటకు, డ్రాయింగుకు మరియు గ్లాస్ మార్కింగ్ ల కొరకు.

# నటరాజ్ దీర్ఘజీవంగల పెన్సిళ్ళు

హిందుస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM/4080/TL

సీరియల్

# జీవన్మృతులు

## ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

## స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



*(గత సంచిక తరువాయి)*

### డాక్టర్ సెవార్డు డైరీ :

అక్టోబర్ 11 (సాయంత్రం) : జరిగిన విషయాలు డైరీలో రాయమని జోనాథన్ నన్ను అడిగాడు. అతను రాసే స్థితిలో లేడట.

సూర్యాస్తమయ సమయానికి కొద్దిగా ముందర, మేం అందరం మినాను చూసాం. ఆ సమయంలో ఆమె చేష్టలు మాకు అలవాటయిపోయినయి. సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్లో ఆమెలో ఒక వింతయైన స్వేచ్ఛ ఏర్పడుతున్నట్టు గమనించాం. ఆ సమయంలో ఆమెను శాసించే శక్తి ఎవరికీ లేదు. అందువల్లనే ఆమె కొన్ని విషయాలు చెప్పగలుగుతోంది. ఆమెలో ఈ రకమైన మానసిక మార్పు సూర్యోదయానికిగానీ, సూర్యాస్తమయానికిగానీ అర్ధగంట ముందు ఏర్పడుతోంది. ఆ సమయంలో ఆమెలో స్వేచ్ఛ ఎక్కువవుతూ, అర్ధగంట తర్వాత వెంటనే తగ్గిపోతుంది. మౌనంగా వుండిపోతుంది, మైకంలో వున్నట్టుగా.

రాత్రి ఆమెను చూసినప్పుడు ఆమె ఎంతో ఆందోళనకు గురి అయినట్టుగా కనిపించింది. కొద్ది నిముషాల తర్వాత మామూలుగా కనిపించింది. జోనాథన్ని అప్పుడు సోఫాలో తన ప్రక్కన కూర్చోబెట్టుకుంది. అందరం కుర్చీలు దగ్గరకు లాక్కొని కూర్చున్నాం. జోనాథన్ చేతిని తన చేతిలోకి తీసుకుని అంది —

"ఇది మనం స్వేచ్ఛగా మాట్లాడుకునే సమయం. బహుశా చివరిసారిగా కావచ్చు. చివరివరకు మీరంతా నాతోపాటే వుంటారని ఆశిస్తాను." జోనాథన్ ఆమె చెయ్యిని బలంగా తన చేతితో నొక్కిపట్టి వుంచాడు.

"ఉదయం మనం అందరం బయలుదేరుతాం. మనకి ఏమవుతుందో దేవుడికి తెలియాలి. నన్నుకూడా మీతోపాటు తీసుకెళ్ళి నాకు ఎంతో సహాయం చేస్తున్నారు. నాలాంటి నిస్సహాయస్థితిలో వున్న స్త్రీకి మీలాంటి ధైర్యవంతుల అండ వుందని నాకు తెలుసు. నా ఆత్మకు ముగింపు జరగబోతోంది. కాదు, కాదు — ఇంకా సమయం వుంది. అయినా మీరంతా నన్ను రక్షిస్తారు. ఓ విషయం గుర్తుపెట్టుకోండి. నేను మీలాగ మామూలుగా లేను. నా రక్తం విషపూరితమయింది. నా ఆత్మ విషపూరితమయింది. అది నన్ను చంపేస్తుంది తప్పకుండా చంపేస్తుంది, ఎవరైనా వచ్చి రక్షిస్తే తప్ప. నా ఆత్మ బంధింపబడిందని నాకు తెలుసు. ఆ విషయం మీకూ తెలుసు. నాకు విముక్తి కలగాలంటే దానికొక మార్గముంది. కానీ మీరుగానీ నేనుగానీ ఆ మార్గం అనుసరించటానికి వీల్లేదు." అంటూ మినా మా అందరి వంకా వేడుకోలుగా చూసింది.

"ఏమిటామార్గం. మనం అనుసరించకూడని మార్గం ఏమిటది ?" బొంగురుపోయిన గొంతుతో అడిగాడు వాన్‌హెల్సింగ్.

"అది నా మరణం. దుష్టశక్తి నన్ను పూర్తిగా కబళించకముందే, నా అంతట నేనే చచ్చిపోవాలి. లేదా ఎవరైనా చంపాలి. నేను చనిపోయిన తర్వాత నా ఆత్మకు ఎట్లా విముక్తి కలుగుతుందో మీకు నాకు తెలుసు — లూసీ ఆత్మకు విముక్తి కలిగించినట్టుగానే. మీ అందరి మధ్య చనిపోవటానికి నాకు భయంవేయటంలేదు. కానీ నా మరణంవల్ల పని పూర్తికాదు. అయినా మనం చేపట్టినపని జరుగుతుందేమోనన్న ఆశ వుండగా, మరణించడంలో అర్థంలేదు. అందుకని నా అంతట నేను మరణించటం అన్న ఆలోచననుండి విరమించుకుంటున్నాను. ధైర్యంగా చీకట్లో నడవదల్చుకున్నాను" అంది.

జరగబోయే కథకు ఇది ప్రారంభం అని మాకు తెలుసు. అందుకని మౌనంగావున్నాం. జోనాథన్ మొహం కాస్త నల్లబడింది.

ఆమె మళ్ళీ చెప్పటం ప్రారంభించింది.

"నేను చెయ్యగలిగింది అది. మీరేం చేస్తారు ? మీ ప్రాణాలను అర్పించటానికి సిద్ధంగావున్నారు- ఎందుకంటే మీరు మగధీరులుగాబట్టి. ఆ విధంగా మీరు దేవుడ్ని చేరుకుంటారు. తర్వాత నేను ఏమవుతాను ?" ప్రశ్నార్థకంగా అందర్నీ చూసింది, ఒక్క జోనాథన్ని తప్ప. క్విన్సీ ఆమెను అర్థం చేసుకున్నట్టు కనిపించాడు. ఆమె మొహం విప్పారింది" నేను చెప్పనా ? మన మధ్య మొహమాటాలు వుండ

---

**జరిగిన కథ — 34 :** డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్ హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరిస్ మినా గదిలో జోనాథన్ క్రిందపడి ఉండటం చూస్తారు. మినా చేత తన రక్తాన్ని త్రాగిస్తున్న డ్రాకులాను చూసి వీరందరు భయభ్రాంతులవుతారు. వాన్‌హెల్సింగ్ మినాను అసలు ఏం జరిగిందో అడుగుతాడు. ఆమె తనకు జరిగిన భయంకరమైన అనుభవాన్ని చెపుతుంది. రెన్‌ఫీల్డ్ నేలమీద కుప్పలాపడి ఉంటాడు. అతడు మంచంమీద నుంచి క్రిందపడి చనిపోయినట్లు సర్టిఫికేట్ ఇవ్వటానికి నిశ్చయించుకుంటాడు డాక్టరు సెవార్డు. అందరు కలసి పిక డిల్లీలోని డ్రాకులా ఇంటిని వెదకాలని నిర్ణయించుకుంటారు. అందరూ కలసి డ్రాకులా ఇంటిలో ప్రవేశిస్తారు. వాన్‌హెల్సింగ్ జోనాథన్‌కు డ్రాకులా శక్తి, అతను చేసే ప్రమాదాల గురించి చెప్పసాగాడు. డ్రాకులా వీరి కోసం వెతుకుతున్నట్లు మినా టెలిగ్రాం పంపిస్తుంది. డ్రాకులా ఇంటిలోకి డ్రాకులా ప్రవేశించి వీరందరి బారినుండి నేర్పుగా తప్పించుకుంటాడు. మేడమ్ మినా తనను హిప్నటైజ్ చేయమని ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్‌ను కోరుతుంది. డ్రాకులా మిగిలిన పెట్టె, బంగారం, డబ్బుతో ఓడలో పారిపోతున్నట్లు ఆమె ద్వారా కనుక్కుంటాడు వాన్‌హెల్సింగ్. డ్రాకులా ఊళ్ళోంచి పారిపోయాడని తెలిసి ఎంతో ఊరట చెందుతుంది మినా. డ్రాకులా 'వర్నా' చేరేదానికి ముందే జోనాథన్, మినాతో సహా అందరు 'వర్నా'కు ప్రయాణమయిపోవడానికి నిశ్చయించుకుంటారు.

---

కూడదు. మీరు నాకు అలా వాగ్దానంచెయ్యాలి. అందరూ చెయ్యాలి. జోనాథన్ నువ్వుకూడా. అదేమిటంటే, సమయం వచ్చినప్పుడు నన్ను చంపటానికి వెనుకాడకూడదు !'' అంది.

''ఏ సమయం ?'' క్విన్సీ అడిగాడు మెల్లగా. అతని గొంతులో బాధవుంది.

''నాలో బాగా మార్పువచ్చినపుడు, నేను బ్రతికివుండటంకన్నా, మరణించటం మేలు అని మీరు అనుకున్నప్పుడు. నేను రక్తమాంసాలతో చనిపోయినప్పుడు, నా గుండెనుచీల్చి, నా తలను నరికేయండి. నాకు విముక్తికలిగే పని ఏదైనా చెయ్యండి'' అంది.

క్విన్సీమోరిస్ కుర్చీలోంచి లేచాడు కొద్ది క్షణాల తర్వాత. ఆమె ముందు మోకాళ్ల మీద కూర్చున్నాడు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని గంభీరంగా అన్నాడు —

''నేను కరుకుగా ప్రవర్తించే మనిషిని. ఆ సమయం వచ్చినపుడు మీ కోరిక తీరుస్తాను. అట్లా అని వాగ్దానం చేస్తున్నాను.''

''నిజంగానా ?'' ఆమె కళ్ళు వర్షించాయి. అతని చేతిని ఆప్యాయంగా ముద్దు పెట్టుకుంది.

''డియర్ మేడమ్ మినా ! నేను కూడా ఆ విధంగా వాగ్దానం చేస్తున్నాను'' అన్నాడు వాన్‌హెల్సింగ్.

''నేను కూడా !'' అన్నాడు ఆర్థర్. వాళ్ళ ఆమె ముందు మోకాళ్ల మీద వంగి కూర్చుని ఆమె చెయ్యిని అందిపుచ్చుకుని వాగ్దానం చేసారు. నేను కూడా అలాగే చేసాను.

జోనాథన్ మొహం పాలిపోయింది. ఆమె మొహంలోకి విషాదంగా చూస్తూ ''నేను కూడా అలా వాగ్దానం చెయ్యాలా ?'' అడిగాడు.

''అవును. నువ్వు కూడా డియర్'' అంది జాలితో కూడిన స్వరంతో. ''నువ్వు వెనుకాడ కూడదు. నా హృదయానికి చేరువైన వ్యక్తివి నువ్వే. ఈ ప్రపంచంలో నువ్వేనాకు ప్రియమైన వాడివి—మన రెండు హృదయాలు పెనవేసుకుని వుంటాయి జీవించి వున్నంతవరకు. ఒక్కసారి ఆలోచించు. ఎంతో మంది వీరులు, తమ భార్యలు, తమ స్త్రీలు శత్రువుల చేతిలో చిక్క కుండా తామే చంపేసేవారు. అట్లా చేయటం వల్ల వాళ్లకి పాపం అంటదు. అట్లాంటి సమయాల్లో మగవాడు చెయ్యవలసిన విధి అది. నేను మరణించాల్సిన అవసరం ఏర్పడినప్పుడు, నన్ను ఎవరైతే ఎక్కువ ప్రేమిస్తున్నారో, వాళ్ల చేతిలో చావాలనుకుంటున్నాను. లూసీకి విముక్తి కలిగించిన ఆమె ప్రియుడ్ని, వాన్‌హెల్సింగ్ ఎంత ఓదార్పుగా చూసారో నేను మర్చిపోలేదు. ఆమెకు విముక్తి కలిగించే హక్కు ఆమె ప్రియుడికే వున్నది. అట్లాగే, నా ఆత్మకు విముక్తి కలిగించే హక్కు నా భర్తకే వున్నది. డాక్టర్ వాన్‌హెల్సింగ్, మీరు నా భర్తకు ఓదార్పునిచ్చి సంతోషంగా జీవితాన్ని సాగించేట్టు తోడ్పడాలి'' అంది.

''అలాగేనని మాట ఇస్తున్నాను'' అన్నాడు వాన్‌హెల్సింగ్. మినా చిన్నగా నవ్వింది. సమస్య తీరినట్టుగా నిట్టూర్చి వెనక్కివాలి అంది—

''మీకు ఒక హెచ్చరిక చేస్తున్నాను. అది మర్చిపోకూడదు. నేను మరణించాల్సిన సమయం తొందర్లోనే అనుకోకుండా రావచ్చు ఆ సమయంలో మీ మాట నిలబెట్టుకోవాలి, అది ఎటువంటి సమయం అంటే, నేను శత్రువుతో చేతులు కలిపి మీకు వ్యతిరేకంగా నడిచినప్పుడు'' అంది



''ఇంకో మాట వుంది. అది అంత ముఖ్యం అనిపించకపోవచ్చు. కానీ నా కోసం ఆ పని చెయ్యాలి. అదేమిటంటే, నా ఆత్మకు విముక్తి కలిగించే సమయంలో, మంత్రాలు చదువుతారు గదా'' అంది. జోనాథన్ బాధగా మూల్గాడు ఆమె మాటలకు. ఆమె చేతిని తన చేతిలో వుంచుకున్నాడు. ఆమె అతని చెయ్యిని తన గుండెలమీద వుంచుకుంది. ''ఆ మంత్రాలు ఇప్పుడు నువ్వు చదవాలి డియర్, ఆ స్వరం నాకు గుర్తుండిపోవాలి'' అంది జోనాథన్‌తో.

''డియర్ మినా! అట్లా మాట్లాడకు.

## జీవన్ మృతులు

చావు నీకు చాలా దూరంలో వుంది'' అన్నాడు బాధగా.

''కాదు. నాలో పూర్తిగా మరణం గురించి ఆలోచన వచ్చేసింది'' అంది.

''కానీ మంత్రాలు నేను చదవాలా ? ఇప్పుడా ?'' బాధగా అన్నాడు.

''అవును. ఎప్పుడైనా చదవాల్సిందేగా. అది ఇప్పుడే చదివితే నాకు వూరటగా వుంటుంది'' అంటూ తన దగ్గరవున్న పుస్తకం అతనికిచ్చింది. జోనాథన్ చదవటం ప్రారంభించాడు.

ఆ దృశ్యాన్ని, నేనుగానీ, మరెవరైనాగానీ ఎట్లా వర్ణించి చెప్పటం ? గంభీరంతో, విషాదంతో, భయాలతో నిండివున్న ఆ దృశ్యాన్ని ఎట్లా వర్ణించటం ? నా వల్లకాదు.

### జోనాథన్ డైరీ :

వర్నా, అక్టోబర్, 15 : చేరింగ్ క్రాస్ నుంచి 12వ తారీకు ఉదయం బయలుదేరి, అదేరోజు రాత్రి పారిస్ చేరుకున్నాం. ఓరియంట్ ఎక్స్‌ప్రెస్‌లో సీట్లు సంపాదించాం ఒక రాత్రి ఒక పగలు ప్రయాణం చేసి అయిదు గంటల కల్లా ఇక్కడికి చేరుకున్నాం. ఆర్థర్ అక్కడి

రాయబార కార్యాలయానికి వెళ్లాడు, తనకేమైనా టెలిగ్రాంలు వచ్చాయేమో తెలుసుకోడానికి. మిగిలిన వాళ్ళం ''ది ఒడెసస్'' హోటల్‌కి చేరుకున్నాం. ప్రయాణం మధ్యలో చిన్న చిన్న సంఘటనలు జరిగాయిగానీ నేను వాటిని పట్టించుకోలేదు. జరినా కేథరిన్ ఓడ తీరం చేరేదాకా, నా మనసుకి ఏ విషయమూ పట్టటం లేదు. దేవుడి దయవల్ల, మినా కాస్త కళగానే వుంది. బలాన్ని పుంజుకుంటోంది. ప్రయాణంలో ఆమె దాదాపు అంతా నిద్ర పోయింది. సూర్యోదయం, సూర్యాస్తమయ సమయాల్లో మాత్రం మెలుకువగా వుంది. ఆ సమయాల్లో వాన్‌హెల్సింగ్ ఆమెను హిప్నటైజ్ చెయ్యటం అలవాటయిపోయింది. మొదట్లో ఆమెను హిప్నటైజ్ చెయ్యాలంటే, ఎక్కువ సమయం తీసుకోవాల్సి వచ్చేది. కానీ ఇప్పుడు అలా కాదు. ఆయన హిప్నాటిజం మొదలుపెట్ట గానే, ఆమె ఆయన పరిధిలోకి వెళ్లిపోతోంది. ఆయనెప్పుడు 'నీ కేం కనిపిస్తోంది, నీ కేం వినిపిస్తోంది' అని అడుగుతారు.

''ఏమీలేదు. అంతా చీకటిగా వుంది'' అంటుంది మొదట. క్షణం తర్వాత ''ఓడను తాకుతున్న అలల చప్పుడు వినపడుతోంది. తెర చాపల చప్పుడు తెలుస్తోంది. గాలి బాగావుంది. దాని శబ్దం బాగా వినపడుతోంది'' అంటున్నది. దాన్నిబట్టి జరీనా కెథరిన్ ఓడ సముద్రంలో ప్రయాణం చేస్తున్నట్టు తెలుస్తోంది.

ఆర్థర్ తిరిగి వచ్చాడు. అతని చేతిలో నాలుగు టెలిగ్రాంలు వున్నాయి. అవి మేము బయలుదేరిన తర్వాత రోజు కొకటి చొప్పున వచ్చాయి. అన్నింటి సారాంశం ఒకటే – జరినా కేథరిన్ ఆచూకి తెలీటం లేదని. లండన్ నుంచి బయలుదేరే ముందు, ఆ ఓడ పోకడ గురించి తెలియజేయమని ఒక మనిషిని కుదిర్చాడు ఆర్థర్. ఒకవేళ ఆ ఓడ సంగతి తెలియకపోయినా టెలిగ్రాం ఇమ్మని చెప్పాడు.

భోజనం ముగించి తొందరగా పడకజేరాం. రేపు ఉదయం రాయబార కార్యాలయంలో వైస్ కన్సల్‌ని కలిసి ఓడ తీరం చేరగానే, అందులో ఎక్కటానికి ఏర్పాట్లు చేసుకోవాలి. సూర్యోదయం, సూర్యాస్తమయాల మధ్య సమయంలో ఓడ ఎక్కితే మంచి అవకాశం దొరుకుతుంది. డ్రాకులా ఆ సమయంలో గబ్బిలాయి రూపంలో వున్నా, నీటిమీద నుంచి ఒడ్డుకు ప్రయాణం చెయ్యలేడు. కాబట్టి అతను ఓడలోనే వుండిపోవాలి. మనిషి రూపంలోకి మారి అనుమానం రాకుండా తిరిగే ధైర్యం అతనికి వుండదు. కాబట్టి చెక్క పెట్టెలోనే వుండిపోతాడు సూర్యోదయం తర్వాత ఓడ ఎక్కి ఆ చెక్కపెట్టె తెరవొచ్చు. డ్రాకులాకు మెలకువ వచ్చేలోగా, లూసీకి చేసినట్టు చెయ్యాలి. తీరప్రాంత అధికారులతోగానీ, ఓడలోని వాళ్లతో గానీ, ఈ విషయంలో ఎక్కువ గొడవలు రావనే అనుకుంటున్నాం. ఈ దేశంలో లంచంవల్ల జరగని పని అంటూ ఏదీలేదు. మా దగ్గర డబ్బు వుంది. సూర్యాస్తమయం, సూర్యోదయం లోపల ఓడ తీరం చేరకుండా వుంటే చాలు. అదొక్కటే మా కోరిక మిగతా పనులు డబ్బుతో అన్నీ న్యాయమయిపోతాయి.

అక్టోబర్, 16 : మినా చెప్పే మాటలు అట్లాగే వున్నాయి. అలల తాకిడి, ఓడ ప్రయాణం. దానికి అనుకూలమైన గాలి వున్నాయట. మంచి సమయంలో ఇక్కడకు చేరుకున్నాం. జరినా కేథరిన్ ఓడ గురించి ఆమె నోటివెంట వినగానే మేం సిద్ధమయిపోతాం.

అక్టోబర్, 17 . డ్రాకులాకు స్వాగతం పలకడానికి అన్నివిధాలుగా ఏర్పాట్లు చేసాం. తన మిత్రుడికి సంబంధించిన వస్తువులు పోయాయని, అవి ఓడలో వస్తున్న చెక్కపెట్టెలో వుంటాయని అనుమానంగా వుందనీ, అది స్వయంగా తెరిచి చూస్తానని ఆర్థర్ ఓడ యజమానితో చెప్పాడు. ఓడ యజమాని కెప్టెన్‌కు ఉత్తరం రాసి అది ఆర్థర్ కిచ్చాడు – చెక్కపెట్టె తెరిచి చూసే అవకాశం ఇవ్వమని ఆదేశిస్తూ వర్నాలో ఏజంటుకు కూడా అటువంటి ఉత్తరం రాసాడు మొదట ఏజంటు దగ్గరికి వెళ్లాం. ఆర్థర్ మంచి మాటలకు అతను పొంగిపోయి, తనకు చేతనయినంత సహాయం చేస్తానని చెప్పాడు. చక్కపెట్టె తెరవగానే ఏంచెయ్యాలో మేం ముందే నిర్ణయించుకున్నాం. అందులో డ్రాకులా వున్నట్టయితే, వాన్‌హెల్సింగ్, సెవార్డులు అతని తల నరికేస్తారు. గుండెల్లో కర్ర దించేస్తారు మోరిస్, ఆర్థర్, నేనూ, ఇతర్లు ఆ పనిని అడ్డుకోకుండా చూస్తాం. అవసరమయితే ఆయుధాలు ఉపయోగిస్తాం. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ చెప్పేదేమిటంటే – డ్రాకులా శరీరాన్ని అట్లా చెయ్యగానే, అది మట్టిగా మారిపోతుంది. కాబట్టి హత్య చేసినట్టు గుర్తులు ఏవీ మిగలవు అని. ఒకవేళ అట్లా కాకపోయి చట్టం చేతిలో చిక్కితే, ఈ డైరీ మాకు సహాయపడుతుంది. ఏమయినా, మామీదకు రాకుండా కొన్ని ఏర్పాట్లు చేయదల్చుకున్నాం జరీనా కేధరిన్ ఓడ కనిపించగానే వెంటనే ఆ వార్త మాకు అందజేయటానికి కొంతమంది మనుష్యుల్ని ఏర్పాటు చేసాం.

అక్టోబర్ 24 · వారం రోజులుగా ఎదురు చూస్తూ వుండిపోయాం. ఆర్థర్‌కి రోజూ టెలిగ్రాం వస్తూనే వుంది – ఓడ ఆచూకీ తెలియలేదంటూ. మినాను హిప్నటైజ్ చేసినా ఆమె మాటల్లో మార్పు లేదు

## రూఫస్‌స్మిత్, లండన్ వర్నాలో వున్న ఆర్థర్‌కు పంపిన టెలిగ్రాం :

అక్టోబర్, 24 : జరీనా కేధరిన్ ఓడ గురించి తెలిసింది. అది డార్డానెల్లీస్‌లో వుంది.

## డాక్టర్ సెవార్డు డైరీ :

అక్టోబర్, 25 : నా డైరీని ఫోనోగ్రాఫ్ ద్వారా రికార్డు చేస్తున్న నాకు ఇప్పుడు పెన్‌తో డైరీ రాయాలంటే చాలా ఇబ్బందిగా వుంది కాని వాన్ హెల్సింగ్ రాయమని చెపుతున్నాడు నిన్న ఆర్థర్‌కి టెలిగ్రాం రాగానే, మేమంతా చాలా చురుకుగా వున్నాం. యుద్ధానికి సన్నిద్ధం కండి అని పిలుపువస్తే, వీరులు ఎట్లా అనుభూతి పొందుతారో నాకు ఆ సమయంలో తెలిసింది. మాలో ఒక్క మినా మాత్రం ఎటువంటి భావాన్ని వ్యక్తం చెయ్యలేదు. ఎందుకంటే, ఆమెకు ఏ విషయమూ తెలియ



కుండా, మా భావాలు ఆమె తెలుసుకోకుండా ఎంతో జాగ్రత్త తీసుకున్నాం. కాబట్టి ఆమెలో ఎటువంటి భావాన్ని ఎదురు చూడలేదు. పూర్వం అయితే మేం ఎంత దాచినా ఆమె పసిగట్టి గలిగేది. గత మూడు వారాలుగా, ఆమె అట్లా చెయ్యటంలేదు. ఇది ఆమెలో వచ్చిన మార్పు. ఆమె చూడటానికి బాగానే కనిపించినా, చాలా బద్ధకంగా వుంటోంది. ఆమె స్థితి వాన్ హెల్సింగ్‌కు గానీ, నాకు గానీ సంతృప్తిని కలిగించటం లేదు మాట్లో మేము ఆమె గురించి తరచూ మాట్లాడుకున్నాం. మిగతా వాళ్లకు ఆమె గురించి ఒక్క మాట కూడా చెప్పలేదు. మాకొక సందేహం వచ్చిందని జోనాథన్‌కి తెలిస్తే, అతని గుండె పగిలి పోతుంది. హిప్నటైజ్ చేస్తున్నప్పుడు వాన్ హెల్సింగ్ ఆమెను పరీక్షిస్తున్నాడు. ఆమె పళ్లు యింకా సూదిగా మారలేదని, కాబట్టి ఇప్పుడే వచ్చే ప్రమాదం లేదని వాన్‌హెల్సింగ్ నాతో అన్నాడు. ఆమె పళ్లల్లో ఆ మార్పు కనిపిస్తే, ఇక తగిన చర్య తీసుకోవాల్సిందే. ఆ చర్య ఏమిటో మా ఇద్దరికీ తెలుసు, ఒకరికొకరు బయటకు చెప్పకోక పోయినా. ఆ చర్య తీసుకోవడానికి మా ఇద్దరిలో ఎవరూ వెనకాడేది లేదు, అది ఎంత దారుణమైనా. ఆత్మకు విముక్తి కలిగించే ఈ చర్య ఎవరు కనిపెట్టారోగానీ, వాళ్లకి ఋణపడి వున్నాను.

డార్డా నెల్లీస్ నుండి ఇక్కడకు (వర్నా) రావటానికి 24 గంటలు పడుతుంది, జరీనా కేథరిన్ లండన్నుంచి వచ్చిన వేగంతో వస్తే, అట్లా చూసుకుంటే, ఓడ ఉదయం రావచ్చు. అంతకంటే ముందే ఎట్టి పరిస్థితుల్లోనూ రాదనుకుంటూ అందరం విశ్రాంతి తీసుకో దలచాం. ఒంటిగంటకు లేచి, మేం సిద్ధమవ్వాలి.

అక్టోబర్, 25 (మధ్యాహ్నం): ఓడ రాక గురించి వార్త లేదు. మినాను హిప్నటైజ్ చేస్తే మామూలు మాటలే చెప్పింది. అంటే ఓడ ప్రయాణిస్తోందన్నమాట. దాని రాక

## జీవన్ స్మృతులు

గురించి ఏ సమయంలోనైనా వార్త రావచ్చు. మేం అంతా చురుకుగా వున్నాం, జోనాథన్ తప్ప. అతని చేతులు బాగా చల్లగా వున్నాయి. గంట క్రితం, ఎప్పుడూ తన దగ్గర వుంచుకునే 'ఘుర్కా' కత్తికి పదును పెడుతూ కనిపించాడు. తన ఎదలో ఆ కత్తి దిగబడిపోతుందని డ్రాకులాకు తెలిస్తే ఎట్లా వుంటుంది

మినా గురించి వాన్‌హెల్సింగ్, నేనూ ఈరోజు కాస్త ఆందోళన చెందాం. మధ్యాహ్నం సమయంలో ఆమె బద్ధకంగా కనిపించింది. అట్లా వుండటం మాకిష్టంలేదు ఆ విషయం గురించి మేం మౌనంగా వున్నాం, సంతోషంగా లేము ఉదయమంతా విశ్రాంతి లేకుండా గడిపింది, అందువల్ల నిద్రపోతోంది అనుకున్నాం మొదట. జోనాథన్ మాటల సందర్భంలో మినా గాఢంగా నిద్రపోతోందని, లేపినా లేవటంలేదని చెపితే, ఆమెను చూడటానికి వెళ్లాం గదిలోకి. ఆమె మామూలుగా వూపిరి తీస్తోంది. ప్రశాంతత కనిపించింది మొహంలో. నిద్రకన్నా ఆమెకు మంచి చేసేది ఏమీ లేదనుకున్నాం. నిద్రపోతే ఆమె విషయాలు మరిచిపోగల్గుతుంది

తర్వాత: మేం అనుకున్నట్టే అయింది కొన్ని గంటల నిద్ర తర్వాత ఆమె మేల్కొంది. ఇదివరకటికన్నా ఆమె మొహంలో కాంతి ఎక్కువయింది. సూర్యాస్తమయ సమయంలో హిప్నటైజ్ చేస్తే, మామూలు మాటలే చెప్పింది. నల్లసముద్రంలో ఎక్కడున్నా డ్రాకులా తొందరగా తీరం చేరుకుంటున్నాడు. తీరం కాదు, అతని చావు!

అక్టోబర్ 26: ఈపాటికి ఓడ ఇక్కడకు రావలసింది. కానీ రాలేదు. అంటే, ఓడ ఇంకా ప్రయాణం చేస్తోందన్నమాట. సూర్యోదయ సమయంలో ఆమెను హిప్నటైజ్ చేస్తే, అట్లాగే చెప్పింది. సముద్రంలో ఎక్కడో ఆగి వుంటుంది, పొగమంచు ఏర్పడివుంది. ఇక్కడకు వచ్చిన కొన్ని స్టీమర్లవాళ్ళ ప్రకారం దక్షిణం వైపు, ఉత్తరంవైపు అక్కడక్కడా మంచుపొగ వుందని తెలుస్తోంది. దానికోసం ఎదురుచూస్తూ వుండాలి.

అక్టోబర్, 27: (మధ్యాహ్నం): ఆశ్చర్యం! ఆ ఓడరాక సంగతి ఇంకా తెలీలేదు. గతరాత్రి, ఇవాళ ఉదయం, మినా మాటల ప్రకారం, ఓడ ప్రయాణించేస్తోంది. లండన్ నుంచి వచ్చిన టె...లో కూడా 'తర్వాత వివరాలు తెలీలేదు' అని వుంది. వాన్‌హెల్సింగ్ చాలా ఆదుర్దాగా కనిపించాడు డ్రాకులా తప్పించుకుని పారిపోతున్నాడేమోనని భయంగా వుందన్నాడు.

''మినా అట్లా బద్ధకంగా కనిపించటం నాకు బాగుండలేదు. ఆత్మలు, స్మృతులు నిద్రలోవున్నప్పుడు చాలా పనులు చేస్తాయి'' అన్నాడు వాన్‌హెల్సింగ్. దాని గురించి ఇంకా అడగబోతుంటే, జోనాథన్ లోపలికివచ్చాడు వాన్‌హెల్సింగ్ ఆగమని సైగచేసాడు సూర్యాస్తమయ సమయంలో ఆమెను హిప్నటైజ్ చేసి ఇంకా ఎక్కువ వివరాలు రాబట్టాలి.

### రూఫస్ స్మిత్, లండన్ వర్నాలో వున్న ఆర్థర్‌కి పంపిన టెలిగ్రాం:

అక్టోబర్, 28. జరీనా కేథరిన్ ఓడ 'గలాటజ్' తీరం ఈ రోజు ఒంటిగంటను చేరుకున్నట్టు తెలిసింది.

### డాక్టర్ సెవార్డు డైరీ:

అక్టోబర్, 28: ఆర్థర్‌కి టెలిగ్రాం వచ్చినప్పుడు, అందరం నిశ్చేష్టులయిపోతామని అనుకోలేదు. ఇలాంటి పిడుగులాంటి వార్త వస్తుందనుకోలేదు. కానీ ఏదో ఒక సమస్య వస్తుందనిమాత్రం కాస్త వూహించాం. ఓడ ఇంకా ఎర్నారావటానికి ఆలస్యమయినందుకు ముందు కొంత సంతోషించాం. దాని రాకలో కొంత మార్పు వింటాంఅని అనుకుంటూ ఎదురు చూసాం. కానీ ఇట్లా వినాల్సివస్తుందనుకోలేదు. మనం ఒకటి అనుకుంటే, ఒకటి జరుగుతుంది, ఎప్పుడూ అంతే కదా. వాన్‌హెల్సింగ్ దేవుడ్ని తలుచుకున్నట్టుగా ఓసారి చెయ్యి పైకెత్తి దించాడు. తర్వాత గంభీరంగా లేచి నిలబడ్డాడు. ఆర్థర్ మొహం తెల్లబడింది. గట్టిగా వూపిరి తీస్తున్నాడు. నేను కూడా తోచక అందరి మొహాల్లోకి చూస్తున్నాను. క్విన్సీమోరిస్ తన బెల్టును సరిచేసుకుంటున్నాడు, రంగంలోకి దూకటానికి సిద్ధమవుతున్నట్టు. మినా చేతులు జోడించి ప్రార్థనలో వుండిపోయింది. జోనాథన్ నవ్వాడు. నిజంగా నవ్వాడు. అది విషాదంతోనూ, బాధతోనూ కూడిన నవ్వు అది. ఆ సమయంలో అతను ఇచ్చిన మాట గుర్తుకు వచ్చి వుండాలి — అతని చేతులు కత్తిమీదకు వెళ్లాయి.

**(ఇంకా వుంది)**






# ఘాటక్షుని డైరీ



## టి. వీ. ఫో ను!

టెలిఫోనుకు టి. వి. చిన్నసైజుది కలిపి, మనం ఫోనులో మాట్లాడేవాళ్ళను ఆ టి. వి. స్క్రీనులో చూసేపద్ధతి వెస్ట్‌జర్మనీ సైమన్స్ కంపెనీ కనిపెట్టిందట. ఈ విధానంలో తాము మాట్లాడేవ్యక్తిని హాయిగా చూసుకోవచ్చుట అయ్యో! యీ దేశానికొద్దుబాబూ యీ బెడద! దీనికి సవాలక్ష కష్టాలున్నాయి బాబోయ్!

## అల్యూమినియం పాత్రలు ఆరోగ్యానికి హానికరం!

అల్యూమినియం గిన్నెలలో వంట చేయడం వల్ల భోజనంలో అల్యూమినియం శాతం అధికంగాచేరే ప్రమాద మున్నదట. కిడ్నీకి సంబంధించిన జబ్బులున్నవారు అల్యూమినియం గిన్నెలలో వండిన పదార్థాలు తినడమంత మంచిది కాదట. గ్యాస్ట్రో ఇంటస్టయినల్ కేవిటీలలో అల్యూమినియం సాల్టులు ఫాస్ఫేటు సాల్టులుగా పరివర్తనం చెందుతాయని, దీనివలన ఆహారంలో రెట్టింపు అల్యూమినియం తయారయ్యే ప్రమాదముందనీ, అంతేగాకుండా యీ ఆహారంలో ఫాస్ఫేటులేమి ఏర్పడవచ్చుననీ విజ్ఞాన వేత్తలంటూంటే అమెరికన్ డ్రగ్ ఎడ్మినిస్ట్రేషను సైంటిస్టులు ఆ పాత్రలలోని వంటకాలు హానికరాలని దాఖలాలు లేవన్నారట.

## ఆదిలోనే హంసపాదు!

ఓం అని ఢిల్లీ నుంచి అమృత్‌సర్‌కు కొత్త రైలుకు ప్రారంభోత్సవం చేసి ఆ రైలుకు హిమాలయన్ క్వీన్‌షెన్ – ఏ – పంజాబ్ అని పేరెట్టి ఢిల్లీ రైల్వేస్టేషనులో ఈ రైలును మూడో తేదీన సిద్ధంచేసి రైల్వేమంత్రి కె.బి.ఏ. ఖాన్‌గారు కేంద్రమంత్రి ప్రణబ్‌ముఖర్జీగారు పెద్దరికంలో జెండా వూపగా ఆ రైలు రయిమున వెళ్ళి అమృత్‌సర్ యింకా ఎనిమిది కిలోమీటర్ల దూరంలో వుందనగా గతి తప్పిందట. దాంతో నాలుగు పెట్టెలు పట్టాలు దిగాయట ఆశగా ఈ ప్రమాదంలో ప్రయాణికులకేమీ ప్రమాదం జరుగలేదని అధికారులన్నారట – రైటుగా పోవచ్చు వారిమాట.

## అమెరికాలో నిరుద్యోగసమస్య!

నిరుద్యోగసమస్య మన ఆంధ్రదేశానికీకాదు, భారద్దేశానిదీ కాదోయ్ హో చదువరీ. హోహో అని మనం అనుకునే యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో యీ నాడు యీ నిరుద్యోగ సమస్య పదింపావు శాతం వుందట. అనగా 1,12,60,000 (కోటింబావు) మంది నిరుద్యోగులు నమోదయి వున్నారని అక్కడి లేబర్ డిపార్ట్‌మెంట్ ప్రకటించిందట. ఇంత చేటు దాబుణం గత 42 ఏళ్ళుగా లేదు లేదు బాబోయ్ అంటున్నారట అధికారులు.

## మాతృమూర్తులకి రాష్ట్రపతి సలహా!

తమ అందమూ, శరీర పొంకమూ పోతాయని, తాము కన్నపిల్లలకు చనుబాలివ్వని ఆడవాళ్ళ విషయంలో నేను జాలిపడను అని రాష్ట్రపతి జైల్‌సింగ్ అన్నారట చనుబాలివ్వడం ఎంత మంచిదో ప్రసూతి ఆసుపత్రిలోని నర్సులు, డాక్టర్లూ అక్కడ ప్రసవమయిన వారికి చెప్పాలని ఆయన సూచించారట. సీసా పాలవల్ల పిల్లల ఆరోగ్యం ప్రారంభంలోనే పాడవుతుందని, కన్నతల్లే యీ దారుణానికి కారణం కారాదని, మాతృత్వం స్త్రీకి వో చక్కని అనుభూతి అనీ, స్తన్యం యివ్వడం వారు విడువరాదనీ ఆయనన్నారట – చదువరీ! మన రాజకీయ నాయకులు ఏ విషయమ్మైనా మాట్లాడగలరుస్మీ!

## నల్లుల ప్రేమగీతాలు

మనం నిత్యం, అనునిత్యంచూసే నల్లులలో ఆడా మగా ప్రకృతిసిద్ధమయిన లైంగిక కలయిక సమయంలో మగనల్లి మూడువిధాలయిన పాటలు పాడుతుందనీ, మొదటిపాట ప్రియురాలిని పిలవడం, రెండోపాట వచ్చిన ప్రియురాలిని పొగడడం, మూడోపాట కలయిక అయ్యాక ఆనందంతోకూడినదీ అనీ అమెరికాకుచెందిన ఎటిమాలజిస్ట్ వివియన్ని హేరిస్ అనె ఆమె తెలియజేశారట. అయితే యీ ప్రేమగానాలు మామూలుగా మనకు వినబడవనీ, వాటి శబ్దాలను ఏంప్లిఫై చేస్తే, కప్ప అరుపులవంటివి శుభ్రంగా వినిపిస్తాయనీ, కాస్త శ్రద్ధగావింటే చక్కగా యీ మూడుతేడాలూ తెలుస్తాయనీ ఆమె అన్నారట– వాచ్ యువర్‌బగ్స్ విత్ ఎంప్లిఫియర్! ★






# ఆకలి

రావినూతల సువర్ణాకన్నన్



లాయర్ రాజశేఖరంగారి చెల్లెలి పెళ్లి అట్టహాసంగా జరిగిపోయింది.

ఆకాశమంత పందిరి. భూదేవంత అరుగు అన్నట్టు అతివైభవంగా చెల్లెలి పెళ్ళిచేసి నలుగురి చేత 'సెభాష్' అనిపించుకున్నారు.

దాదాపు అందరి భోజనాలు అయిపోయాయ్. మేళగాళ్ళు ఓ మూలగా పడుకుని కునుకు తీస్తున్నారు.

పిల్లలు పందిట్లో ఆడుకుంటూంటే, పెద్దలు రాజకీయాల దగ్గర్నించి పాకశాస్త్రం వరకు తిరగేస్తున్నారు.

రాజశేఖరం తల్లిదండ్రులు కూతురికి కన్యాధారపోసి నిశ్చింతగా కునుకు తీస్తున్నారు.

రాజశేఖరం సాయంత్రం జరగబోయే డేన్స్ ప్రోగ్రాం అరేంజ్ చెయ్యడంలోను, అతని భార్య మాధవి తెల్లవారుఝామున జరగబోయే, అప్పగింతలకి ఏర్పాట్లు చెయ్యడంలోనూ హడావిడిగా ఉన్నారు.

మేడ పక్కగా పడేసిన ఎంగిలి విస్తళ్ళకోసం కుక్కలు కాట్లాడుకుంటున్నాయి.

పందిరి వైపు రాబోతున్న ముష్టివాళ్లని తరిమికొడుతున్నారు నౌకర్లు.

రాజశేఖరం కూతురు ఎనిమిదేళ్ళ స్వప్న పట్టులంగా ఎత్తి పట్టుకుని మెల్లగా తల్లి దగ్గరికొచ్చింది.

అప్పగింతల్లో పెళ్ళివారికి పెట్టబోయే బట్టలు బొత్తులుగా పెడుతున్న మాధవి, అడుగుల చప్పుడుకి ఓసారి వెనక్కితిరిగి కూతుర్ని చూసి —

''పందిటో ఆటలు అయిపోయాయా ?'' నవ్వుతూ అని తన పన్లో పడిపోయింది.

తల్లి మెడకి చేతులు పెనవేసి —

''అమ్మా !'' అంది స్వప్న.

''ఏమిటమ్మా ?'' అంది మాధవి తల తిప్పకుండానే.

''నాకు ... నాకు ఆకలేస్తోందమ్మా !'' మెల్లగా అంది స్వప్న.

తుళ్ళిపడింది మాధవి.

పుట్టేం తర్వాత స్వప్న 'ఆకలి' అని అడగడం అదే మొదటిసారి.

''ఏమిటి ?'' అంది తను పొరపాటుగా విందేమోనని.

''నాకు ఆకలేస్తోంది అన్నం పెట్టవూ ?'' మళ్ళీ అంది స్వప్న.

చేతిలోని పని ఆపి చటుక్కున లేచి —

''నువ్వు... అన్నంతిన్లేదూ ?'' కూతుర్ని పొదివి పట్టుకుని అంది మాధవి.

''ఊహూ !'' అదోలా కళ్ళుతిప్పుతూ అంది స్వప్న.

పిడుగు పడ్డట్టు చూసింది మాధవి.

''పాపిష్టిదాన్ని! ... బిడ్డ అన్నం తిన్నదో

లేదోకూడా చూసుకోలేదు.'' నొచ్చుకుంటూ స్వప్నని తీసుకుని వంటింటికేసి నడిచింది.

''అమ్మా ! ... నేను మేడమీద నా గదిలో కూర్చుని తింటాను. అక్కడికే తీసుకురామ్మా!'' అంది స్వప్న.

మాధవి ఓ కేరియర్‌లో అన్నం కూరలు, మరో కేరియర్‌లో పిండివంటలుపెట్టి మేడమీదికి తీసుకెళ్లింది.

ఓ అరిటాకువేసి అన్నీ వడ్డించి —

''తినుతల్లీ !'' అంటూ ఓ స్వీట్ కూతురి నోట్లో పెట్టింది. ఆవురావురుమంటూ తింటున్న ఆ పిల్లని చూసి మరోసారి తననితాను తిట్టుకుంది.

ఇంతలో ఎవరో పిలవడంతో కూతుర్ని తింటూండమనిచెప్పి కిందకెళ్ళింది.

పది నిమిషాల తర్వాత వచ్చిచూస్తే రెండు కేరియర్లు ఖాళీగా ఉన్నాయి ... విస్తరి పారేసి మంచినీళ్ళు తాగుతోంది స్వప్న.

మాధవి నిర్ఘాంతపోయింది.

ఎనిమిదేళ్ళు వచ్చినా, 'ఇది తాత ముద్ద ఇది బామ్మ ముద్ద' అని బుజ్జగించి తినిపించడం తప్ప ఏనాడూ స్వప్న తనకితాను ఇలా తినడం జరగలేదు. పైగా రెండు కేరియర్ల పదార్థాలు తిందంటే మతిపోయింది మాధవికి.

పోనీ ఎవరైనా ఫ్రెండ్‌కూడా తిన్నారంటే అక్కడ ఆ పిల్లతప్ప మరెవ్వరూలేరు.

''ఛీ! ఛీ! బిడ్డ తిండినిగురించి ఇలా అనుకోవడమేమిటి !'' తనని తానే విసుక్కుంది.

''ఇంత ఆకలిగాఉందని భర్తకి తెలిస్తే?'' అనుకున్న మాధవి హడలిపోయింది.

కూతుర్ని మెల్లగా కిందికి పంపేసి కేరియర్‌లు కిందికి తీసికెళ్ళిపోయింది.

*　*　*

''బామ్మా !...''

''ఏమిటే తల్లీ ?'' పిల్చినట్లా వచ్చిన స్వప్నని తన పక్కలో కూర్చోపెట్టుకుంటూ అంది రాజశేఖరం తల్లి.

''బామ్మా !... నాకు ఆకలిగా ఉంది బామ్మా !''

చటుక్కున లేచి కూర్చుంది బామ్మగారు.

''ఏమిటే ... ఆకలేస్తోందా ?'' అంటూ.

''అవును బామ్మా! బోల్డు ఆకలేస్తోంది!'' గారంగా అంది స్వప్న.

''అన్నం తిన్లేదూ ?'' తెల్లబోతూ అడిగిందావిడ.

''ఉహూఁ !''

''బిడ్డకి అన్నం పెట్టకుండా ఏం పాటు పడుతోందో మీ అమ్మ ? పద !'' కోపంగా లేచింది బామ్మగారు.

''వద్దు బామ్మా! ఇందాక బోంచెయ్యడానికి అలా కూర్చున్నానో లేదో మా ఫ్రెండ్ నీరజ వచ్చింది. నేను లేచేశాను. నేను అన్నం ముందునించి లేవడం అమ్మకి తెలియదు. అమ్మనేం అనకు !'' ముద్దుగా అంది స్వప్న.

''ఊఁ ! పద ! బిడ్డకి ఎంత ఆకలేస్తోందో కూడా చూసుకోరు ... ఎందుకు ఇందరుండి !'' గొణుక్కుంటూ స్వప్నని చంకనేసుకుని వంటింటికేసి నడిచింది బామ్మగారు.

*　*　*

''నాన్నా !''

''ఏమ్రిటా ?'' రాజశేఖరానికి కూతుర్ని ''ఏరా'' అనడం అలవాటు.

''నాకు ... ఆకలేస్తోంది నాన్నా !'' అమాయకంగా అంది స్వప్న.

తృళ్ళిపడ్డాడు రాజశేఖరం.

''అన్నం తిన్లేదూ?'' కంగారుగా అన్నాడు.

''ఉఁ హూఁ !''

''మాధవీ !'' కోపంగా పిలవబోయాడు భార్యని.

''నాన్నా! అమ్మని పిలవద్దు'' అని గబగబా అంది స్వప్న.

''ఏం ?''

''ఇవాళ నాకు నువ్వే అన్నం పెట్టాలి !'' తండ్రి చేతిని గుంజుతూ అంది స్వప్న.

''అమ్మేదీ ?''

''విడిదిలోకెళ్ళింది.''

''సరే ... పద !'' కూతురి చెయ్యి పట్టుకుని వంట ఇంట్లోకి నడిచాడు రాజశేఖరం.

*　*　*

''అమ్మమ్మా !''

''ఏమిటే స్వప్నా ?'' నవ్వుతూ చూసిందావిడ.

''ఏం చేస్తున్నావ్ ?''

''పడుకున్నానే తల్లీ ! ముసలాళ్ళంకదా ! తింటే ఆయాసం, తినకపోతే నీరసం !'' నవ్వింది స్వప్న అమ్మమ్మ.

''అమ్మమ్మా ! నాకు ఆకలేస్తోంది !'' మెల్లగా అంది స్వప్న.

కొయ్యబారిపోయిన అమ్మమ్మగారు తేరుకుని చటుక్కున లేచి నిల్చుంది.

*　*　*

సాయంత్రం అయిదు గంటలయింది.

ముత్తయిదువులు మేజువాణికి ఏర్పాటు చేస్తున్నారు.

కన్నెపిల్లలు ముస్తాబు ప్రారంభించారు. పందిట్లో పెద్దలు కాఫీలు సేవిస్తున్నారు.

''''ఇదిగో మాధవీ !... స్వప్నని లా తీసుకురా ! ఈ వడ్డాణం దానికి పెట్టాలి. పిచ్చి సన్యాసి... బైటికెడుతుందేమోనని తీసి దాచాను. ఆ కంచి లంగా కట్టుకుని ఇది పెట్టుకుంటుంది !'' అంది స్వప్న బామ్మగారు.

''ఇదిగో మంగమ్మగారూ !... స్వప్న అక్కడుంటే ఇలా పంపండి !'' పూలు మాల కడుతున్న మాధవి కూతుర్ని పిల్చేపని వంటావిడ కప్పజెప్పింది.

''అలాగేనమ్మా !... భోజనం కాగానే పంపుతాను !'' అంది మంగమ్మగారు.

''ఇప్పుడేం భోజనం !... ఏదో ఆటల్లోపడి ఉంటుంది వెళ్ళి చూడండి !'' అంది మాధవి పూలమాల పెళ్ళికూతురు తల్లో పెడుతూ.

''లేదమ్మా ! ఇప్పుడేగా నేను వడ్డించి వచ్చింది ! తినగానే పంపుతాను !'' అని వెళ్ళిపోయిందావిడ.

తృళ్ళిపడ్డారంతా.

''అన్నం తిన్నదిగా'' అయోమయంగా అంది మాధవి.

''ఎక్కడ తింది ? విస్తరి ముందు కూర్చోగానే ఎవరో స్నేహితురాలొస్తే లేచి పోయిందిట ! . అయినా పసిది అన్నం తిందో లేదో కాస్త చూసుకోరూ?... అందుకే నేను తీసుకెళ్ళి పెట్టించాను'' అంది స్వప్న బామ్మ.

''అదేమిటమ్మా ! దానికి అన్నం నేను కదా పెట్టించింది ! పిచ్చిపిల్ల ! మీరంతా హడావిడిగా ఉంటే నన్నొచ్చి అడిగింది !...'' అదోలా అన్నాడు రాజశేఖరం.

''అదేమిట్నాయనా ! నువ్వు పెట్టించడమేమిటి? పిచ్చికొరివి !...ఎంతాకలితో వుందో.. చక్కగా తింది !... నా కళ్ళే ఫడతాయేమో అని ఉప్పుకూడా తీశాను'' అంది స్వప్న అమ్మమ్మగారు

''అదేమిటమ్మగారూ ! ఇప్పుడేగా ఆకలిగా ఉందంటే అన్నీ తీసికెళ్ళి మేడమీద వడ్డించి వచ్చాను'' అంది మంగమ్మగారు.

అందరికీ మతులు పోయాయి.

వివరంగా మాట్లాడుకుంటే స్వప్న మధ్యాహ్నం నుంచి పదిసార్లు అన్నం తిన్నట్టు తేలింది.

అంతేకాదు... ఒకరు పెట్టినట్టు మరొకరికి తెలియకుండా జాగ్రత్త పడిందని కూడా తెలిసింది !

మాధవి వెన్నులోంచి ఒణుకు బైల్దేరింది.

''స్వప్నకేమైంది ? బతిమాలితే గానీ ముద్ద నోటపెట్టని పిల్ల ఎంత ఆకలైతే మాత్రం ఇన్నిసార్లు ఎలా తింది ? ఏ గాలైనా సోకలేదు కదా !...'' అనుకుని ఒణికిపోయింది.

గభాల్న లోపలికెళ్ళబోతున్న భార్యనాపాడు రాజశేఖరం.

''లేదండీ ! నాకేదో భయంగా వుంది ! ... ఇందాక నేను పెట్టినప్పుడే దాని దెయ్యపు తిండి చూసి హడలిపోయాము కానీ ...'' మాధవికి మాట రావడం లేదు.

''నువ్వేం కంగారు పడకు !.... '' అని మెల్లగా మేడమీదికి దారి తీశాడు రాజశేఖరం.

మాధవి అనుసరించింది.

మిగతా వారు అలా నిల్చుండిపోయారు. ఇద్దరూ మెల్లగా వెళ్ళి చాటునించి కూతుర్ని గమనిస్తున్నారు

స్వప్న నిండిన విస్తరి ముందు కూర్చుని







## ఆకలి

ఓ నిమిషం అదోలా ఆలోచించింది. ఆ తరువాత ఓ జిలేబీ ముక్క తుంచి నోట్లో వేసుకుంది.

మాధవిలోనూ, రాజశేఖరంలోనూ టెన్షన్ పెరిగిపోతోంది. ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

స్వప్న మెల్లగాలేచి అటు ఇటు చూసింది. ఎవరూ లేరనుకున్న తరువాత విస్తరి పక్కనే ఉన్న పళ్ళెంలోకి జాగ్రత్తగా తీసి అడుగులో అడుగు వేస్తూ ఆ విస్తరిని పిట్టగోడ దగ్గరికి తీసికెళ్ళి విస్తరి కింద పడేసేసింది.

రాజశేఖరం దంపతులు కొయ్యబారి పోయారు.

కూతురికి మతిపోయిందేమో అనుకున్న మాధవి ఒక్క అంగలో ఆ పిల్ల దగ్గరికొచ్చి పడింది.

హటాత్తుగా తల్లిదండ్రుల్ని చూసిన స్వప్న బిత్తరబోయి, ఆపై తల్లిని కావిలించుకుని భోరుమంది.

రాజశేఖరం చరచరా పిట్టగోడ దగ్గరికెళ్ళి కిందికి చూశాడు.

అతనికంతా అర్ధమైంది.

మెల్లగా కూతురి దగ్గరికొచ్చి –

''అమ్మా! స్వప్నా! ...'' అన్నాడు మృదువుగా.

బెరుగ్గా చూసింది స్వప్న.

''ఎందుకమ్మా అలా పడేశావ్ ?'' అనునయంగా అన్నాడు.

''నాన్నా!.. '' అంటూ అతన్ని చుట్టేసింది స్వప్న.

పసి మనసులో పేరుకున్న బాధ అర్ధమైందతనికి. కూతురి వెన్ను నిమురుతూ మౌనంగా ఉండిపోయాడు.

స్వప్న దుఃఖం కాస్త తగ్గాక –

''ఊఁ!... ఇప్పుడు చెప్పు! .. ఎందుకలా చేశావ్ ?'' అన్నాడు రాజశేఖరం

''నాన్నా!... పాపం! వాళ్ళందరికీ బోల్డు ఆకలేస్తోంది, అందుకే.. '' ఆ పిల్ల మాట పూర్తి కానేలేదు–

''అలా అయితే పిల్చి పెట్టాలేగానీ– పైనించి కిందికిపడేస్తే అంతా మట్టిపాలుకాదూ ?'' అన్నాడు సున్నితంగా మందలిస్తూ.

''అదికాదు నాన్నా! వాళ్ళు దొంగలుకదా అందుకని...''

''దొంగలా ?...'' ఆశ్చర్యంగా చూశాడు రాజశేఖరం.

''అవును నాన్నా! వాళ్ళు దొంగలట!... నా నగలన్నీ దొంగిలిస్తారుట!'' భయం భయంగా చూస్తూ అంది స్వప్న.

''ఎవరు చెప్పారు ?...''

''అమ్మే!... చూడ్డానికలా ఉంటారుగానీ పిలువిక్కితే ఏది కనిపిస్తే అది పట్టుకు

పోతారట ! ... కదమ్మా ?" అంది తల్లికేసి చూస్తూ.

చటుక్కున మాధవి కూడా కిందికి చూసింది. ఆమెక్కూడా సంగతి అర్థమైంది.

"మరైతే... ఆ దొంగలకి ఎందుకు అన్నం పెట్టారి ?" కుతూహలంగా అన్నాడు రాజ శేఖరం.

"నిజమే !... కానీ... వాళ్ళ కెంతో ఆకలేస్తోంది నాన్నా !... అంతేకాదు... పాపం ! వాళ్ళకో చిన్న పాపాయి కూడా ఉంది ! ... దానిక్కూడా పారేసిన కారం మెతుకులు పెట్టారు. పాపం! మంట పుట్టదూ?" అమాయకంగా అంటున్న కూతుర్ని చూసి తెల్లబోయాడు రాజ శేఖరం.

"మరి ఆ పాపాయి తిన్నాదా ?" తడి ఆరి పోతున్న గొంతులో అన్నాడు.

"ఆఁ !... ఏడుస్తూనే తిన్నది. ఒకసారి పలమారి ఉక్కిరిబిక్కిరై పోయింది. అయినా ఆ కారం అన్నమే తిన్నది ! పాపం ! ... ఎంతాక లేసిందో !..." చిన్నారి స్వప్న కళ్ళనిండా నీళ్ళూరాయి.

రాజశేఖరం భార్యకేసి చూశాడు.

మాధవి ముఖం పాలిపోయింది !

వెంటనే నిన్న సాయంత్రం జరిగిన సంఘటన గుర్తొచ్చింది.

* * *

పెళ్లివారింట్లో అందరి భోజనాలు అయి పోయాయి.

పందిట్లో పిల్లలతో ఆడుకుంటున్న స్వప్న ఓ వింత దృశ్యాన్ని చూసింది

భోజనాలు అవగానే వంటవాళ్ళు విస్తళ్ళు తెచ్చి ఇంటి పక్కన మురిక్కాలవ దగ్గర పడేశారు.

వెంటనే నలుగురైదుగురు పరిగెత్తుకొచ్చి ఆ విస్తళ్ళన్నీ గబగబ ఓ పాతగుడ్డలో మూటలా కట్టుకుని కొంచెం దూరంగా తీసికెళ్ళారు.

అక్కడ చిన్నా పెద్దా కలిసి మరో పదిమంది ఉన్నారు.

మూట విప్పి, అందరూ ఆకుల కంటిన అన్నం, కూరలు, వగైరాలన్నీ తుడుచుకుని ఆప్యాయంగా తింటున్నారు.

పసివాళ్ళక్కూడా ఆ ఎంగిలి కారం మెతుకులే నోట కుక్కుతున్నారు.

మొత్తం తుడిచేసిన ఆ విస్తళ్ళని ఓ మూల పారేసి మళ్ళీ ఆశగా పెళ్ళింటికేసి చూస్తూ కూర్చున్నారు.

ఆ దృశ్యం అంతా చూసిన స్వప్న పసి మనసంతా ఆదోలా దిగులుగా అయిపోయింది.

మెల్లగా తల్లి దగ్గరికొచ్చింది—"అమ్మా!" అంటూ.

పని వత్తిడిలో ఉన్న మాధవి —

"ఏమిటి ?" అన్నట్టు చూసింది.

"అమ్మా ! ... "

"ఏమిటే ? ... "

"పాపం ! మనం వాకిట్లో పారేసిన విస్తళ్ళన్నీ తీసుకుని, అందులో పారేసినవన్నీ తింటున్నారమ్మా !" అంది స్వప్న బాధగా.

"ఎవరే?"అయోమయంగా అంది మాధవి.

"ఎవరో ముష్టివాళ్ళు !"

"పోన్లే !"

"అది కాదమ్మా ! మురిక్కాలవ దగ్గర మట్టిలో పడేసినవి తింటే వాళ్ళకి జబ్బు చెయ్యదూ ?" అమాయకంగా అంది స్వప్న.

"ఉఁహూ ! చెయ్యదు" అంది మాధవి పరధ్యానంగా.

"ఎందుకు చెయ్యదు. మూత లేనివి తింటేనే జబ్బులొస్తాయని చెప్పారు మా టీచర్. అలాంటిది మురిక్కాలవ దగ్గర పడేసినవి తింటే జబ్బులు రావేంటి ? అయినా వాళ్ళకి అలా తింటానికి అసహ్యం వెయ్యదూ ?" అంది స్వప్న.

కూతురి ప్రశ్నలకి తెల్లబోయిన మాధవికి క్షణం నోట మాట రాలేదు.

"ఏమ్మా ! వాళ్ళలా ఎందుకు తింటారు?" మళ్ళీ అడిగింది స్వప్న.

"వాళ్ళకి ఆకలేస్తుంది !... అందుకే అలా తింటారు !" అంతకన్నా ఏం చెప్పాలో తోచ లేదు మాధవికి.

"ఆకలేస్తే వాళ్ళింట్లోనే తినచ్చుగా ? వాళ్ళ పాపాయి ఎంచక్కా హార్లిక్స్ ఇవ్వచ్చుగా... అంత చిన్నప్పుడే అన్నం పెట్టకూడదని డాక్టరంకుల్ చెప్పలేదూ ?" స్వప్న కళ్ళలో కుతూహలం !

"ఉఁహూఁ !... వాళ్ళకి ఇంట్లో అన్నం ఉండదు ! హార్లిక్స్ అంతకన్నా ఉండదు !"

"ఏం ?..."

"వాళ్ళు బీదవాళ్ళు !" మెల్లగా అంది మాధవి.

"అంటే ?...

"వాళ్ళకి అస్సలు డబ్బుండదు !"

"ఓహో !... అయితే.. అమ్మా ! .. వాళ్ళెందుకు అంత బీదగా ఉన్నారు?" అమాయ కంగా మరో ప్రశ్న వేసింది స్వప్న.

"అదంతేలే !" విసుగ్గా లేవబోయింది మాధవి.

"అమ్మా ! మనకి బోల్డు డబ్బుందిగా... మనం కాస్త వాళ్ళకిస్తే వాళ్ళూ గొప్పవాళ్లౌతారుగా... ఎంచక్కా వాళ్ళ చిన్న చిన్న పాపాయిలకి పాలుపట్టచ్చు !"

"ఎంతమందికిస్తాం ? అలాంటి బీదవాళ్ళు చాలామంది ఉంటారు !" అర్థం అయేలా చెప్పాలని ప్రయత్నించింది మాధవి.

"మనలాంటివాళ్ళూ చాలామంది ఉన్నారుగా అందరూ ఇస్తే సరి !"

దీనికేం జవాబు చెప్పాలో తోచలేదు మాధవికి.

"అలాగే ! నువ్వు పెద్దయ్యాక ఇద్దువు గానిలే !" నవ్వుతూ తేల్చేసింది.

"అమ్మా !..." నసిగింది స్వప్న.

"మళ్ళీ ఏమిటే ?"

"వాళ్ళందరికీకూడా అన్నం పెడదామమ్మా! పాపం !... ఆకలేస్తోందేమో !" జాలిగా అంది స్వప్న.

"అదెలా కుదురుతుంది ?"

"ఏం ? ఎందుక్కుదరదు ? మనింటికి బోల్డు మంది భోజనానికొచ్చారు కదా, అలాగే






మరికొందరు ఎచ్చారనుకుందాం." వేడికోలుగా అంది స్వప్న.

"స్వప్నా !..."చిరాగ్గా అంది మాధవి.

"కాదమ్మా ! ... నగల్లేకపోతే పరవాలేదు. పట్టులంగాల్లేకపోయినా పరవాలేదు... కానీ.. పాపం ! అన్నం లేకపోతే ఎలాగమ్మా !.. ఆకలెయ్యదూ?" మళ్ళీ జాలిగా అంది స్వప్న.

ఆ పిల్ల కంట్లోని నీరు చూసిన మాధవి క్షణం చలించిపోయింది. వెంటనే తమాయించుకుని –

"ఛ ! ఛ !... చిన్నపిల్లని నీకెందుకే ఈ గొడవలన్నీ ? వెళ్ళి ఆడుకో ! పో !" అంటూ గట్టిగా అనేసి బైటికెళ్ళిపోయింది.

* * *

మాధవి మనసంతా భారంగా అయిపోయింది. పసిమనసు ఇంత లోతుగా ఆలోచిస్తుందని ఊహించలేదామె.

"వాళ్ళకోసమేనా నువ్వు ఇన్నిసార్లు ఆకలంది ?" మెల్లగా అంది.

"అవునన్నట్టు తల ఊపింది స్వప్న."

"మరి వాళ్ళు నువ్వు పడేసినవన్నీ తీసుకున్నారా ?"

"ఆఁ !... కానీ వంటవాళ్ళు మరీ మురిక్కాలువ పక్కనే పడేశారమ్మా!... పాపం !... వాళ్ళు తీసుకుంటుంటే కుక్కలు కూడా కరవబోయాయి !" కళ్ళలో నీరు తిరుగుతూండగా అంది స్వప్న.

మాధవి సిగ్గుతో కృంగిపోయింది. విషయం విన్న రాజశేఖరం కూడా నొచ్చుకున్నాడు.

"పసిదానికున్న దయ, జాలి మనకి లేవు ! ఎంతమందిని పిల్చి పంచభక్ష్య పరమాన్నాలతో పెట్టినా ఏదో ఓ వంక పెట్టి మరీ పోతారు కొందరు పెద్దలు. కానీ... గుప్పెడు పచ్చడి మెతుకులు పెడితే ఆకలి తీర్చినందుకు మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తారు వీళ్ళు !" బాధగా అన్నాడు.

"అవును !" అన్నట్టు తలవూపి –

"ఇదిగో మంగమ్మగారూ ! ఈ పక్కన తోటలో విస్తళ్ళు వేసి వాళ్లకు వడ్డించండి !" అంది మెట్లమీద నిల్చున్న వంటావిడతో.

"అమ్మా !" ఆనందంగా అంది స్వప్న.

"అవునమ్మా ! వాళ్ళందర్నీ పిల్చి కడుపు నిండా అన్నం పెడదాం" కూతుర్ని ప్రేమగా పట్టుకుని అంది మాధవి.

స్వప్న కళ్ళు వింతగా మెరిశాయి !

ఆ పసిపిల్ల తృప్తిగా ఊపిరి పీల్చుకుని ఒక్క పరుగున వీధిలోకి వెళ్ళింది వాళ్ళందర్నీ భోజనానికి పిలవడానికి.

పసిమనసులోని దయాగుణానికి పొంగిపోతూ అలా నిల్చుండిపోయారు మాధవి, రాజశేఖరం. ★

# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న
# దీని ధర 30% తక్కువ.

### ఇదిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో. అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక




ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృధాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — <u>మరింత</u> ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej ఉత్పాదన

CHAITRA-GS-188 TEL




## మరో సావిత్రి కథ

(యదార్థగాథలు) రచన : కుమారి వాసిరెడ్డి సీతాదేవి. "వనితా జ్యోతి" మాస పత్రికలో ధారావాహికంగా ప్రచురించిన ఇరవై ఒక్క యదార్థ గాథలు గల ఈ పుస్తకం వెల : రు 12/-. 179 పేజీలు. ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య (రిజిష్టర్డ్), 26–162 బుట్టాయిపేట, మచిలీపట్నం – 521001

## 1983–84 లో నేపాల్ దాడి
## ఇండియా అఖండ విజయం

రచన : శ్రీ గోకరాజు శ్రీరామరాజు. వెల: రు 1/- 11 పేజీలు. ప్రతులకు : ది ఎవరెస్ట్ పబ్లికేషన్స్, ప్రొ॥ కొణకంచి కృష్ణమూర్తి, భీమవరం – 534202.

## రండి స్వతంత్రదినోత్సవాన్ని జరుపుకుందాం !!

కవిత, తెలుగుసేత : శ్రీ కవిరాజమూర్తి. వర్తమాన సమాజ స్థితిగతుల నుద్దేశించి ఉర్దూలో సరైన చిత్రణ చేశారు శ్రీ హీరాలాల్ మోరియా. దానికి అనువాదమయిన ఈ పుస్తకం వెల. పది రూపాయలు. ప్రతులకు : శ్రీ హీరాలాల్ మోరియా, మోహన్ రోడ్డు, ఖమ్మం – 507003.

## స్వర్ణోత్సవ రథం

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల స్వర్ణోత్సవాల మధురస్మృతిగా వెలువడిన ప్రత్యేక వ్యాస సంపుటి ఈ పుస్తకం. వెల : రు. 25/-. ప్రతులకు : శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల, హిందూపురము – 515201.

## తెలుగు తల్లి – వెలుగు పందిరి

కవితల సంపుటి, సంకలన కర్త : శ్రీ కర్నాటి లింగయ్య ఈ సంపుటిలో సుప్రసిద్ధులు, యువకులు, ఉత్సాహవంతులు తమ అపూర్వమైన రచనలను తెలుగుతల్లికి సమర్పించారు. వెల : రు 8/-. 78 పేజీలు. ప్రతులకు : సంకలనకర్త పేర, 2–1–532, నల్లకుంట, హైదరాబాదు–500044 అన్న చిరునామాకు రాయాలి.

## కుసుమ గుచ్ఛము

రచన : శ్రీ మధునా పంతుల వేంకట పరమయ్య వెల : రు. 3/- 34 పేజీలు ప్రతులకు రచయిత పేర, రామారావుపేట, పెద్దాపురము(తూ.గో. జిల్లా)అన్న చిరునామాకు వ్రాయాలి.

## న వ త

సాహితీ ఉద్యమ వేదిక. సాలు చందా రు. 10/-. 7 పేజీలు ప్రతులకు సింహపురి సాహితీ సమాఖ్య, 10–170, సంతపేట, నెల్లూరు – 524001.

## గ్రహవాణి

జ్యోతిష మాసపత్రిక, సంపాదకుడు శ్రీ దివాకరుని వేంకట సుబ్బారావు. వెల:రు.2–50. 48 పేజీలు. ప్రతులకు సంపాదకుని పేర, స్టార్ ఆస్ట్రలాజికల్ రీసర్చి సెంటర్, 1–1–336/4, చిక్కడపల్లి, హైదరాబాదు–500020 అన్న చిరునామాకు రాయాలి.

---

ఇటీవల విజయవాడలో శ్రీనాట్యకళానిలయం మొదటి వార్షికోత్సవ సందర్భంగా ఏర్పాటు చేసిన నృత్య ప్రదర్శనలో అన్నమాచార్యులు కీర్తన 'అదివో...అల్లదివో' అభినయిస్తున్న చి॥ పి.వి. కాత్యాయనీదేవి. ఈమె నాట్యాచార్యులు శ్రీ జె.వి. శర్మ శిష్యురాలు.



## హంస ఎగిరిపోయింది

కవితలు, రచన కుందుర్తి వెల రు 5/-. 32 పేజీలు. ప్రతులకు శ్రీ కె సత్యమూర్తి, ఎమ్.సి. 15, మలక్‌పేట కాలనీ, హైదరాబాదు – 500036.

## హాస్యాంజలి

కార్టూన్ సంకలనం, సంకలన కర్త : జి. ఎస్.ఆర్ అప్పడాల కర్రకార్టూన్ ఒక్కటికూడా లేకపోవడం ఈ పుస్తకంయొక్క ప్రత్యేకత వెల : రు. 5/-. ప్రతులకు : శ్రీ జి. ఎస్. రామారావు, ఎన్.ఆర్.టి. 270, సనత్ నగర్ కాలనీ, హైదరాబాదు – 500018.

## సూర్యరథం

కవితా సంకలనం, రచన : శ్రీ రాజా. వెల : రు. 5/-. 28 పేజీలు. ప్రతులకు రచయిత పేర, 7–37, సంగీత నగర్, హైదరాబాదు – 500872 అన్న చిరునామాకు రాయాలి.

## శ్రీ మద్భగవద్గీతోపనిషత్తులు

టీకా తాత్పర్యం, భావయుక్తంగా పఠించుటకు సూచనలతో పాఠకుడు తత్వదృష్టితో చదువుకొని అర్థం చేసుకొని మననం చేసుకోవడానికి వీలుగా ఉంది. అధ్యయనం చేయడం ఎలాగో వివరిస్తూ శ్లోకాలను సరిగా చదవడానికి అన్వయక్రమం తెలుసుకోడానికి ఈ గ్రంథంలో ప్రయత్నం జరిగింది. వెల.రు 20/-. 748 పేజీలు. ప్రతులకు : శ్రీ కృష్ణానందాశ్రమ గీతా ప్రచార సంఘం. రిజిస్టర్డు నెం. 308/67. దిల్‌సుక్ నగర్, హైదరాబాదు – 500036.

## ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు

రచన : డాక్టర్ అంతటి నరసింహం. ఈ సిద్ధాంత వ్యాసమందు వర్ణనా ప్రధానములయిన తెలుగు ప్రబంధములలోని ప్రకృతి వర్ణనా విశేషములు అందు ఆయా కవుల ప్రతిభాచమత్కారములును చక్కగా వ్రాసారు రచయిత. ప్రతి ప్రకరణము కూలంకషముగ చర్చించిన అనంతరము కడపట ఆ ప్రకరణ చర్చాసారాంశము నొసగుట ఈ సిద్ధాంత వ్యాసమందలి ప్రత్యేకత. వెల : 65/-. 428 పేజీలు. ప్రతులకు : సమతా సాహితి, 3–4–705/5, నారాయణగూడ, హైదరాబాదు.

## విశేష సంచిక

నల్లగొండ జిల్లా రచయితల మూడవ మహాసభల విశేష సంచిక. ప్రధాన సంపాదకులు: శ్రీఫణి కుమార్. వెల : రూ. 10 లు. 84 పేజీలు, ప్రతులకు : యువరచయితల సమితి, నల్లగొండ.



# హైదరాబాదు నోట్‌బుక్

## లోకసూత్రాణి ఆవిష్కరణ :

హైదరాబాద్ వాస్తవ్యులు పండిత రత్నం శ్రీ పెరుమాళ్ళ గుండాచార్యులు రచించిన లోకసూత్రాణి అనే సంస్కృత గ్రంథం ఆవిష్కరణ జూన్ 6వ తేదీన మద్రాసు తిరువల్లిక్కేణిలోవున్న ఫండ్ సత్రంలో (8 సింగరాచారి వీధి) వైభవోపేతంగా జరిగింది. ఈ గ్రంథాన్ని గుండాచార్యులు తిరుమల రామచంద్ర ద్వితీయ పుత్రిక సౌ. ఆముక్తమాల్యద వివాహ సందర్భంలో ఆమెను, ఆమె భర్త శ్రీ కిడాంబి శేషాచార్యుల తృతీయ పుత్రుడు శ్రీ కిడాంబి రాజన్‌కు మంగళా శాసన పూర్వకంగా అందజేశారు. గ్రంథాన్ని ఆవిష్కరించవలసిన తమిళనాడు ఆరోగ్యశాఖా మంత్రి డాక్టర్ హెచ్. వి. హండే రాజాలనందున సిస్టర్ నివేదిత అకాడెమీ డైరెక్టర్ శ్రీ ఆర్. రంగరాజన్ సభకు అధ్యక్షత వహించి గ్రంథాన్ని ఆవిష్కరించి తొలిప్రతిని వధూవరులు సౌ ఆముక్తమాల్యదకు, శ్రీ కిడాంబి రాజన్‌కు అందజేసారు. ఈ సందర్భంలో శ్రీ ఆర్. రంగరాజన్ ప్రసంగిస్తూ సూత్రీకరణ పద్ధతి భారతదేశంలో అనాదిగా వున్నదని, ఆ సంప్రదాయం విచ్ఛిన్నం కాకుండా శ్రీ గుండాచార్యులుగారు ఆధునిక లోకానికి అనుగుణంగా, ఆధునిక యువకుల చరిత్ర నీతి యుతంగా తీర్చిదిద్దే ఉద్దేశంతో ఈ గ్రంథం రచించారని, ఈలాటి గ్రంథాన్ని వివాహ సమయంలో వధూవరులకు బహూకరించడం సముచితమని, వారి భావి జీవితానికి మార్గదర్శకంగాను వుండగలదని అన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖ రీడరు శ్రీమతి డాక్టర్ కమలా రఘుపతిరావు ప్రసంగిస్తూ, ఈ గ్రంథంలో ఆరు భాగాలున్నాయని వివరించారు. "మొదటి భాగం కర్మ (పని) ప్రాధాన్యం వివరిస్తుంది. రెండవభాగం దేశభక్తిని, విశ్వ మానవ భక్తిని తద్వారా మాధవ భక్తిని ప్రబోధిస్తుంది. మూడవ భాగం దేశనాయకుల లక్షణాలను వివరిస్తుంది. నాల్గవభాగం దేశసేవా స్వరూపాన్ని, ఐదవ, ఆరవ భాగాలు ప్రముఖ దేశనాయకుల జీవితాలను తెలుపుతున్నది. ఈ సూత్రాలను గుండాచార్యులుగారు ప్రాచీన బ్రహ్మసూత్ర, పాణిని సూత్ర పద్ధతిలో రచించి, వాటికి లఘు వ్యాఖ్య వ్రాశారు. తెలుగుటీక మరొకరు వ్రాశారు. ఆంగ్లటీకను మద్రాసు విశ్వవిద్యాలయంసంస్కృత శాఖలో పరిశోధన విద్యార్థిగా వున్న శ్రీ తిరుమల శేషశాయి రచించారు. గృహస్థ జీవితంలో ప్రవేశిస్తున్న నూతన వధూవరులకు దీనిని ఉపహారంగా ఇవ్వడం ఎంతో సముచితం. ఈ గ్రంథం ఆధునిక యువత జీవితాన్ని తీర్చిదిద్దగలదని ఆశిస్తున్నాను" అన్నారు. ఈ గ్రంథాన్ని హైదరాబాద్ ప్రాకృత అకాడెమీ ప్రచురించినందున, ప్రాకృత అకాడెమీ పక్షాన సభాధ్యక్షుడు శ్రీ రంగరాజన్ శ్రీ గుండాచార్యులను పట్టు వస్త్రాలతో గౌరవించారు. సూత్రకారుడు శ్రీ గుండాచార్యులు ధన్యవాదాలు సమర్పిస్తూ తమ గ్రంథ రచనోద్దేశం వివరించారు. యువతను జాగృతంచేసి, వారిని దేశభక్తులుగాను, మానవతా భక్తులుగాను, చివరికి మాధవ భక్తులుగా చేయడం తమ ఉద్దేశమని, గ్రంథం ప్రచురించిన ప్రాకృత అకాడెమీకి కృతజ్ఞుడినై వుంటానని అన్నారు. సుప్రసిద్ధ వాయులీన విద్వాంసురాలు శ్రీమతి ద్వారం మంగతాయారు గారి వాయులీన కచ్చేరీ తర్వాత శ్రీమతి తిరుమల అనంతలక్ష్మి ధన్యవాదాలతో పుస్తకావిష్కరణోత్సవం సమాప్తమైంది. ప్రారంభంలో మద్రాసు విశ్వవిద్యాలయం పరిశోధన విద్యార్థి శ్రీ ప్రభాకరన్ స్వాగతం చెప్పారు. వివాహానికి, ఆవిష్కరణ సభకు స్థానిక ప్రముఖులు, రచయితలు, ప్రొఫెసర్ గణపతి, బహురూపధారి డాక్టర్ వి. చంద్రశేఖరం, బి. ఎస్. ఆర్ కృష్ణ, కొసరాజు, బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు మున్నగువారు వచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ ఆవుల సాంబశివరావు, మాజీ వైస్ చాన్సలర్ శ్రీ ఎం. ఆర్. అప్పారావు, మాజీ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు, సుప్రసిద్ధ సంపాదకులు డాక్టర్ నార్ల వేంకటేశ్వరరావు, శ్రీ శివలెంక రాధాకృష్ణ, శ్రీ రామోజీరావు, మాజీ మంత్రి శ్రీ టి. హయగ్రీవాచార్యులు, పలువురు విద్వాంసులు, కవులు, రచయితలు శుభాశంసలు పంపారు.

## వీర సావర్కర్ శత జయంతి :

విఖ్యాత స్వాతంత్ర్య సమర వీరుడు, జీవితాన్నంతా దేశ స్వాతంత్ర్యానికే మీదు కట్టిన మహానుభావుడు శ్రీ వినాయక దామోదర్ సావర్కర్ శత జయంత్యుత్సవం మే 28,29 తేదీలలో హైదరాబాద్‌లో భక్తి ప్రపత్తులతో జరుపబడింది. 28వ తేదీ ఉదయం హోటల్ రాజధానిలో జరిగిన సదస్సుకు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి. వి. చౌదరి అధ్యక్షత వహించారు. ప్రతి పౌరునికి సేవా దృష్టి అవసరమని, సంఘం తమకేమి చేసిందనికాక, సంఘం కోసం తామేమి చేస్తున్నామని ఆలోచించుకోవాలని, అలాటి ఆలోచన కలిగించిన మహానుభావుడు వీర సావర్కరని శ్రీ చౌదరి అన్నారు. రాజకీయాలను సొంతానికి వినియోగించుకొనే ఈ సమయంలో సావర్కర్ వంటి మహాదేశ భక్తుని ఉపదేశాలు అవసరమని ఆయన అన్నారు. "ప్రస్తుత పరిస్థితులలో సావర్కర్ జాతీయత" అనే విషయమై జరిగిన సదుస్సులో ఆచార్యులు వి.వి. సహానే, డాక్టర్ బి. రామరాజ (ఉస్మానియా విశ్వవిద్యాలయం), డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు (హైదరాబాద్ విశ్వవిద్యాలయం), ప్రముఖ న్యాయవాది, బాల సావర్కర్ బిరుదాంచితులు శ్రీ డి.ఎం. దేశముఖ్, శ్రీ తిరుమల రామచంద్ర ప్రసంగించారు భారతదేశం ద్విజాతి సిద్ధాంతంపై స్వతంత్రమైంది గనుక, హిందూ

**బ్యాంక్ ఆఫ్ బరోడా, విజయవాడ శాఖ రజతోత్సవ సందర్భముగా విచ్చేసిన ఛైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ వై. వి. శివరామకృష్ణయ్యగారిని అభినందిస్తున్న బ్యాంకు సిబ్బంది.**



## మనవి

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ — 520 003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తి పేరు, చిరునామా యివ్వడం ఎంతైనా అవసరం. —సం.







## హైదరాబాద్ నోట్ బుక్

జాతి అంతా ఒక్కటేనని సావర్కార్ జాతీయతా వాదం, ప్రజాస్వామ్య పద్ధతి ప్రకారం అధిక సంఖ్యాకుల పాలన అల్పసంఖ్యాకులకు రక్షణ అనే సావర్కార్ వాదం ఇప్పటి పరిస్థితికి అవసరమేనని వక్తలందరూ తమ అభిప్రాయం ప్రకటించారు. ఈ సదస్సుకు అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షుడు శ్రీ వందేమాతరం రామచంద్రరావు అధ్యక్షత వహించారు. సాయంకాలం గౌలీగూడాలోని వివేకవర్ధనీ మైదానంలో జరిగిన బహిరంగ సభకు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి. వి. చౌదరి అధ్యక్షత వహించారు. సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభ అధ్యక్షులు శ్రీ రామ్‌గోపాల్ జీషావ్‌వాలే, ఆచార్య బాల్‌రాజ్ మధోక్ (మాజీ పార్లమెంట్ సభ్యుడు) ప్రసంగించారు. 29న హోటల్ రాజధానిలో "భారత ప్రభుత్వ మత ప్రసక్తి రహిత విధానం — మత అల్పసంఖ్యాకులు" అనే విషయమై జరిగిన సదస్సుకు రాష్ట్ర హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి, మాజీ మంత్రి డాక్టర్ గోపాల్‌రావ్ ఎక్‌బోటే, అధ్యక్షత వహించారు. డాక్టర్ సీతారామశాస్త్రి మున్నగు వారు పాల్గొన్నారు. 29 సాయంకాలం వివేకవర్ధనీ మైదానంలో జరిగిన బహిరంగ సభకు వందేమాతరం రామచంద్రరావు అధ్యక్షత వహించారు. శ్రీ వందేమాతరం రామచంద్రరావు రచించిన "ప్రిన్స్ ఎమంగ్ పేట్రియట్స్ — వీర్‌సావర్కార్" అనే ఆంగ్ల గ్రంథాన్ని శ్రీ దేవులపల్లి రామానుజరావు ఆవిష్కరించారు. శ్రీ విక్రమ్ సావర్కార్, శ్రీ రాంగోపాల్ జీషాల్‌వాలే మున్నగువారు సావర్కార్ పరాక్రమాన్ని, సిద్ధాంతాలను గురించి ప్రసంగించారు.

**ఉపశ్రుతి :**

ఏంసార్, రావి నారాయణరెడ్డి ఫౌండేషనుకు రాష్ట్ర ఇందిరా కాంగ్రెస్ 50 వేల చందా వసూలు చేసిస్తుందట. వార్త చదివారా పత్రికలలో ? — అనడిగాడు నన్నొక మిత్రుడు. ఔను, భారత కమ్యూనిస్టు పార్టీ ఇందిరా కాంగ్రెస్ ప్రభుత్వ విధానాలను ముందు పెట్టి సమర్థిస్తున్నప్పుడు, ఇందిరా కాంగ్రెస్ అంత మాత్రం కృతజ్ఞత ప్రకటించవద్దా? — అన్నారొకరు మా మిత్రుని ప్రశ్న విన్న తర్వాత.

— తిరుమల రామచంద్ర *


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor : S Radhakrishna.

# సిటీ బస్సుల పై వ్యాపార ప్రకటనలు

ARUN    ఎమ్వీఆర్





















1983 బొంబాయి
బిజీ తార
జయప్రద

తాజా వార్తలతో పాటు
తాజా సినిమా కబుర్లు
అందించే
ఏకైక దినపత్రిక....




దినపత్రిక కావలసినవారు మా వారపత్రిక అమ్మేచోట అడగండి.
లేదా మా ఏజెంటును సంప్రదించండి.

GEE